

# నేను రాత్రంతా నాట్యం చేసియుండవచ్చును...

నాట్యము ముగిసినతరువాత కోలాహలం వినగానే ఆనంద పరవశురాలనయ్యాను. చప్పట్లు, హర్షధ్వానులుగా మారి నపుడు నేను రాత్రంతా నాట్యం చేస్తూయుండియుండవచ్చును. పరిశీలకులు నాకు ప్రథమ బహుమతిని నిర్ణయించినపుడు పరమానందం కలిగింది. బంగారు పతకాన్ని తీసుకోడానికి మళ్ళీ స్టేజిమీద కొచ్చాను. ముందుగా నన్నభినందించినవారు నా గురువుగారు. సగర్వంగా మా అమ్మతో ఇలా అన్నారు: "రెండేళ్ల క్రితం నేను నాట్యం నేర్పుట ప్రారంభించినపుడు బక్కగావున్న అమ్మాయే ఈమె అని యెవరు గుర్తించ గలరు." మా అమ్మకు మాట రాలేదు: ఉప్పొంగిపోయింది.

మా గురువుగారన్నది వాస్తవమే. రెండేళ్ల క్రితం నాకు అలసిపోకుండా పావుగంట నాట్యంచేసే శక్తి వుండేది కాదు. మా అమ్మ డాక్టరును సహితం అడిగింది. బాగా పరీక్షించి యేమి చింతించ నక్కరలేదన్నారాయన. "ఈమెకు సరియైన నియమిత భోజనం కావాలి. అంటే. విటమిన్లు, ప్రోటీన్లు, కార్బోహైడ్రేట్లు, లోహాదులు మరీ ముఖ్యమైన కొవ్వుపదార్థములు కలసిన ఆహారము. శుద్ధమైన తాజా క్రొవ్వుపదార్థము మన ఆహారంలో ముఖ్య భాగము. ఎందుకంటే రోజూ మనకు కావలసిన శక్తిని ఇచ్చుటకు అది ఉపకరిస్తుంది." అని ఆయన చెప్పారు.

మర్నాడే మా అమ్మ మా కొటా దుకాణదారునివద్దకు వెళ్లి 'అసలైన మంచి వంట క్రొవ్వుపదార్థము కావాలి' అని అన్నది. ఆతడు తక్షణం ఒక డాల్డా వనస్పతి డబ్బాను తీసి 'దీనికంటె మంచిది మరేదియు లేదు' అని అన్నాడు. మా అమ్మ డాల్డాతో వండిన ఆహారమును వడ్డించినప్పటినుండి నాకు ఎప్పటి ఆకలి కలిగింది. ఎందుకంటే డాల్డా వనస్పతి ప్రతి ప్రదార్థమునుండి సహజ రుచిని కలిగిస్తుంది. త్వరలోనే నాకు అలసట పోయింది. కొద్దికాలంలోనే మూడు గంటలసేపు సాధకం చేస్తుండేదాన్ని. శక్తినిచ్చుటకు డాల్డా వనస్పతిని మించింది లేదు. ఇప్పుడు డాల్డాలో విటమినులు ఏ, డి యున్నవి. గాలి చొరవకుండ సీలుచేయ బడిన డబ్బాలో అది యెల్లప్పుడు క్రొత్తగాను, శుద్ధముగాను, ఆరోగ్యకరముగాను నుండునని మీరు దృఢంగా నమ్మవచ్చును. దీనివలన ఖర్చు తక్కువకూడ. మీ కుటుంబానికి డాల్డా వనస్పతిని వాడుటకు యెందుకు మొదలుపెట్ట గూడదు? ఇవ్వాళే ఒక డబ్బాను తీసుకొనండి!

శరీరమును నిర్మించే ఆహారముల
ప్రాముఖ్యత
ఉచిత సలహాకు ఇవ్వాళే క్రింది
అడ్రసుకు వ్రాయండి:
ది డాల్డా అడ్వైసరీ సర్వీస్
పోస్టుబాక్సు నంబరు 353, బొంబాయి 1




పెట్టుతోనున్న
డబ్బాకై చూడండి

10 పౌనుల, 5 పౌనులు, 2 పౌనులు మరియు 1 పౌను డబ్బాలలో దొరకుచున్నది

## డాల్డా వనస్పతి

వంటకు దివ్యమైనది — ఖర్చు తక్కువ

HVM. 216-X52 TL

# భారతి

సాహిత్య మాసపత్రిక

సంపాదకుడు :

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1954

సంపుటము 31 : : సంచిక 9

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

-: o :-

## సెప్టెంబరు 1954



త్రివర్ణ చిత్రము : హాల్లీసకం—రణవీర్ శాక్సేనాగారు










# లైఫ్‌బాయ్ సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిములనుండి
మిమ్ములను కాపాడును




ఇండియాలో తయారుచేయబడినది

L. 249-X52 TL




జయ
భాద్రపదము

# భారతి

సంపుటము 31
సంచిక 9




ఈ సెప్టెంబరు 2 వ తేదీన తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు ప్రారంభోత్సవం జరిపారు. ఆ సందర్భంలో ఛాన్సెలర్, ఆంధ్రహైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావుగారు విశ్వవిద్యాలయ అవతరణక్రమాన్ని నివేదించుచున్న దృశ్యం.

# * బ్రహ్మోపాసన

శ్రీ చేబోలు సుబ్రహ.

శ్రీ రామచంద్రుని ఆజ్ఞపై లక్ష్మణుడు సీతను అరణ్యమున దిగవిడిచి, ఆ దుర్గమారణ్యంలో శ్రీరామునివిరహాన్ని అనుభవించుతూ సీత ఎలా జీవించగలదని దుఃఖాక్రాంతుడౌతాడు. సీతాదేవి నవ్వి, విశ్వస్వరూపుడైన రాముణ్ణి ఉపాసించటానికి అయోధ్యలోనే ఉండనక్కరలేదనిచెప్పి లక్ష్మణుణ్ణి ఓదార్చుతూ తన రామభావనను వ్యక్తీకరించుతుంది:

ఆలోచింతు వచింతు సంచితతతి వ్యాపారపారీణ చే
తోలోకానుభవానుభూతి ఫలసందోహ ప్రకారంబులన్
గాలోచిత్యనుసారవర్తనుల సంఖ్యావంతులం గొల్చున్
భూలాలిత్యముగాంతు నీ వనములోఁ బుణ్యాంబుపార్జించుచున్.

మృగశాబంబుల చంచలాంచలచల న్మిశ్రప్రభాదృష్టిలో
నగరాజాన్వయజాత భూజలతికా నాట్యప్రభారాశిలో
జగదంతర్నిబిడీకృతాంధకతల శ్రాంత ప్రభాధారలో
ప్రగతింగాంతు రమాధవున్ బ్రకృతిలోఁ బ్రత్యక్షముం జేయుచున్.

సెలయేళ్ళన్ విహరింతు లేళ్ళగుమితో స్నేహమ్ముతో రక్తితో
నల శ్రీరాముని యంతరంగ లహరీ వ్యాసంగ తాత్పర్య చే
ష్టల బ్రహ్మంబగు దివ్యరంగములలో స్థాపింతుఁ గైవల్య ము
జ్జ్వల తేజోవిభవాభిరామపదవీ స్థానంబు లోఁ గాంచెదన్.

మునికన్యాతతియందు వెల్గులమనమ్ముం ద్రిప్పి బ్రహ్మమ్ములోఁ
గను తేజంబులఁ గాంతు నందుఁగల ప్రఖ్యాతిన్ స్తుతింతుఁ హరి
ప్రణవంబున్ వహియింతు రామునటనే భక్తిప్రభాతంతులన్
గుణభాగంబులఁ గట్టి గొల్తు సతమున్ గోర్కెల్ మదిందీరఁగన్.

పూవుల సౌరభంబుల నపూర్వకథాశ్రుతు లుల్లసిల్లఁగా
నావిహితంబులఁ విధుల సన్నిట భక్తిని సల్పుచుండి యా
పూవుల గంధపీఠములఁ బూర్ణమనోరథసిద్ధినిచ్చు నా
దేవవిభుఁ మదిఁ గొలుతు దివ్యజగత్తులు సృష్టిసేయుచున్.

ఆకాశంబున గోళగర్భముల నయ్యాశక్తులంగాంచి లో
కైకత్రాణుని రామభద్రుని నటన్ వ్యత్యాస శూన్యస్థితిన్
రాకాచంద్రనిభున్ గనన్ గనుల నా ప్రాణానిలంబాడ్డి య
స్తోకంబైన దయారసంబును మదిం దుష్టిం దగం గ్రోలెదన్.

పూవులోఁ బరిమళమ్ముఁ బోలి పరిమ
ళములయందు మాధురిఁ బోలి లయమునొందు
గుణము జీవాత్మ పరమాత్మ గుణమటంచు
వనము గుణపాఠముం జెప్ప విని తరింతు.

కోకిలల కంఠనాదమ్ము కుహూ కుహూ య
టంచు వినిపించనద్దాని నెంచి నాద
రూపమగు పరబ్రహ్మమ్ము చూపులోన
గాంతు శ్రీరాము దివ్యమంగళ సుమూర్తి

గా బర్హ చిత్రవిచిత్ర వర్ణకాంతి
వాహినీరయ చలితుండు వదనపద్మ
వనవిహారచతురుఁడు మత్ప్రణయమూర్తి
వార్తనంది యంపెంచు నవ్యత్వమంది.

ఇందు చకోరకీరముల యీప్సితసిద్ధికి రామచంద్రునిన్
సుందరమూర్తులన్ నిలిపి చూపి తరింపఁగఁజేయువృత్తిలో
నం దలక్రిందుగాఁ దపమునం జరియింతుఁ బరార్థలబ్ధికై
యెందఱో నావలెన్ దపము లెన్నియొ చేసి తరింపవిందుఁగా.

పద్మవనీవిహారములఁ బాటవమందిన హంసరాజముల్
సద్మ మలంకరించుకొను జాణతనంబుల నేర్పి రాము హృ
త్పద్మమునందు సద్మముల బంగరుకాంతుల నిల్పుకొందు హృ
త్పద్మనివాస సౌఖ్యములు బ్రహ్మమయంబులటంచు నెంచుచున్.

# రాజ్యాంగసవరణలు

శ్రీ కె. నారాయణరావు

రాజ్యాంగములోని అతి ముఖ్యమైన కొన్ని సూత్రములను సవరించవలెనని పదమూడు రాష్ట్రప్రభుత్వములు1 ఈ మధ్యను సూచించినవి. అలజడితో కూడుకున్న వాతావరణములో కాక, ప్రశాంత వాతావరణములో మూడు సంవత్సరములకు పైగా ఉపవిష్టులై, సుదీర్ఘమైన చర్చలు జరిపి, వివిధ దేశాల రాజ్యాంగ సూత్రముల నాకళింపు చేసుకొన్న యనంతరము, ప్రముఖ రాజకీయవేత్తలు, న్యాయశాస్త్రజ్ఞులు, మన రాజ్యాంగమును తయారు చేసిరి. తయారుచేసి ఐదువత్సరములైననూ నిండలేదు, రాజ్యాంగమును సవరించవలెనను ప్రసక్తివచ్చినది. "భారతదేశస్థులమైన మనము తయారుచేసుకున్న రాజ్యాంగ మం"టూ రాజ్యాంగము చెప్పుచున్నప్పటికీ, అధిక ప్రజానీకమునకు రాజ్యాంగ ప్రాముఖ్యతగాని, విశిష్టతగాని తెలియదనుటలో సందేహము లేదు. ఈ సందర్భములో రాజ్యాంగముయొక్క స్వభావమును, దాని ఆశయమును తెలుసుకొనుట అప్రస్తుతముకాదు.

## : రాజ్యాంగ స్వభావము !

సామాన్య చట్టమువలె కాకుండా, రాజ్యాంగ చట్టము నిర్వర్తించవలసిన సుస్థిరబాధ్యతలు చాలా గలవు. పూర్వము, రాజాధిరాజుల కాలములో, అధికారములన్నియు ఒక్క వ్యక్తిపరముగనే యుండెడివి. ఆనాడు లిఖితపూర్వకమైన రాజ్యాంగములంటూ యుండెడివికావు. చిరకాలమునుంచీ వారసత్వముగా వచ్చు అధికారములను రాజు లనుభవించెడివారు. ఆంతరంగికముగా తమ ఆత్మకు సంబంధించిన పాపభీతి, దైవచింతన యను రెండుశక్తులు తప్ప, తమ అధికారములను పరిమితము చేయు బాహ్యశక్తులేవియు నుండెడివి కావు. రానురాను, రాజ్యపరిపాలనలో ప్రజాబాహుళ్యమునకుగూడా కొంతభాగ ముండవలెనను బలవత్తరమైన వాంఛ యుద్భవిల్లినది. దానిఫలితముగా రాజులకు, ప్రజకు మధ్య ఘర్షణలు సంభవించినవి. ఇంగ్లండుదేశమువంటి కొన్నిచోట్ల ఈ ఘర్షణలు శాంతియుతముగా పరిష్కరింపబడి, నామమాత్రవ్యవస్థగా రాచరిక మున్నప్పటికి, రాజ్యాధికారములన్నియు ప్రజల కంకితము చేయబడినవి. ఫ్రాన్సుదేశమువంటి కొన్నిచోట్ల ఈఘర్షణ రక్తపాతమునకు దా[illegible] చివరకు రాచరికములే తుడిచివేయబడినవి. ఈవిధముగా రాచరికము లంతరించి ప్రజాస్వామ్యము లేర్పడినవి ప్రజాస్వామ్యములో నిపాలనాధికారములు వివిధోపాంగము (*Organs*) లలో వికేంద్రీకరణము చేయబడినవి. అట్టి ఉపాంగములలో ముఖ్యమైనవి మూడు:

(1) శాసనసభ (*Legislative*): శాసనములను చేయునది.

(2) కార్యనిర్వాహకవర్గము (*Executive*): అట్టిశాసనముల నమలులోనికి తీసుకొనువచ్చునది;

(3) న్యాయశాఖ (*Judiciary*): శాసనోల్లంఘన జరుగునప్పుడు, దానిని విచారించునది.

పైన పేర్కొన్న మూడు ఉపాంగములలో ఏయే ఉపాంగమున కేయే యధికారము లీయవలెనన్న విషయము రాజ్యాంగము నిర్ణయించును. అంతియేగాక, పై మూడు ఉపాంగము లెంతవర కొకదానిపై నొక టాధారపడుతూ, కలిసికట్టుగా పనిచేయవలెను, ఎంతవరకొకటి మరియొకదానితో ప్రమేయము లేకుండా స్వతంత్రముగా వ్యవహరించవచ్చును, ఏయే సమయములలో నొక యుపాంగము నిర్వర్తించవలసిన బాధ్యత లింకొకటి నిర్వర్తించవచ్చును అన్న విషయములను గూడా రాజ్యాంగమే నిర్ణయించును.

## ఉదాహరణలు :

(*a*) ఆధారత: కార్యనిర్వాహకవర్గములను శాసనసభలు యెన్నుకొనును; శాసనసభలను రద్దు

1. కేంద్రప్రభుత్వము, రాష్ట్రప్రభుత్వమని వాడిన ప్రతిచోట ఆయా ప్రభుత్వముల కార్యనిర్వాహకవర్గము (*Excutive i. e. Ministry*) అన్న విషయము జ్ఞప్తియందుంచుకొనవలెను.

చేయు అధికారము కార్యనిర్వాహకవర్గమున కుండును; విశ్వాసరాహిత్యతీర్మానము ద్వారా కార్యనిర్వాహక వర్గమును [2] అధికారమునుండి శాసనసభ దింపివేయవచ్చును; జడ్జీలను కార్యనిర్వాహక వర్గము నియమించును; పార్లమెంటుకోరికపైని, కార్యనిర్వహాకవర్గము జడ్జీలను పదవులనుండి తీసివేయవచ్చును.

(*b*) కలిసికట్టుగా పనిచేయుట (*Co-operation*): సామాన్యముగా చట్టములను చేయు హక్కు శాసనసభ కుండును కాని శాసనసభచే నంగీకరించబడిన బిల్లులన్నియూ కార్యనిర్వాహక వర్గము (రాష్ట్రపతి, లేదా గవర్నరు)యొక్క ఆమోదము నందనిదే, శాసనములు కానేరవు. ఆ మేరకు పై రెండుపాంగములునూ కలిసికట్టుగా పనిచేయవలయును. సామాన్యముగా శాసనసభచే నామోదించబడిన బిల్లును కార్యనిర్వాహకవర్గ మడ్డు జెప్పకుండా ఆమోదముద్ర వేయును. ప్రజామోదము లేని యేదైనా ఒక బిల్లును శాసనసభ తొందరపడి ఆమోదించినప్పుడు, కార్యనిర్వాహక వర్గము దానిని నిరాకరించుటగాని, లేదా, పునర్విచారణకు శాసనసభకు పంపించటము గాని జరుగును. ఈమధ్యను మంత్రుల జీతముల నిర్ణయించు బిల్లు విషయములో ఆంధ్రరాష్ట్ర గవర్నరు, శాసనసభచే నామోదించబడిన బిల్లు నంగీకరించకుండా, మరల పరిశీలించవలసినదిగా శాసనసభకు తిరిగి పంపించిన విషయము మన మందర మెరిగియున్న విషయమే.

(*c*) స్వతంత్రత : పై మూడు ఉపాంగములు సమాన హోదాలో నున్నప్పటికీ, శాసనసభ, కార్యనిర్వాహకవర్గము చేయు కార్యములు రాజ్యాంగమునకు విరోధముగానున్నవని న్యాయశాఖ తలచినప్పుడు ఎట్టి జంకునూ లేక స్వతంత్రించి, ఆ కార్యములు చెల్ల నేరవని తీర్పు నిచ్చును.

(*d*) అన్యాక్రాంతత : శాసనములను చేయు బాధ్యత శాసనసభదైనప్పటికీ, కొన్ని కొన్ని సమయములలో, కార్యనిర్వాహక వర్గము గూడా ఆర్డినెన్సు (*Ordinances*)ల ద్వారా శాసనములను చేయవచ్చును.

పైన పేర్కొన్న విషయములనన్నిటిని రాజ్యాంగము నిర్ణయించును.

ఆవిధముగనే మనదేశమువంటి సంయుక్త ప్రభుత్వాలలో (*Federal Governments*) కేంద్రమునకు (*Union*), రాష్ట్రములకు మధ్య అధికారములను పంపిణీ చేసి, నిర్వర్తించవలసిన విధులను రాజ్యాంగము నిర్ణయించును. సామాన్యముగా, దేశరక్షణ, విదేశ వ్యవహారములు, రైల్వేలు, తంతి తపాలాలు మొదలగు సమస్యలను కేంద్ర ప్రభుత్వము చూచుచుండును. మున్సిపాలిటీలు, విద్య, వ్యవసాయము మొదలగు ప్రాంతీయవ్యవహారములు రాష్ట్ర ప్రభుత్వాల ఆజమాయిషీలో నుండును.

అంతియేగాక, ఏయే ప్రాథమిక హక్కులను (*Fundamental Rights*) ప్రజానీకమునకు సంక్రమింపజేయవలెనో యన్న విషయమును నిర్ణయించి, వాటికి భంగము వాటిల్లకుండా కాపాడే గురుతర బాధ్యత రాజ్యాంగముపై నున్నది. రాజ్యాంగము ప్రసాదించిన హక్కుల మేరకు శాసనసభలు, కార్యనిర్వాహకవర్గములు కట్టుబడియుండును. వాటికేమాత్రము భంగము వాటిల్లినను వెంటనే దర్యాప్తు చేయగల అధికారమును రాజ్యాంగము న్యాయస్థానమున కిచ్చుచున్నది. ఉదాహరణమున కొక్క విషయమును తీసుకొందము. ఉద్యోగముల నీయునపుడు, జాతి, మత, వర్ణభేదములను పాటించకూడదని మన రాజ్యాంగములోని పదహారవ సూత్రము వక్కాణించుచున్నది. దానికి వ్యతిరేకముగా, "వైష్ణవు లెవ్వరికీ ఉద్యోగముల నీయరాద"ని, శాసనము చేయబడినచో నట్టి చట్టము చెల్ల నేరదని న్యాయస్థానము ఉత్తరువు జారీ చేయవలసిఉండును. ఈవిధమైన వ్యక్తి స్వాతంత్ర్యములకు పూర్వరాజుల పాలనలో నవకాశముండెడిది కాదు. రాజాజ్ఞయైనచో యెవరినైననూ, నేరము చేయనప్పటికీ కారాగారములో నుంచవచ్చును; ఆస్తుల నాక్రమించుకోవచ్చును. రాజునకు గాని, మత సంస్థలకు గాని వ్యతిరేకమైన ఉద్దేశములను బహిర్గతముచేయ వీలుండెడిది కాదు. ఇంగ్లండుదేశములో నొకానొకప్పుడు, కేథలిక్ అన్నవాని కుద్యోగము లభించెడి కాదు. రానురాను, మానవునకు కొన్ని ప్రాథమిక హక్కులత్యావసరమన్న విషయమును గుర్తించిరి. పుట్టుకతోనే మానవుడు కొన్ని హక్కులతో పుట్టునని, అట్టి హక్కులను గౌరవించి, సంరక్షించే బాధ్యత ప్రతి ప్రభుత్వము తన ప్రాథమిక కర్తవ్యముగా గుర్తించవలెనన్న సిద్ధాంతము పరిచయము చేయబడినది. ఈ ప్రాథమిక హక్కులను స్వేచ్ఛగా ననుభవించిన

---

2 కార్యనిర్వాహక వర్గము (*Executive*) రెండుతరగతులుగా ఉండును. ఒకటి, నామమాత్రమైన కార్యనిర్వాహక వర్గము: రాష్ట్రపతి, గవర్నరు; రెండు, నిజమైన కార్యనిర్వాహక వర్గము: మంత్రి వర్గము.

నాడే మానవుడు, తనలో నిగూఢమైనటువంటివిన్నీ, నిద్రాణమైనటువంటివిన్ని, నిజశక్తిని, జ్ఞానసంపదను బహిర్గతము చేసుకొని, సంఘమును పురోగామిగా చేయగలడు. ప్రపంచములోని ప్రజాస్వామ్యము లన్నియు, అట్టి ప్రాథమిక హక్కులను రాజ్యాంగములోని విశిష్టభాగములుగా పరిగణించి, సంరక్షించుచున్నవి.

## : రాజ్యాంగ సవరణ విధానములు :

ఈ వివిధకారణములవలన రాజ్యాంగమును సవరించుటకు, మామూలు చట్టసవరణవలె కాక ప్రత్యేకముగా క్లిష్టతరమైన విధానము (*Procedure*) ను నిర్ణయింతురు. మామూలు చట్టమును సవరించవలెనన్న, శాసనసభకు హాజరై, వోటుచేసిన సభ్యులలో సగమునకు పైగా ఒక్క సభ్యుడు అనుకూలముగానున్నను సరిపోవును. కాని రాజ్యాంగ సవరణ అట్లు కాదు. స్విట్జర్లండు మొదలగు దేశములలో 'ప్రజాభిప్రాయ సేకరణ' (రిఫరెండమ్ *Referendum*) అవసరము. [రిఫరెండము: రాజ్యాంగసూత్రము నొకదానిని సవరించవలెనన్న, ఆ ప్రతిపాదనను ప్రజలముందు వోటునకు పెట్టుదురు. శాసనసభ సభ్యుల యెన్నిక వలెనే దీని వోటింగుకూడా యుండును. అధిక ప్రజానీకము సవరణ కనుకూలముగానున్నచో రాజ్యాంగములోని ఆ సూత్రము సవరించబడును.] ప్రజాబాహుళ్యకారణముగా నట్టి 'ప్రజాభిప్రాయ సేకరణ' ఆచరణయోగ్యము కాదనియు, అధిక ప్రయాసాపూరితమైనదనియు మన రాజ్యాంగ నిర్మాతలు (*Framers of the Constitution*) భావించి, వేరొక యేర్పాటును చేసిరి. రాజ్యాంగసవరణ విధానమును, మనరాజ్యాంగములోని 368 వ సూత్రము తెలియజేయుచున్నది. ఈ సూత్రము ప్రకారము, రాజ్యాంగసూత్రములను మూడువిధములుగా సవరించవచ్చును:

1. కొన్నిసూత్రముల సవరణకు, సభకు హాజరై, వోటుచేసిన సభ్యులలో సగమునకు పైగా నొక్క వ్యక్తి అనుకూలముగానున్నను సరిపోవును. దీనికిని మామూలు చట్టసవరణకును భేదము లేదు. ఈ తరగతికిచెందు సూత్రములు చాలా స్వల్పము. అవియైనను అంత ముఖ్యమైనవి కావు.

2. కొన్ని సూత్రములను సవరించవలెనన్న పార్లమెంటుసభకు హాజరై వోటుచేసిన సభ్యులలో మూడింట రెండువంతు లనుకూలురుగానుండుటయేగాక, అట్లు అనుకూలముగా వోటుచేసినవారు పార్లమెంటు సభ్యులమొత్తములో సగభాగమునకు పైగా నుండవలెను. [ఉదాహరణ: పార్లమెంటు సభ్యుల మొత్తమైదువందల (500) లనుకొందము. హాజరై, వోటుచేసిన మూడువందల (300) మందిలో రెండువందల నలుబది (240) మంది సవరణ కనుకూలముగా వోటుచేసినప్పటికీ సవరణ వీగిపోవును. అదే మామూలు చట్టసవరణయైనచో నూట యేభైయొక్క (151) వోట్లనుకూలముగ నుండిన చాలును. అట్లనే, ఐదువందల (500) మందియు హాజరై, వోటుచేసినప్పుడు కనీసము మూడువందల ముప్పదియైదు (335) మంది సభ్యులైనా అనుకూలముగా నుండవలెను.] రాజ్యాంగములోని అధికసూత్రము లీ తరగతిలోనికి వచ్చును.

(3) మూడవరకపు సూత్రముల సవరణ కింకను క్లిష్టతరమైన విధానమును సూచించిరి. వీటి సవరణకు, రెండవతరగతి సూత్ర సవరణావిధానము ననుసరించుచూ, ఆపైని 'ఎ' తరగతి, 'బి' తరగతి రాష్ట్ర శాసనసభల అధికసంఖ్యాంగీకారమును (*Ratification*) పొందవలెను. హైకోర్టులకు సంబంధించు సూత్రము లీ తరగతిలోనికి వచ్చును.

సవరణవిధానములోని యీ తరతమ భేదము లాయా సూత్రముల విశిష్టతను తెలియజేయును. ఎక్కువ కష్టతరవిధానమును రాజ్యాంగము నిర్దేశించినచో, ఆయా సూత్రములు విశిష్టమైనవనియును, చిరకాల మననానంతరము పొందుపరుపబడినటువంటివనియు, యిష్టము వచ్చినట్లు వాటిని సవరించకూడదనియు, రాజ్యాంగ నిర్మాతల ఆశయమున్న విషయమును గ్రహించవలయును. అధిక ప్రజానీక మెప్పుడొక సూత్రమువల్ల ప్రయోజనములేదని భావించునో, పరిస్థితుల మార్పువల్ల క్రొత్త సూత్రపుటావశ్యకతను ప్రజాబాహుళ్యమైక్యకంఠముతో నెప్పుడు కోరునో, ఆనాడే ఆ సూత్రమును సవరించవలయును. కావున రాజ్యాంగ సవరణకు మూలశక్తి ప్రజాభీష్టము. అందుచేతనే కొన్ని దేశములు ప్రజాభిప్రాయ సేకరణ విధానము ననుసరించుచున్నవి. మన దేశములో నధిక ప్రజానీకమునకు రాజ్యాంగమన్న నేమియో పూర్తిగా తెలియదు. అట్టితరి వారి యిష్టానిష్టము లెవిధముగానున్నవో తెలుసుకొనుట కష్టము. అట్టి పరిస్థితిలో, ప్రజల యజ్ఞానము నండగా జేసుకొని, వ్యక్తపర్చుకోలేని ప్రజాభీష్ట మేమిటో నన్న విషయమును తెలుసుకొనకయే, దైనందిన జీవితములో నిత్యమూ మనల పరిరక్షించుచున్న రాజ్యాంగ సూత్రములను సవరించ

బూనుట ఎంతవరకు సమంజసమన్నది ఆలోచింపతగ్గ విషయము.

## : అధికార కేంద్రీకరణము :

రాష్ట్రప్రభుత్వములు సూచించిన రాజ్యాంగ సవరణలను కొంచెము లోతుగా పోయి పరీక్షించినచో నొక్క విషయము గోచరించును. అది యేమన: శాసనసభయొక్కయు, న్యాయశాఖయొక్కయు అధికారములను తగ్గించి బలవత్తరమైన కార్య నిర్వాహక వర్గమును స్థాపించుట. పూర్వకాలపు, మధ్యయుగపు రాజుల కాలములో పై మూడుపాంగాధికారములూ, ఒకే వ్యక్తిలో కేంద్రీకరించబడియుండెడివి. రాజు చెప్పినదే శాసనము; రాజు చేసినదల్లా శాసనయుక్తము; శాసనయుక్తమని రాజు తీర్పునిచ్చినదల్లా న్యాయము. ఆవిధముగా చెప్పినవాడు, చెప్పినది చేసినవాడు, చేసినది తప్పో, ఒప్పో నిర్ణయించినవాడు ఒక్కడేయైనపుడు వచ్చే అపాయ మెంత యపారమో, నేరములను దర్యాప్తు చేయు పోలీసు ఉద్యోగి (*Executive*) కి నేరమును విచారించే హక్కు (*Judiciary function*) నిచ్చినప్పుడు లభించే న్యాయమును తలచుకొన్న, తెలియును. అందుచేత నే యీ మూడుపనుల నొక్కచోటనే కేంద్రీకరించబడనీయకుండ, మూడుపాంగములలో వికేంద్రీకరణము చేయబడి, పరిమితము చేయబడినవి. రాజ్యాంగమనుమతించిన మేరకే శాసనసభ చట్టములను చేయును; శాసనసభామోదమునందిన చట్టములనే కార్యనిర్వాహక వర్గము అమలులోనికి తీసుకొనివచ్చును. ఆ యవధులను దాటినచో న్యాయశాఖ అభ్యంతరము తెల్పును. మామూలు చట్టమున కేవిధముగా మనమంతా లోబడియుందుమో, ఆ విధముగనే పై మూడుపాంగములు రాజ్యాంగమునకు లోబడియుండును.

అందులో నే యుపాంగపు టధికారములైనా కుంటుపర్చబడి, మరో యుపాంగ మతి బలవత్తరమైనపుడు, నిరంకుశ పరిపాలనవచ్చు అవకాశమున్నది. ముఖ్యముగా కార్యనిర్వాహకవర్గము (*Executive*) అతి బలవత్తరమైనపుడు నిరంకుశ పాలనలు వచ్చుట ప్రపంచ చరిత్రలో మనము గమనించుట కద్దు.

కారణ మేమన, ప్రజకు, కార్యనిర్వాహక వర్గముతో నెక్కువ సన్నిహితసంబంధ ముండును. దైనందిన జీవితములో తరుచుగా ప్రత్యక్షమగు గ్రామమున్నబులు, కరణములు, పోలీసులు, రాబడిపన్నుఅధికారులు, కలక్టరులు మొదలగువారంతా కార్యనిర్వాహకతెగకు చెందినవారే. పూర్వరాజుల క్రూరకృత్యములను చిత్రించు వర్ణనములలో, కట్టి రమ్మనిన కొట్టితీసుకొనివచ్చే, రాజభటుల భయంకర కృత్యములే మనకు గోచరించును. వాటి వారసత్వపు టంతిమఛాయ లీనాటికికూడా మన కప్పుడప్పుడు, యుద్ధసమయములలో ప్రత్యక్షమగును. ఏ దేశమైనా యుద్ధపరిస్థితులలో చిక్కుకున్నప్పుడు, శాసనసభపై నొత్తిడిని కల్గించి, కార్యనిర్వాహకవర్గ మసాధారణాధికారములను చేజిక్కించుకొనును. ఆ పరిస్థితిలో, కొన్నికొన్ని శాసనములను కార్యనిర్వాహకవర్గమే చేసి, వాని నమలులోనికి తీసుకువచ్చి, శాసనోల్లంఘనా విచారణమును కూడా నదే చేయును. 'అధికారులయొక్క ఉద్దేశములో నెవరైనా యనుమానాస్పదమైన వ్యక్తియని పరిగణించబడిన, ఆ వ్యక్తిని ఖైదులోనుంచును. ఆ వ్యక్తి అనుమానాస్పదమైన వ్యక్తియేనా, కాదా; అతనివల్ల దేశానికపాయము కలుగవచ్చునా లేదా యన్న విషయములను పరిశీలించుటకు న్యాయస్థానమునకే యధికారమునుకూడా లేదు. ఆ విషయము నా యధికారులే నిర్ణయించవలయును.' సామాన్యముగా, కార్యనిర్వాహకవర్గము జారీచేయు ఉత్తరువు లీవిధముగా నుండును. ఈ పరిస్థితులలో నమాయిక ప్రజలను ఖైదులో నుంచుట సంభవించవచ్చును; వారి యాస్తులు అన్యాయముగా హరింపబడవచ్చు. తమ నిర్దోషిత్వమును నిరూపించుకొనుటకు న్యాయస్థానముల సహాయము లభించదు. యుద్ధకారణముగా ప్రజ లీకంటక పరిస్థితులను కొంతకాలము సహించవచ్చును. కాని సామాన్యపస్థితులలో కార్యనిర్వాహకవర్గమున కీయధికారముల నధీనముజేసినచో నియంతృత్వమునకు దారితీసి, దేశారిష్టము సంభవించవచ్చును.

అమెరికన్ ప్రెసిడెంటగు రూజ్‌వెలుమహాశయుడు (*Theodore Roosevelt*) తన ఆత్మకథలో నొకానొక సందర్భమున నీవిధముగా వ్రాసినారు:

["Under this interpretation of executive power I did and caused to be done many things not previously done by President and the heads of the deparments. I did not usurp power, but I did greatly broaden the use of executive power. In other words, I acted for the common welbeing of all our people, whenever and in whatever manner was necessary......"]

'ఈ నిర్వచనప్రకారము కార్యనిర్వాహక ు లభించిన అధికారములతో, పూర్వము ఏ అధ్యక్షుడుగాని, ఏ పరిపాలన శాఖాధిపతిగాని చేయని అనేకపనులు చేసితిని, చేయించితిని. అధికారవాంఛతో నే నిట్లు చేయలేదు.—కాని కార్యనిర్వాహకవర్గ శాఖ అధికారమును విస్తృతావధిని పెంచితిని. అనగా, మన ప్రజల సంక్షేమము ప్రధానాశయముగా ఎప్పుడెప్పుడు ఎట్లెట్లు వ్యవహరించవలెనో అట్లు వ్యవహరించితిని .'

దీనికి సమాధానముగా (*Youngstown Sheet and Tube Co., et al. Vs. Sawyer 343 V. S. 579* అను కేసులో) న్యాయమూర్తి డగ్లస్ మహాశయుడు నుడివిన పలుకులు గమనార్హములు:

["...to-day a kindly President uses the seizure of power to effect a wage increase and to keep the steel furnances in production. Yet to-morrow another president may use the same power to Prevent a wage increase, to curb trade unions, to regiment labour as oppressively as the industry 'thinks it can be regimented by this seizure of power..."]

...ఈనాడు దయాశాలి అయిన ఒక అధ్యక్షుడు ఈ అధికారస్వీకరణను పేదకూలీల జీవనభృతిని పెంచుటకు, ఉక్కు కర్మాగారముల ఉత్పత్తులు సక్రమముగా సాగుచుండుటకు ఉపయోగించి మేలు చేయవచ్చు. కాని, రేపు మరొక అధ్యక్షుడు ఈ అధికారస్వీకరణను, కార్మికసంఘములను అణచివేయుటకు, దారుణమైన నిర్బంధవిధానమున కార్మికులచే గొడ్డుచాకిరీ చేయించుటకు వినియోగించవచ్చును.

డగ్లస్ మహాశయుడు చెప్పినట్లు ప్రజాక్షేమము పేరున అందరూ ఒకేవిధముగుమార్గము నవలంబింతురను హామీ యేమున్నది? ప్రజాక్షేమ మేవిధముగా లభించునోయన్న విషయముపై ప్రతియొక్కరూ తమ ప్రత్యేక నిర్వచనము చేయుదురు. హిట్లరున్నూ, ముసులోనియు, ప్రజాక్షేమకాముకులమనియే చెప్పకొనెడివారు. కాని, అధికారములన్నియూ వారివశమగునాడే నిజముగ ప్రజాక్షేమము లభించుననువాదనలో తమ దేశములనే యధోగతిపాలు చేసిరి. అంతియేకాక, అందరూ ప్రెసిడెంటు రూజువెల్టువలె, ప్రజాక్షేమమును కోరియే ప్రవర్తించెదరను హామీ యేమున్నది? ఈమధ్య నాంధ్రలో జరిగిన యొక విషయమును పరిశీలించినచో నీ విషయము బోధపడును. శాశ్వతరాజధాని నెక్కడ నెలకొల్పుటయో యన్న విషయ మింకను నిర్ణయము కాలేదు. అట్టి సందిగ్ధపరిస్థితిలో, కర్నూలులో అసెంబ్లీ భవన నిర్మాణమునకు ప్రజాధనమును వినియోగించుటకు చేసిన మంత్రివర్గనిర్ణయ మెంతవరకు ప్రజాక్షేమమును మనస్సులో నిడుకొని చేసినదో ఆలోచించవలసిన విషయము.

## : సవరణ సూచనల ఔచితి :

ఇక రాష్ట్రప్రభుత్వములు సూచించిన రాజ్యాంగ సవరణములలోని కొన్ని ముఖ్యమైనవాటిని పరిశీలింతుదము సవరణకు సూచించబడిన కొన్ని ముఖ్య సూత్రము లీదిగువ నీయబడినవి:

(1) రాజ్యాంగములోని 220 వ సూత్రము "హైకోర్టు న్యాయమూర్తులు తమ పదవీ విరమణానంతర మే న్యాయస్థానమందును గాని మరి యే యితర అధికారులయందును గాని వాదించకూడదని యీ సూత్రము చెప్పుచున్నది

(2) రాజ్యాంగములోని 123, 213 సూత్రములు: ఏయే పరిస్థితులలో కేంద్ర కార్యనిర్వాహకవర్గము, రాష్ట్ర కార్యనిర్వాహకవర్గము ఆర్డినెన్సుల ద్వారా శాసనములను చేయవచ్చునను విషయము లీ సూత్రములందు పొందుపరుపబడినవి

(3) రాజ్యాంగములోని 226 వ సూత్రము: ఏయే పరిస్థితులలో ఉత్తర్వులు గాని, 'రిట్సు' (*Writs*) గాని హైకోర్టు జారీ చేయవచ్చునను విషయ మిందు ప్రస్తావించబడినది

(4) పత్రికా స్వాతంత్ర్యమునకు సంబంధించునంతవరకు రాజ్యాంగములోని 19 వ సూత్రము: ఈ సూత్రములో వాక్స్వాతంత్ర్యము, భావస్వాతంత్ర్యము, వ్యక్తిస్వాతంత్ర్యము మొదలుగాగల సప్త స్వాతంత్ర్యములు పేర్కొనబడినవి.

హైకోర్టు న్యాయమూర్తుల విషయమును తీసుకొందము. రాజ్యాంగములోని 220 వ సూత్రము ప్రకారము, హైకోర్టు న్యాయమూర్తులు, తమ పదవీవిరమణానంతర మే న్యాయస్థానమందు గాని, మరి యే యితర అధికారులముందు గాని వాదించకూడదు. అట్టి నిర్బంధము లేకుండా, "తమ పదవీవిరమణానంతరముగూడా, హైకోర్టు న్యాయమూర్తులు స్వేచ్ఛగా న్యాయవాదవృత్తి నవలంబించుట కవకాశముండున"ట్లు 220 వ సూత్రమును

సవరించవలెనని రాష్ట్రప్రభుత్వములు సూచించినవి. ఈ సవరణ నంగీకరించినచో నందొక యపాయ ముండవచ్చును. అదియేమన, అంతవరకూ తమ సహచరులుగా నున్న న్యాయమూర్తుల యెదుట, పదవీ విరమణఃపొందిన న్యాయమూర్తి, న్యాయవాదిగా వాదించునప్పుడు, న్యాయపరిపాలనా వ్యవస్థలో కొంత యిబ్బంది కలుగవచ్చును కాని, విరమణ నందిన న్యాయమూర్తి, అదివరకు తాను పనిచేసిన హైకోర్టులో కాకుండా యితర హైకోర్టులలో గాని లేదా సుప్రీమ్ కోర్టులో గాని వాదించుకొనగల్గునట్లు 220 వ సూత్రమును సవరించినచో ఎక్కువ యిబ్బంది లేకపోవచ్చును. ఏది ఏమైననూ, ఇది కొంత పాక్షికత యేర్పడుటకు అవకాశమున్న విషయము. సరిగా ఆలోచింపదగ్గది. న్యాయపీఠముయొక్క గౌరవ ప్రతిష్ఠల దృష్ట్యాకూడా ఇట్టి సవరణ వాంఛనీయము కాకపోవచ్చును.

ఇక రెండవ విషయము తీసుకొందము. రాజ్యాంగములోని 123 వ సూత్రము ప్రకారము, పార్లమెంటు సమావేశమందు లేనికాలములో నేదైనా హఠాత్సంభూతమగు పరిస్థితి నెదుర్కొనవలసివచ్చిన, రాష్ట్రపతి (*President*) ఆర్డినెన్సును (*Ordinance*) జారీ చేయవచ్చును. పార్లమెంటుచే నామోదము నందిన చట్టమునకు, యీ ఆర్డినెన్సునకు నెట్టి భేదమూ లేదు. అట్టి ఆర్డినెన్సు, పార్లమెంటు సమావేశమైన యారు వారములవరకు నములులో నుండి, తదుపరి, పార్లమెంటుచే నామోదము నందని పక్షములో నది చెల్లనేరదు. రాష్ట్రప్రభుత్వములకు సంబంధించునంత వరకు, రాజ్యాంగములోని 213 వ సూత్రము ప్రకారము గవర్నరునకు గూడా నిట్టి యధికారముండును. ముఖ్యముగా మనము గమనించవలసిన విషయమేమన, శాసనములను చేయు బాధ్యత శాసనసభపై నుండి, కొన్ని యసాధారణ పరిస్థితులలో శాసనసభలు సమావేశమందు లేనపుడా బాధ్యతను కార్యనిర్వాహకవర్గము నిర్వర్తించి, వీలైనంత త్వరగా శాసనసభలకు వాటి యధికారముల నందజేయవలయును. "శాసనసభలు సమావేశమై యున్నప్పటికీ," కార్యనిర్వాహక వర్గము ఆర్డినెన్సులద్వారా శాసనములను జేయగల్గునట్లు, 123, 213 సూత్రములను సవరించవలయునని రాష్ట్రప్రభుత్వములు సూచించినవి. ఈ సూచన నంగీకరించుపక్షమున, శాసనసభతో సమాన హోదాలో, కార్యనిర్వాహకవర్గమునకు గూడా శాసనములను జేయుటధికారము వచ్చును ఇట్టి సవరణతో శాసనసభల వ్యక్తిత్వమే నశించును. ఈ సూచన పార్లమెంటుయొక్కయు, రాష్ట్రశాసనసభలయొక్కయు అధికారములకు సంబంధించినది. పార్లమెంటు ఈ సవరణ నామోదించుట యన్న యించుమించు ఆత్మహత్య చేసుకొనుట కంగీకరించుటయే.

హైకోర్టుయొక్క అధికారములకు సంబంధించు సూచనలు: రాజ్యాంగములోని 226 వ సూత్రము ప్రకారము, "ప్రాథమిక హక్కులను సంరక్షించుటకుగాని లేదా మరి యే యితర కార్యములకుగాని, హైకోర్టు, ఉత్తరువులనుగాని లేదా హెబియాస్ కార్పస్, (*Habeas Corpus*), మాండమస్, (*Mandamus*) ప్రొహిబిషన్, (*Prohibition*) మొదలుగాగల "రిట్సు" (*writs*) లను జారీ చేయవచ్చును."

ఉదాహరణలు : 1. అన్యాయముగా నొక వ్యక్తి ఖైదు నందుంచబడిన నా వ్యక్తి హైకోర్టునకు హెబియస్ కార్పస్ పిటిషన (*Habeas Corpus Petition*) పెట్టుకొనును. న్యాయమని, సమంజసమని తోచిన పక్షమందున వెంటనే ఆ వ్యక్తిని విడుదలచేయవలసినదిగా హైకోర్టు ఉత్తరు జారీచేయును. 2. చట్టానుమతి నొందకనే, రాబడిపన్ను అధికారి, యెక్కువ మొత్తమును సుంకముగా విధించి, హుకుం జారీ చేయునపుడా నష్టపడిన వ్యక్తి, ఆ ఉత్తరువు నాపు చేయవలసినదనియు, లేనిచో తన యాస్తి అన్యాయముగా దోచుకోబడుననియు, తరువాత నాపన్ను ప్రభుత్వమునుంచి రాబట్టుకొనుట ప్రయాసతో కూడినట్టి పనియనియు, హైకోర్టును ప్రార్థించినచో, ఆ ప్రార్థన సమంజసముగానున్నదని హైకోర్టు నమ్మినచో, రాబడిపన్ను అధికారియొక్క ఉత్తరువు అమలులోకి తీసుకరావద్దని ఉత్తరువు జారీ చేయును.

హైకోర్టునకు గల యీ అధికారములను తగ్గించవలసినదిగా రాష్ట్రప్రభుత్వములు సూచించినవి. ముఖ్యముగా, రాజ్యాంగములోని 223వ సూత్రములోని, "మరి యే యితర కార్యమునకు గాని (*For any other purpose*)" యన్న భాగమును తీసివేసి, ఉత్తరువులను లేదా "రిట్టులను" (*Writs*) ఒక్క ప్రాథమిక హక్కులను సంరక్షించుటకే (*...for the enforcement of any of the rights conferred by Part III*) జారీ చేయ గల్గునట్లు రాజ్యాంగపు 226వ సూత్రమును సవరించవలెనని సూచించినవి. ఈ సూచనకు కారణముగా, "రిట్సుకు సంబంధించిన సూత్రములు దుర్వినియోగము చేయబడుతున్న" వనే యారోపణ చేయబడినది. ఈ దుర్వినియోగము చేసినదెవరు ? "హైకోర్టు" లనియేగదా వారి యభిప్రాయము. అధికారములను దుర్వినియోగము చేయవలసిన అవసరము హైకోర్టునకేమున్నది? కార్యనిర్వాహకవర్గములోని మంత్రులవలెగాక, హైకోర్టు న్యాయమూర్తులే రాజకీయ పక్షముయొక్క బలముమీదనో అధికారమున నున్నవారు కారు. ఐదేళ్ల అనంతర మధికారముపోవునుగాన, మరల అధికారమునకు రావలెనన్న గాఢవాంఛతో, పార్టీ ప్రాబల్యముకొరకు వంకర పనులు చేయవలసిన అవసరము కూడ వారికి లేదు. పార్టీసభ్యుల మద్దతు నొందుట కధికారములను దుర్వినియోగము చేయవలసిన ఈతిబాధయూ వారికి లేదు. గత మూడు నాల్గేండ్లలో "రిట్సు" విరివిగా జారీ చేయబడుతున్నవనిన, గత మూడు నాల్గేండ్లలో శాసనసభ తన అవధిని దాటుటగాని, లేదా కార్యనిర్వాహకవర్గము, తెలిసియో, తెలియకనో, తన యధికారములను దుర్వినియోగము చేయుటగాని, జరిగియుండవచ్చును. ఈ సత్యమును విస్మరించి, న్యాయశాఖను దుయ్యబట్టజూచుట తోడేలు, మేక పిల్ల కథ వంటిది.

ప్రజాస్వామ్యపు పటుత్వ మా దేశమందలి ప్రజ లనుభవించు స్వేచ్ఛపై నాధారపడియుండును. అందరు ప్రజలూ స్వేచ్ఛాజీవులుగా మెలగు నవకాశమున్ననాడే ప్రజారాజ్యమనుపదమున కర్థము లభించును. స్వతంత్రమైన, శక్తివంతమైన, న్యాయశాఖ ఉన్ననాడే ప్రజలందరూ నిజముగా స్వేచ్ఛ ననుభవించగల వాతావరణ మేర్పడు నన్న విషయమును గుర్తునందుంచుకొనవలయును.

ఈ సందర్భమందు మనము మరియొక విషయమును జ్ఞాపక ముంచుకొనవలయును. రాజ్యాంగ సవరణలో గాని, శాసనము చేయుటలో గాని, న్యాయశాఖకేమీ భాగము లేదు. హైకోర్టుయొక్క అధికారము లొక్కటొక్కటిగా, కార్యనిర్వాహక వర్గ ప్రోద్బలమువలన, శాసనసభ తగ్గించుచుండిన హైకోర్టు చేయగలిగినదేమియూ లేదు. అదే, కార్యనిర్వాహక వర్గపు టధికారములనుగాని లేదా శాసనసభాధికారములనుగాని తగ్గించు సవరణలను ప్రతిపాదించిన, ఆ సవరణ నెగ్గుట కష్టతరము. కారణమేమన, సవరణ చట్టరూపము నొందుటకు శాసనసభయొక్కయు, కార్యనిర్వాహక వర్గముయొక్కయు అంగీకారము కావలసియుండును. ఈ సత్యమును మనస్సునందిడుకొని, న్యాయశాఖయొక్క అధికారములను తగ్గించు సవరణలను పరిశీలించుట శ్రేయస్కరము.

ఇక పత్రికాస్వాతంత్ర్యమును సంకుచితపరచు సూచనలను పరీక్షించుదము. ఈ సందర్భములో, పత్రికలకు సంఘములోనున్న ప్రాముఖ్యతను పరిశీలించుట యవసరము. ఏ ప్రభుత్వమునైనను నిరంకుశత్వమునైపు మొగ్గకుండా, అదుపాజ్ఞలలో నుంచునదొక్క ప్రజావాణియే (*Public opinion*). అట్టి ప్రజావాణి గొంతు, ఒక్క పత్రికాముఖమునుండి బహిర్గతమగునప్పుడే ప్రస్ఫుటముగా వినిపించును. అట్టి పత్రికా స్వాతంత్ర్యము కుంటుబడినచో, అచ్చటచ్చటా, చెల్లాచెదరై జనించు ప్రజావాణి చిటిపొటి పల్కులు, వాహకములేని కారణముగా నెవరికినీ వినిపించకయే యనంతవాయువులలో నంతరించిపోవును.

పత్రికా స్వాతంత్ర్యమనుటతోనే, యిదేదో పత్రికా సంపాదకులకు, పత్రికాయజమానులకే సంబంధించిన విషయమనే అమాయికత్వము మనలో ననేకమందికున్నది. పత్రికా స్వాతంత్ర్యములో ప్రతివ్యక్తిభావస్వాతంత్ర్యము, వాక్స్వతం

త్ర్యమూ ఇమిడియున్నవను విషయమును గ్రహించవలయును. మన కందరికీ అనేక యూహలు (*Ideas*) యుద్దేశములు (*Opinions*) ఉండును. అట్టి యూహలను, యుద్దేశములను, నాల్గు గోడల మధ్య నుకూర్చొని, గదిగోడలకు బోధించుటతోనే సంతృప్తి పడలేము. ఇతరులకు వాటిని వ్యక్తపరచి, నమ్మించి, మన యుద్దేశములతో వారు యేకీభవించాలని, కనీసము, సానుభూతినైనా చూపాలని, మన ముబలాట పడుటయేగాక, మన విధ్యుక్తధర్మముగా భావించెదము. పైవారికా విధముగ వ్యక్తపర్చలేని నాడు మన యుద్దేశములకు విలువ శూన్యము. అట్టి మన యుద్దేశములు, ఎక్కడైనా మన ముపన్యసించునపుడు పత్రికలలో ప్రచురించబడి వ్యక్తపరుపబడవచ్చును; లేదా, వ్యాసరూపములో గాని, కథలరూపేణా గాని, వ్యంగ్య చిత్రములవల్లగాని పత్రికలలో వ్యక్తపర్చకో వచ్చును. అందుచేత పత్రికాస్వాతంత్ర్యము కుంటుపడినచో నామేరకు మన భావస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యముకూడా కుంటుపడునన్న విషయమును గ్రహించవలయును.

పత్రికాస్వాతంత్ర్యమును తగ్గించుట కనుగుణముగా రాజ్యాంగములోని 19 వ సూత్రమును సవరించు సూచనలకండగా రాష్ట్రప్రభుత్వములు చూపు కారణములను    ంచుదము.

"కొన్ని పత్రికలు, మంత్రులపై చిలిపి అభియోగములు (*Mischievous Charges*) తెచ్చుచున్నవ," నునది రాజ్యాంగపు 19 వ సూత్రమును సవరించవలసి వచ్చుట కొక కారణము. ముక్కుకు సూటిగాపోయి స్వార్థపరత్వమునకు తావులేకుండ ప్రవర్తించువారి నెవరూ యేమీ అనరు; అనలేరు. మహాత్మాగాంధీ హిందూదేశమునకు తీరని ద్రోహము చేసినాడని యన్న వాళ్లుకూడా మన దేశమున లేకపోలేదు. కాని వారి కాకిగోల యెవరు విన్నారు? ఎవరు నమ్మారు?

మానవుడు స్వార్థజీవి. అవినీతిపరుడు కావటానికి అధికారమే చాలు, అవధిలేని నిరంకుశాధికారమే చేజిక్కితే అధోగతికే యీడ్చివేస్తుంది. (*"Power corrupts and absolute power corrupts absolutely" — Lord Acton*) ప్రక్కనే పొంచియుండి ప్రజలు, పత్రికలు, ప్రతిపక్షము, ప్రభుత్వము చేయు ప్రతిపనినీ, ప్రతినడతను, సునిశితముగా పరీక్షించుచున్నవను విషయమును గ్రహించిననేగాని, అధికారముతో కూడుకున్న యే ప్రభుత్వముగూడా తిన్నగా నడువదు. అభియోగములు తెచ్చుట కవకాశమున్ననేగాని, అభియోగములు తెచ్చువారున్నారను విషయమును గ్రహించిననేగాని, అభియోగములకు తావీయని సౌశీల్యముతో మెలగవలెనను జిజ్ఞాసకలుగదు. ఇంతకూ, యేలోటుపాటులేనప్పటికీ అభియోగములు వచ్చినచో, ధైర్యముగా ప్రజలముందుకు పోయి తమ ఋజువర్తనను నిరూపించుకొనవచ్చును.

"కొన్ని పత్రికలు స్థాపించబడిన ప్రభుత్వముపై (*Established Government*) ప్రజల కేవగింపు కల్గించుటకునూ, ప్రభుత్వమును అల్లరిపాలు (*Discredit*) చేయుటకునూ అదేపనిగా ప్రయత్నించుచున్నవి"ను నది మరియొక కారణము. ప్రజాస్వామ్యములలో ప్రభుత్వములు పార్టీప్రభుత్వములు. ఈపార్టీప్రభుత్వములు తాత్కాలిక ప్రభుత్వములు. అందుచేత ప్రజాస్వామ్యములో, "స్థాపించబడిన ప్రభుత్వము"నిన తాత్కాలిక ప్రభుత్వమని యన్వయించుకొనవలయును. తాత్కాలికమైన ఈపార్టీ ప్రభుత్వములు మూడేండ్లవరకునో, ఐదేండ్లవరకునో అధికారములోనుండును. మరల నదే పార్టీ యధికారములోకి రావటమో లేదా మరే యితర పార్టీ యధికారములోకి వచ్చుటయో యన్న విషయము ప్రజాదరణపైనున్నదనుమాట. అందుచేత ప్రభుత్వమును మార్చు అధికారము ప్రజల సొత్తను విషయమును గ్రహించవలయును. ఈహక్కును ప్రతిపక్షముద్వారా ప్రజలు సాధించగల్గుదురు. తాత్కాలిక ప్రభుత్వమును పడగొట్టి, ఆ స్థానము నాక్రమించుకొనే హక్కు ప్రతి ప్రజాస్వామ్యము ప్రతిపక్షమున కొసంగును. ప్రభుత్వముపై ప్రజల కేవగింపుకల్గుటకు ప్రతిపక్షములన్ని విధములా ప్రయత్నించును. ప్రజలను తమవైపున కాకర్షించుకొనుటకు సకల శక్తులా కృషిచేయును. దీనిని నేరముగా పరిగణించి, దాని సాకుతో పత్రికాస్వాతంత్ర్యమును తగ్గించుట కుద్యుక్తులైనచో నేటి ప్రభుత్వమే చిరకాల మధికారముందుండుటకు నిరం

కుశేముగా నట్లు ప్రయత్నించుచున్నదను అనుమానము ప్రజలలో కలుగవచ్చును.

బాధ్యతారహితముగా యేవో కొన్ని పత్రికలు వార్తలను, విశేషములను ప్రచురించవచ్చును. అట్టి యల్పసంఖ్యాకములగు పత్రికలను మనసునందిడుకొని పత్రికలకన్నిటికిని వర్తించునట్లు శాసనముచేయు టభిలషణీయము కాదు. న్యాయసంప్రదాయమందొక సూక్తియున్నది. "ఒక అమాయిక వ్యక్తిని విడిచి పెట్టవలసివచ్చినపుడు తనతోబాటు తొమ్మిదిమంది నిజమైన నేరస్తులను విడుదలచేయవలసి వచ్చినను, ఆ తొమ్మిదిమందిని వదలివేసి, ఆ అమాయిక వ్యక్తిని రక్షించవలెను." క్రిమినల్ న్యాయశాస్త్రములో, నేరముచేసెనను విషయమును నిర్ధారణచేయుటకు, నూటికి నూరుపాళ్లు సాక్ష్యము కావలయును. ఇట్లు కోరుటవలన యనేకమంది నిజమైన నేరస్తులు తప్పించుకొనుట సంభవించును. అట్లు లేనిచో, కొంతమంది అమాయికులు శిక్షింపబడుట సంభవించును.

అంతియేగాక వాక్స్వాతంత్ర్యమునకును, భావస్వాతంత్ర్యమునకును, పత్రికాస్వాతంత్ర్యమునకును కొన్ని పరిమితు లిదివరకే యున్నవి. రాజ్యాంగపు 19 వ సూత్రములోని రెండవ ఉపసూత్రము *(Clause 2 of Act 19)* చెప్పిన విధముగా ఈ వాక్స్వాతంత్ర్యము మొదలగునవి విదేశములతో మనకున్న స్నేహసంబంధముల కపాయము కల్గించునట్లుగానున్న యెడల, లేదా నీతి నియమములను పాటించనట్లుగా నున్నయెడలను, నేరమును చేయుటకు పురికొల్పునట్లుగా నున్నయెడలను, యితరుల గౌరవమును భంగపర్చునట్లుగా నున్నయెడలను, వాటిని శాసనరూపమున తగ్గించవచ్చును. సెడిషను *(Sedition)*, డిఫేమేషను *(Defamation)* మొదలగు విషయముల నెదుర్కొనుటకు మన క్రిమినలు న్యాయశాస్త్రమం దిదివరకే కొన్ని సూత్రములున్నవి. బాధ్యతారహితముగను, అసభ్యముగను ప్రవర్తించు కొన్ని అల్పసంఖ్యాకములగు పత్రికల నదుపాజ్ఞలలోనుంచుట కాసూత్రములు చాలును.

రాజ్యాంగమును ఏదో యొక రాజకీయ పక్షమును చిరస్థాయిగా అధికారమున నుంచుకొనుట కుపయోగపడు ఆయుధముగా నుద్దేశించగాదను విషయమును దేశక్షేమమును కోరు ప్రతిరాజకీయ నాయకుడు మనసునందిడుకొనవలయును. వీమరు రాజ్యాంగమును *(Weimar Constitution)* హిట్లరే విధముగా తనకనుసన్నల మెలిగే పార్టీకరపత్రముగా మార్చెనో, దాని ఫలితముగా జర్మను జాతి ఏవిధముగా బాధపడ వలసివచ్చినదో మన మీసందర్భమున జ్ఞప్తి యందుంచుకొనవలయును. మాటిమాటికి రాజ్యాంగమును సవరించ చూచినచో నదియొక జాడ్యముగా మారును. కన్సర్వేటివ్ పార్టీ *(Conservative)* పార్టీయని తలచబడు కాంగ్రెసుపక్షమే యింత తొందరపడి రాజ్యాంగమును సవరించుట కుద్యుక్తమైనచో, ప్రగతిగాములమనీ, అత్యంతప్రగతిగాములమనీ చిందులు ద్రొక్కు యితర పార్టీలు అధికారమునకు వచ్చినచో, ఈ అసత్సంప్రదాయముల నాధారము చేసుకొని తమ కార్యక్రమమున కనుకూలముగా రాజ్యాంగమును దినదినము సవరించ ప్రయత్నించవచ్చును. అప్పుడీ ప్రముఖ కాంగ్రెసు నాయకులు ప్రజలముందుకు వచ్చి తమ నిరసనను తెల్పుట కొంచెము కంటకప్రాయముగా నుండునను విషయము అధికారమునందున్న కాంగ్రెసుపక్షమువారు గ్రహించుట యవసరము.

నాటిక: కల్పన:

# సాహిత్య సమవాక

'సీరపా

ఈ నాటికలో ఆయా కవులపాత్రలు పాడేపాటలూ, పద్యాలూ, గేయాలూ, వచనపదాలూ
* ఆయా కవుల స్వీయరచనలనుండి స్వీకరించినవే-వారందరికీ కృతజ్ఞత ! *

## : ప్రథమాంకము :

: నాంది :

చిత్రరసప్రపీథులు, సిత
శ్రీ స్ఫేష్ఠకాష్ఠాయిత
వ్యాకృత్రాక్తనసామి దేని జ్వలన
వ్యాలోల ధూమచ్ఛటా
చ్ఛేక ప్రాభవ జింఖనీకృత సుర
జ్యేష్ఠాధివాసాధికుల్
ప్రేకుల్ లేని కనీ గవీ ద్వితతికిన్
తాత్త్రి కేల్మోడ్చెదన్.

నాంద్యంతమున సూత్రధారుడు గిరీశం ప్రవేశించి:

గిరీ: కవితారంగం కమ్యూనిటీపాజెక్టు లాంటిది. ఈ ప్రదర్శనంలో వేషం వెయ్యటానికి మాకు అభిమానమున్నవారినే ఆహ్వానించామనీ అసంఖ్యాకంగా వున్న ఆంధ్రకవిపుంగవుల కందరకూ అవకాశం లేకపోయిందనీ ఏ ఒక్కరూ బెంబేలు పడక్కర్లేదు. ప్రేక్షక మహాశయులలో ఎవరికి ఎలాంటి ఉబలాటమున్నా పారా పలుగూ లేకుండానే పరాహాత్ గా పనిలోకి వచ్చెయ్యవచ్చు,—అంటే ఈ రంగంమీదికి ఉరికెయ్యవచ్చు. సందర్భాసందర్భాలతో నిమిత్తం లేకుండా ఔచిత్యానౌచిత్యాల ప్రమేయం అంతకంటే అక్కరలేకుండా, పాటగాని, పద్యంగాని, గీతంగాని, గేయంగాని, వచనపదంగాని, పదవచనంగాని ఏది బడితే అది ఎప్పుడు బడితే అప్పుడు చెకుగుడుగూ సెయ్యవచ్చు-యోగ్యతా యోగ్యతల ప్రతిబంధకాలేమీ లేవు.

గిరీశం యీ నాటకానికి సూత్రధారు డేమిటని మీలో కొంతమందికి ఉక్రోషంగావుంటే వుండవచ్చు. రొమాంటిక్ హాయిత్రీతో, బుచ్చమ్మలాంటి విద్యాగంధంలేని విడోను సహితం సంస్కరించి సూత్రధారణచేసిన మహాకవిని నేను సూత్రధారి కాకుండా ఈ ప్రదర్శనం రంజించదని మనవాళ్లంతా యిదౌతుంటే సరేనని ఈ కార్యభారాన్ని నెత్తిన వేసుకున్నాను; యిందుకు కృతజ్ఞుణ్ణి.

భారతజాతి ఉద్ధరణకు అటు మహాత్ముడు రాజకీయ మహోద్యమాన్ని సారించినట్లే, ఆంధ్రజాతిని ఉద్ధరించటానికి నవ్యాంధ్ర మహాకవులు సాహిత్య మహావిప్లవాన్ని దూకించి మన కంఠాలు తెగిపోకుండా కాపాడి రక్షించిన సంగతి మీ కందరికీ తెలుసు—కొందరికి తెలియకపోయినా యిప్పుడు నేను చెబుతున్నాను గనుక తెలుసుకోవచ్చు. ఆ మహా కవులందరూ నవ్యాంధ్ర సాహిత్య రంగంలో శాఖోపశాఖలుగా వెల్లివిరియజేసిన విప్లవ పరంపరల పుణ్యకథనం తమముందు ఇప్పుడు ఈ నాటకరూపంలో ప్రదర్శించే అవకాశం మాకు కలిగినందుకు మమ్మల్ని మేము అభినందించుకుంటున్నాం.

ప్రణయ విప్లవ మహాకవనానికి ప్రాతిపదికగా అస్మద్విరచితమైన ఒక ఖండాఖండ మహాకావ్యాన్ని మాయామాళవగౌళ రాగంలో మనవి చేసుకుంటాను:

[1] నీలాలలోనున్న నియమంబుతీసి
బంగారులోనున్న పాలను తీసి
మేల్మి పన్నీటిలో మీగడల్ తీసి
నీహారగిరిలోని నీతిని తీసి

1. శ్రీ కొల్లూరి ధర్మారాయకవిగారి చాకి రేవునుండి.

కృష్ణవేణమ్మలో కీర్తిని తీసి
ఎండమావులలోని యింపును తీసి

[వెంకటేశం ప్రవేశం]

వెంక: తెలివితక్కువలోని విలువను తీసి—

గిరి: అరె! నీ యిల్లు బంగారం గానూ! సమయానికి యెక్కణ్ణుంచి ఊడిపడ్డావ్ మైడియర్ షేక్స్పియర్?

వెంక: ఏమిటి బావా ఏదో నాటకం ఆడుతున్నారట?

గిరి: ఏదో నాటకమని నిర్లక్ష్యంగా అంటున్నావేమిటోయ్! విశ్వశ్రేయసంధానకర్తలు, ఆబాల గోపాల సకలాంధ్ర ప్రజాసమ్మోహనోద్ధారకులు, గణగణాయమాన కళపెళత్కావ్య రణరణాయమానులు..

వెంక: అరె నీ సమాసాలు చట్టుబండలు కానూ, అసలు సంగతేదో కాస్త తెలిసేట్టు చెప్పవయ్యా!

గిరి: అయిన, నవ్యాంధ్ర మహాకవుల దివ్య చరితాన్ని రూపకంగా ప్రదర్శించబోతున్నాం.

వెంక: అవును గానీ, ఈ నాటకానికి సంధిలక్షణాలన్నీ సక్రమంగా ఉన్నాయో లేవో కనుక్కోరమ్మంది అక్కయ్య. లక్షణయుక్తం కాని నాటకం చూస్తే రౌరవాదినరకాలకు పోతారు గనక, ఆసంగతేదో తేలందే సనేమీ గడప కదలనంటోంది.

గిరి: అరె నీ బొడ్డు పొక్కా! పీకమీదికి తెచ్చావ్—అకటావికటపు ఛాందసపు మనుషులచేత అలంకారశాస్త్రాలు చదివించొద్దురా అంటే నీ కిదేం పొయ్యేకాలం?

వెంక: ఆటన్నాలేమీ రంజించవ్—సంధులూ సంధ్యంగాలూ సక్రమంగా లేకపోతే సనేమీ రానని మొరాయించిందనుకో—

గిరి: వాటికిఖా కోసిరి సంధులు—యింతవాణ్ణి నేను నాటకమాడిస్తుంటే సంధిలక్షణాలు లెక్కేమిటర్? ముందు సీను వెనక్కూ వెనుక సీను ముందుకూ కొంచెం రీఎడిట్ చేసి ఆడిస్తే భడవాసంధులు వాటంతటవి కవి ఊడిపడతాయి. ఆతంటాలన్నీ నేను చూసుకుంటాను పోయి త్వరగా మీ అక్కయ్యను కేకేసుకురా.

[వెంకటేశం నిష్క్రమణం]

భరతశాస్త్రరీత్యా ప్రదర్శించవలసిన ప్రమాదం ఒకటి వచ్చిపడ్డది గనక భాతాఖానీకి ఎక్కువ అవకాశం కనిపించటంలేదు. అదుగో పార్కర్ ఫౌంటెన్ బాకుతో పరకళ్లు ప్రొక్కుకున్నా రప్పుడే కవిసామ్రాట్! ఇతి బీజం. (నిష్క్రమణ)

తెరలేవగా పార్కర్ ఫౌంటెన్ పెన్ బాకులా పట్టుకుని విశ్వనాథ సత్యనారాయణ గారు ప్రవేశించి:

వి. సత్య:

అతిమనోబుద్ధ్యహంకృతు లౌపనిషదు
లాత్తగండూషితత్రయు లౌర్వవహ్ని
గర్భితాంత స్తపస్కులు ఘనులు ఋషుల
కెవ్వడువిరోధి తద్వధ కెత్తిన యది!

[నిష్క్రమణం]

ఆకుపచ్చట పేటాశిల్కులాగూ, ఎర్రట పేటా బుష్కోటూ తొడుక్కుని ఎర్రజండా పుచ్చుకుని తాండవంచేస్తూ శ్రీశ్రీ ప్రవేశించి:

శ్రీశ్రీ:

ఝూ! ఝూ! ఝూ!
ఝుటక్ పటక్
ఝూ! ఝూ! ఝూ!
హింసన చణ
ధ్వంసన చణ
హింస రచన
ఝూ! ఝూ! ఝూ!
విషవాయువు మరఫిరంగి
టార్పిడో, టార్నడో
అది విలయం
అది సమరం
అటో యిటో తెగిపోతుంది
సంరంభం
సంక్షోభం
సమ్మర్దన సంఘర్షణ
ఝుటక్ పటక్
ఝషా! ఝషా! ఝషా!

మరో ప్రపంచం
మరో ప్రపంచం

అగ్ని కిరీటపు ధగధగలు
ఎర్ర బావుటా నిగనిగలు
... ... ... ...
Charlie Chaplin, Joseph Stalin
Walt Disney, George Hugnet
Greta Garbo, Pirandello
ఇటీవల మా Inspiration.
Sigmund Freud, Harold Lloyd
Albert Einstein, Jocob Epstein
హారీన్ చట్టో, గి. రాం. మూర్తి
ఇటీవల మా Inspiration·
... ... ...
కథాకళీ, కూచిపూడీ,
జావా నాట్యం, Russian Ballot
Jazz, Rumba, Carioca
హుషారిస్తయ్, నిషా చేస్తయ్
Don Bradman, Mohan Bagan
Walter Lindrum, Vines, Codhet
కొంచెం Carroms, కాస్త Ping pong
ఒక కప్ కాఫీ, ఒక పఫ్ Cigarette

మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం
ఝూ! ఝూ! ఝూ!
హింసన చణ
ధ్వంసన చణ
హింస రచన
ఝూ! ఝూ! ఝూ!
ఝటక్ పటక్
ఝూ! ఝూ! ఝూ!

గంతులు వేసివేసి అలిసిపోయి అక్కడవున్న ఒక కుంటికాలి బెంచీమీద కూర్చుని, పడిపోకుండా బ్యాలెన్సు నిలుపుతూ సిగరెట్టు ముట్టిస్తాడు.

నేపథ్యంలో బొంగురు గొంతుతో పఠాభి:—

పఠాభి:

నా యీ వచన పదాలచే దుడ్డుకర్రతో
పద్యాల నడుముల్ విరగతంతాన్!—

శ్రీశ్రీ ఆవేశంతో బెంచీమీదనుంచి లేచి బెంచీతోపాటు క్రిందపడి అదే పోజులో:

శ్రీ శ్రీ:

అర్థాన్ని ఆఖ్యాన్నపు అడవిలో వదిలి
గద్యాన్ని పద్యానికి పెళ్ళి చేద్దాం—
కాదన్న మాదన్న యెవడేనావుంటే
వేమన్న యేమన్నాడో చూడమందాం.

నేపథ్యంలో పఠాభి:

చిన్నయ సూరి బాలవ్యాకరణాన్ని...

శ్రీశ్రీ: ఆపావు నీదుడ్డుకర్ర !—

చిత్తు చిత్తుగా
చితకేస్తాం—

ఛందోబందో బస్తులన్ని
ఛట్ పట్‌మని త్రెంచి
Damnit ఏమిట్రా యిదంటే
Pray it is Poetry అందాం.

నేపథ్యంలో పఠాభి:

ఇంగ్లీషు భాషాభాండారంలోనుంచి
బందిపోటుం జేసి కావాల్సిన
మాటల్ని దోస్తాను
నా యిష్టంవచ్చినట్టు చేస్తాను
అనుసరిస్తాను నవీనపంథా—కాని
భావకవినిమాత్రం కాన్నే
నహం భావకవిని—

త్వమేవాహం" అంటూ ద

ప్రవేశం:

ఆరుద్ర :

ఆ ఇ ఊణ్ బుక్ ఇక్
అందమే హుతభుక్
క ఖ గ ఘ ఙ
చావుకి అనుజ్ఞ—
ఆశేమన శుక్క—
అందమైన బ్ర—
కొంత మెతుకుతో
నిండుతుంది స్మీ—
కడుపునిండు మె—
కొంత బ్రతుకులో
దొరుకుతుంది లే—

మస్తిష్కం లేబొరేటరీమీద శాంతి పావురాయిల నెక్కించుకుని దాశరథి ప్రవేశం :

దాశరథి :

నా వేదనలో జన్మించిన ఊహింపులు
తొడగటానికి వ్యాకరణసూత్రపు
రెడీమేడ్ దుస్తులు లేక
దిన మొలల్తో ఉరుకుతున్నాయి
లోకాన పడి!

ఈ యిద్దర్నీ చూసేటప్పటికి శ్రీశ్రీకి తిరిగి ఆవేశం వచ్చేస్తుంది.

హరోం! హరోం హర!
హర! హర! హర! హర!
హర హర హర హర!
హరోం హరా!
మరో ప్రపంచం
మరో ప్రపంచం

తక్కిన యిద్దరూ కూడా అందుకుంటారు. ముగ్గురూ కవాతుగా నడుస్తారు.

పదండి ముందుకు
పదండి త్రోసుకు
కదం త్రొక్కుతూ
పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం
వినపడలేదా
మరో ప్రపంచపు జలపాతం
మరో ప్రపంచం
మరో ప్రపంచం
... ... ...
కనబడలేదా మరో ప్రపంచపు
అగ్నికిరీటపు ధగధగలూ
ఎర్రబావుటా నిగనిగలూ!

[నిష్క్రమణ]

వెనుకనున్న తెర నెమ్మదిగా లేస్తుంది. బందరు రాబర్ట్సన్ పేటకుంటదగ్గిర కూరల మార్కెట్ చేరువులో ఒక గొడుగుల దుకాణం! గొడుగుల దుకాణమంటే, గొడుగులమ్మే దుకాణం కాదు; తాటాకు గొడుగుల క్రింద పెట్టివున్న 'కవితా సామగ్రి' దుకాణం. దుకాణంమీద చుట్ట గాల్చుకుంటూ కాటూరి వెంకటేశ్వరరావుగారు కూర్చునుంటారు, ప్రక్కనే పింగళి లక్ష్మీకాంతంగారు జొన్నకంకులు పుచ్చుకు కూర్చుని ఊచబియ్యం కొడుతూ వుంటారు. దుకాణందగ్గిర ఆడా మగా చాలామంది మూగి అక్కడున్న సరుకులన్నిటినీ వింతగా చూస్తూ వుంటారు.

వేంక :

చూతురా? దీనినిఁ జూతపల్లవ ఖాదిని
పికాంగనా గాన నిస్వనంబు
కొందురా? దీనిని క్రొమ్మెఱుంగులజిల్గు
పనికిఁ గాదగిన కుందనపుఁ దళ్లు
కావలెనా యిద్ది, కలువపూరేకు
పొత్తములఁ జిప్పిలెడు మెత్తందనంబు
వలయునా? మలయపర్వత సానువులనుండి
దిగుమతియగు కమ్మతెమ్మెరలివి
తీయుదుర? దీని వెన్నెల తేటనిగ్గు

ఒఱయురుర దీని బచ్చకప్పురపుదావి
కోరికొందురా దీని పటీంజలము
త్రావిచూతురా దియ్యని పూవు దేనె?

నికరమ్మౌ అకలంకమైన సరకుల్
నిర్దుష్టముల్ మీ పరీ
క్షకు దాళంగల మేల్మిక్రొందినుసు మీ
కన్గప్పు మోసంపు వ
ర్తకుడన్ గాను, కులక్రమాగతము బే
రమ్మిద్ది భాషా కుమా
రకులారా! కొనరంచు మీరు కవితా
రంభ ప్రియం భావుకుల్.

వేంక:

ఈనాటిదా మాకు బానయ్య మా మూల
పురుషుండు యజ్వకీ సరకులమ్మె

లక్ష్మి:

ముత్తన్నసెట్టి మా ముత్తాత పింగళి
వారింట తననాడు వతనకాడు

వేంక:

కన్నయ్య మా తాతకాలాన చేమకూ
ర్వేం కన్న మాకొట్టు బేరగాడు

లక్ష్మి:

రమున మా తండ్రి యంగడిమీద
తిరుపతి కవులు నీ సరకె కొనిరి.

ఒక కుర్రాడు:

కోటయ్య మామ ఈ కుంచు దగ్గరె గదా
లేత లేతవి కోసి గోత మెత్తు

వేంక:

నమ్మకమ్మైన యీ సరకమ్ముచుందు
నాంధ్రదేశమ్మునలు దిక్కులందు దిరిగి
వతను గావత్తునే నను వత్సరమ్ము
నొకపరి కొనుండుమాట నమ్మకము దెలియు

ఎదురుగావున్న గోంగూర దుకాణంవాడు:

కొత్తగా బేరవెంపకు సత్తెమయ్య
మెరకసేలోన పెంచిన కరుకుకూర
ఉడకదనమాక, లేహమై ఊరుకుంట
దడుగు రేపొచ్చి! పోసుకోలాణ్ణిగాను!

గడ్డితట్టతో గ్రాస్‌గరల్ ఒకతె వచ్చి దుకాణం ముందు తట్టదింపుకుని లక్ష్మీకాంతం గారితో!

గ్రా. గ: ఇదిగో! యావుయ్యో! ఈ యాగానీ ఊచబియ్యసెట్టు—ఓరి నీయిల్లు బంగారంగానూ తంపటన్నా యెయ్యకుండా పచ్చిగింజలే అమ్ముతుండావేం మాయదారి యాపారం!

లక్ష్మి:

పచ్చజొన్నలు తీయని పాలుగారు
లేతగింజలు తినుము—కాలిచిన వింత
తీపియుండదు—

గ్రా. గ: పచ్చియొ్యా యెచ్చియొ్యా—తోరగా యిత్తావా పొమ్మన్నావా?—మాటలు జెప్పెదవేఁగాని మశిసి కెక్కడా కరుసలేదేం.

లక్ష్మి:

—తట్ట నెత్తెదవిదేల
నూకపోవ నూదెడి దాకనాగలేవె?

ఒక కుర్రాడు: (వెనకనుంచి యీలవేసి)

[2]జొన్నసేసుకేడ సొగసు కత్తెనుసూసి
నిన్నతలమించి నిదరలేదు
దాని నన్నుగూర్చి దయజూడుమాధవా
పొన్నపూలు దెచ్చి పూజసేతు.

లక్ష్మీకాంతంగారు తెల్లబోతారు; ఆ పడుచు వల్లమండి 'ఓరి నీజిమ్మలాగా! నీకేం పొయ్యేకాలం' అని కుర్రాణ్ణి తిడుతుంది.

కుర్రాడు:

జొన్నసేను కవిత్వమే సుందరాంగి
కొత్తసోకుల పోకిళ్లు కులుకులాడి
డొంకసేలోన యెంకి నీరంకె యింటి
పచ్చగడ్డిలో నీమేని పసలుగంటి.

2. ఒక పాతపద్యం : రచయిత పేరు తెలియదు.

గ్రాస్ గరల్ తట్టబుచ్చుకుని కుర్రాణ్ణి వెంటబడి తరుముతుంది:

మరో కావిడ: (జంగిడంలోనుంచి ఒక వస్తువుతీసి) ఈ యినపబల్లు లేవిటబ్బాయ్? హెయిరు పిన్నులా?

వేంక: హెయిరు పిన్నులు కావు మకరికా పత్రాలు.

ఆవిడ: మకరికాపత్రా లేవిటబ్బీ? ఎందుకివ్వి?

ఒకకుర్రాడు: పాపం మీ రెప్పుడూ మాదిగ భాగోతం చూళ్లేదల్లేవుంది.

వేంక: ఏడిచావ్ నోరుముయ్యి!

ఆవిడ: అయ్యో పాపం ఆకుర్రాణ్ణి తిడతా వేం? తెలియకడిగాను గనుక చెబుతున్నాడు—ఇంతలోకే అంతకోప మేవిటబ్బీ!

వేంక: అందంకోసం ఆడవాళ్లు వీటిని బుగ్గల మీద అంటించుకుంటారు.

ఆవిడ: ఛీఛీ! నేనేం అలాంటి పోకిరీ వేషాలు వేసే ఆడదాన్ననుకున్నావా యేవిటి? ఫేసుపౌడరు డబ్బావుంటేయియ్యి.

లక్ష్మి: ఛీ! ఛీ! ఛీ! సంప్రదాయమూ చట్టుబండలా?

వేంక: చిరాగ్గా కొట్టుమీదనుంచిలేచి అక్కడున్న జనాన్నందర్నీ వెనక్కు పడదోస్తూ:

కవితా లతాంగికి కర్ణభూషణమైన
కలువ మీచేబడి నలిగిపోవు
మీ కృతికన్యలకీ కుందనపుదళ్కు
నగలుకై సేయు భాగ్యమ్ము కలదె
యీవలిగాడ్పు మిమ్మావహించిన తన
జ్వాల లీనునెగాని సౌఖ్య మిడదు
తీయని యీగండు కోయిలగానంబు
వెగటాయె నౌర మీ వీనుగవకు
ఈ తుషారజలంబు మీ చేతులంటి
మలినమైపోయె కొనకున్న మానెపోండు
సుకవి భోజ్యమ్ములిచటి వస్తువులు వీని
నలిపివేయకుడటు నిటు గలచివైచి—

కుర్రాడు: 'సుకవి భోజ్యా' లేవిటండీ చుట్ట పీకెలా?

వేంకటేశ్వరరావుగారు అమాంతం అగ్గిరాముడై తాటాకుగొడుగు పీకేసి గొడుగుకామ పుచ్చుకుని కుర్రాడి వెంటబడి తరుముకుపోతారు. లక్ష్మీకాంతంగారు చెల్లాచెదరైన సరకులన్నీ జంగిడాల్లో సర్దుకుని నెత్తినబెట్టుకు బయలుదేరతారు.

లక్ష్మి: ఛీఛీ! వట్టి చవిటిపర్ర- లాభం లేదు— ఇక్కడనుంచి అటు యే విశాఖపట్నానికో ఇక దుకాణ మెత్తెయ్యాలిసిందే. (నిష్క్రమణం)

మద్దెల, హార్మోనియం, తాళాలూ—భజన చేస్తూ ఒక తండా అభ్యుదయ రచయితల ప్రవేశం:

[3] కీలుగుఱ్ఱము పైసి
బాలీసు కానుకొని
ప్రాణాలు లేనట్టి
భగవంతు డొచ్చాడు
ఊరంత ఊరేగుతూ
ఉత్సవము సారించుతూ
కూలిమా టడగండిరా
అన్నాలు
చాలవని చెప్పండిరా!

కంచుగుండెకు కూడ
కనికరము గలదన్న
మాయ వేదాంతాల
మా కేదో సూదారి
జాలిగిలబడి మ్రొక్కరా
వినకుంటె
చెవిటి మొద్దని వీడరా
ముక్కోటి దేవతలు
మూర్తుల్లు కంపిల్లి
కోటి చేతులు చాచి
గగ్గోలుగా లేచి
కూలిమా టడగండిరా
అన్నాలు
చాలవని చెప్పండిరా!

3. ఒకానొక అభ్యుదయకవి రచన.

నేపథ్యంలో విశ్వనాథ సత్యనారాయణగారు!

అతిమనోబుద్ధ్యహంకృతు లౌపనిషదు
లాత్త గండూషితత్రయు లౌర్వవహ్ని
గర్భితాంతస్తపస్కులు ఘనులు ఋషుల
కెవ్వడు విరోధి తద్వ్యధకెత్తిన యది!

అభ్యుదయ భజనపరులు తాళాలూ మృదంగాలూ ఎక్కడి వక్కడ రోడ్డుమీద పారేసి తలో త్రోవనూ పరారీ. సత్యనారాయణగారు ప్రవేశం.

సత్య :

అల నన్నయ్యకు లేదు తిక్కనకు లే
దా భాగ్య మస్మాదృశుం
డలఘుస్వాదు రసావతార ధిషణా
హంకార సంభార దో
హల బ్రాహ్మీమయమూర్తి శిష్యుడయినా
డన్నట్టి దావ్యోమ పే
శల చాంద్రీమృదుకీర్తి చెళ్లపిళ్ల వం
శస్వామి కున్నట్లుగన్.

రెండవవైపునుంచి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, వరఖ్ పారడీశాస్త్రి, ప్రవేశించి, ప్రాంజలిబద్ధుడై మోకరిలి :

జ. రు :

కించిత్తిక్త కషాయషాడబరస
క్షేపాతిరేకాతి వా
క్సంచార ప్రచయావకాశములలో
కవృద్ధ! గండాశ్మముల్
చంచల్లీల నుదాత్తవాగ్గరిమతో
సాధించి వేధించుమూ
పంచారించి ప్రవహ్లికాకృతికృతి
పాషాణపాక ప్రభూ!

తెర దిగిపోతుంది—సారకాయబుర్ర యేకతార తంబురా మీటుతూ తెరముందుకు కవికొండల వెంకట రావుగారి ప్రవేశం: తత్వాలు :

'దాక్కునివుంటాయి
దారంటగడ్డి, ని
రుక్కునివుంటాయి!—
తలపగరాని పూలు
పిలవగబోనిపూలు
నిలుపగ లేనిపూలు
దాక్కునివుంటాయి
దారంటగడ్డి, ని
రుక్కునివుంటాయి!—
గ్రుక్కెడు వాననీళ్ళకు
పక్కన నవ్వుతాయి
ఉక్కగ కాసంతుంటే
త్రొక్కటపడతాయి
దాక్కునివుంటాయి
దారంట గడ్డి, ని
రుక్కునివుంటాయి—
ఒక్కడ నడుస్తూవుంటే
చుక్కలు పొడుస్తూ వుంటే
మక్కువ గూర్యోమంటాయ్
ఎక్కడో ఎందుకో చెప్పవ్
దాక్కని వుంటాయి'—

వెంకటరావుగారు నిష్క్రమించగా, కాశీ కావడి బుజానబెట్టుకుని రెండో వేపునుంచి పింగళి లక్ష్మికాంతం గారు ప్రవేశించి:

లక్ష్మి :

స్థానము మోక్షలక్ష్మికి, ని
ధానము ధర్మమహాత్తుకున్, దిరో
ధానము మందబుద్ధికి, వి
ధానము మానసతృప్తికిన్, సమా
ధానము మేధకున్, సుపరి
ధానము ధాత్రివధూటికిన్, మహా
ధానము శ్రీకి, నీ తనువు
తాపహారంబగు నాకు జాహ్నవీ!

సీళ్ళు చేసిన కొన్ని రాగి బుడ్డిచెంబులు కావిడి బుట్టలోనుంచి బయిటికి తీసి :

ఇదిగిదిగో గంగాజలమండో రామాహరీ!
బురాన్ చెరువునీళ్ళు కోదండో రామాహరీ!
గంగాధరుడి జటాజూటంనుంచి రామాహరీ!
లవంగీప్రియుడు పిండినరసం రామాహరీ!
ఖరాస్త్రై బుడి చెంబుల్లో రామాహరీ!
శిఖా చేయించి తెచ్చానండో రామాహరీ!
తఖరారుందని అనుమానముంటే రామాహరీ!
4తాతంభట్టు సీళ్లుతనిఖీ చేయించండి రామాహరీ!

(నిష్క్రమణం)

# ద్వితీయాంకము:

[గిరీశం ప్రవేశం]

గిరీశం: రానున్నది ఆంధ్రప్రజల మహోద్ధరణకు గాను భావకవులచే సారించబడిన మహోద్భుత విప్లవ ఘట్టం. అటు గాంధీజీ ప్రారంభించిన స్వాతంత్ర్య మహా విప్లవానికి మద్దతుగా ఆంధ్ర మహాకవులు లేవదీసిన మహా విప్లవం.

[వెంకటేశం ప్రవేశం]

వెంక: విప్లవం విప్లవమంటున్నావేమిటిబావా. కానిస్టేబుల్ రామయ్య గడపదగ్గిర కళ్లురుముతున్నాడు కాస్త గొంతు తగ్గించు.

గిరీశం: ఆరి నెర్రివాడా! విప్లవమంటే, కత్తులూ కటార్లూ, సత్యాగ్రహాలూ, బట్టబంధాలూ — అంలాంటి నాటురకం రాజకీయ విప్లవమనుకుంటున్నావా యేమిటి? ఇది సాహిత్య విప్లవం.

వెంక: విప్లవం అంటే ఎవరిమీద? ఎందుకు?

గిరీశం: ఎందుకు ఎవరిమీదా అనటానికి ఇది రాజకీయవిప్లవం కాదురా బాబూ అంటే వినవేం? ఇది సాహిత్యవిప్లవం. విప్లవంకోసమే విప్లవం. కళ కోసమే కళ; ఇది ప్రణయోజ్వల మహావిప్లవం. ఈమహోద్యమానికి, ధ్వన్యాలోకానికి పోటీగా రమ్యాలోకం రచించి ఆనందవర్ధనాచార్యులను చిత్తుక్రింద ఉతికేసిన ఆచార్య రాయప్రోలు అద్యతన సూత్రకారుడు, ఆపైని భాష్యకారుడు గిరీశం.

ఆచార్య శ్రీ పాదులు అంబరతలాన ఆవిర్భవించి ప్రణయ మహాసూత్రాన్ని ప్రవచించబోతున్నారు కామోష్!

[చప్పట్లుకొట్టి ఈల వేస్తాడు — లైట్లు ఆరిపోతాయి — తెరమీద సంభ్రమంగా వెలుగు చక్రం విచ్చులుకుంటుంది. వెలుగుచక్రానికి మధ్య చిన్ముద్రతో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు]

సుబ్బా:

మాధురి చిచ్ఛ్రయించెదరు సంభోగ సుఖము
నే వియోగమాధుర్య లీలావిపాక
మనుభవింప నర్హుడెద!"

[గిరీశం గయ్యిమని యీల ఊదుతాడు; సుబ్బారావు గారు అదృశ్యమైపోతారు; లైట్లు వెల్గుతాయి]

గిరీశం: 'సంభోగంలేని సంయోగం' — డైరెక్ట్ ప్లాటానిక్ లా! — (ఈలవేసి చప్పట్లు కొడుతూ) కొట్టమ్మంది చప్పట్లు! (ఎవ్వరూ కొట్టరు); పోనీ బద్ధకంగావుంటే మానెయ్యండి.

వెంక: సంభోగంలేని సంయోగ మేమిటి నా తలకాయి 'విరహం రసైకస్థాన మన్నదాని కొచ్చిన గాడిదగత్తరువా?

గిరీ: అబ్బాయీ యివన్నీ సీనువాళ్ళ సంగతులు నీకు తెలీవుగాని యిక ఊరుకో. అధునాతన రససిద్ధాంతం నీ కెలా అర్థమౌతుంది యింగ్లీషు చదువుకోంది.

వెంక: ఇదుగో! బావా! మర్యాదగా చెబుతున్నాను. ఆస్తు, కథా అలాంటి దచ్చిలేపో చదవండిగాని రసం గిసం అన్నారంటే మాత్రం...

గిరీశం: ఆరి పిడుగా! ఆ గోదాలోకొస్తే మోదేస్తా నంటావ్! — ఇంతకీ మరి ఈ ప్రదర్శనం కొనసాగించదమా మానెయ్యడమా?

వెంక: ఇందాకా వొచ్చి ఆపేయ్యడమెందుకు లైట్లదండగ — కానీ.

గిరీశం: (ముందుకువచ్చి) సోదర సోదరీమణులారా! ప్రణయ మహావిప్లవం ప్రారంభమౌతోంది; ప్రణయమే దుఃఖం, దుఃఖమే అంధకారం: అదుగో అంధకార మావరిస్తోంది!

[ఈలేస్తాడు — లైట్లు ఆరిపోతాయి — మళ్లా యీల వేస్తాడు రంగంమీదికి బ్లూలైట్ ఫోకస్.]

గిరీశం: (అంధకారంలో అరుపు) అంధకారం ఆవరించిపోయింది; రంగంమీద బ్లూలైటు పడుతున్నా ప్రేక్షకులు కాళరాత్రిగా ఊహించాలి!

(నిష్క్రమణం)

ముళ్ళకిరీటం పెట్టుకుని శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రిగారి ప్ర...

4. సులక్షణసారం రచించిన లాక్షణికుడు.

కృష్ణ
ఎవ్వరని యెంతురో నన్ను ఏననంత
శోక భీకర తిమిర లోకైకపతిని
కంటక కిరీటధారినై, కాళరాత్రి
మధ్యవేళల జీమూత మందిరంపు
గొలువు కూటాల నేకాంత గోష్ఠి దీర్చి
దారుణ దివాంధరోదన ధ్వనులశ్రుతుల
బొంగి యుప్పొంగి యుప్పొంగి పొరలిపోవు
నా విలాప నిబిడ గీతికావళీ వి
రావముల నర్ధరాత్రి గర్భమ్ము మరియు
మరియు భీషణ కాళిమోన్మత్తగాగ
జేయుతరి నన్ను మీరు వీక్షింపలేదా!
నన్నుగని యేరు జాలి జెందంగవలదు
నాకు నిశ్వాస తాళవృంతములు గలవు
నా కమూల్య మపూర్వ మానంద మొసగు
నిరుపమ నిశాంత దుఃఖంపునిధులు కలవు—
ఎవ్వరని ఎంతురో నన్ను?—

*    *    *    *

మీరు మనసారగా నేడ్వనీరు నన్ను—
నన్ను విడువుడు—ఒకసారి నన్ను విడిచి
నంత నేకాంత యవనికాభ్యంతరమున
వెక్కి వెక్కి రోదింతును విసువులేక
విరతిలేని దుర్భరశోక విషమగీతు
లేడ్చిపైతును!—

*    *

ప్రేయసీ ప్రేయసీ
ప్రియుడనే ప్రేయసీ
వేయికన్నులు దాల్చి
వెదకుచున్నానే
నల్ల మేఘాలలో
నాయమాదా గంగ?
తల్లడిలవో నన్ను
దలచి రావో!
మెఱపువై యొయ్యారి
మెఱపువై కాన్పించి
యరసినంత నె
మబ్బు తెరల దాగితివా
ప్రేయసీ! ప్రేయసీ!
ప్రేయసీ! ప్రేయసీ! (నిష్క్రమణం)

[వెంకటేశం ప్రవేశం]

వెంక: (తెరలోకి చూసి) అర్! ఏమిటి చెపుమా అల్లా గుండెలు కొట్టుకుని గోలపెట్టేస్తున్నారు! (వెనక్కు తిరిగి చప్పట్లు గొట్టి) బావోయ్! బావోయ్!

[గిరీశం ప్రవేశం]

గిరీ: ఏమిటలా గావుకేక లెట్టేస్తున్నావ్?

వెంక: నెత్తురుడోలా!

గిరీ: నెత్తురుడోలా ఏమిటి నీ తలకాయ్!

వెంక: నెత్తురుడోలాయే తెలీదూ? నిక్కబోతావ్ మహా యింగ్లీషు చదివాననీ! ఎలా గుండెలు బాదుకుంటున్నారో అటు చూడు!

గిరీశం: అది సాయబుల ఊరేగింపు కాదురా బాబూ! సత్కవుల సమాజగానం. నీకు సంస్కృత సమాసంలో చెప్పేడిస్తేనే గాని అర్థం కాదు: విరహవేదనాదోధూయమానమానసులైన భావకవులు — *in Community* — అంటే ఏకైకబృందంగా విలపించుతున్నారు. రంగంమీద లైట్లు ఆఫ్ చెయ్యాలి లోపలికిపోదాం పద. (లాక్కుపోతాడు).

[లైట్లు ఆరిపోతాయి! బ్లూలైటుఫోకస్. గుండెలు గభీగభీ గుద్దుకుంటూ ఒకతండా భావకవుల ప్రవేశం.]

'ప్రేయసీ! ప్రేయసీ!
ప్రేయసీ! ప్రేయః
ప్రేయసీ! ప్రేయసి
ప్రేయసీ! ప్రేయసీ

రంగంమధ్యకువచ్చి నిల్చుని పాట ఆపేసి ఒకలయలో జబ్ జబ్ గుండెలు బాదుకుంటూరు. గుండెలమీద చొక్కాలు చిరిగిపోతాయి. ఎదు ర్రొమ్ములు ప్రిదులుకుపోయి రక్తాలోడుతూ వుంటాయి. 'ప్రేయసీ! ప్రేయసీ' అంటూ మళ్లీ పాట అందుకుని గుండెలు మోదుకుంటూ ఊరేగింపుగా కదిలి లోపలికి వెళ్ళిపోతారు.

రెండవ వేపునుంచి పార్కర్ పెన్ జాకుతో
నాథ సత్యనారాయణగారి ప్రవేశం

సత్యా:

ఆత్మ నిత్య మ్మకాలాద్యవచ్ఛిన్నమ్మ
సచ్చిదానందసంపచ్ఛ్రయమ్మ
అద్వితీయమ్మేక మపరిణామ ప్రాప్త
మపరిమేయమ్మది యచ్చ తెలివి
అట్టి జ్ఞానముతోడ నైక కాలికముగా
నాదిమునుల్ గల రాట్ప్రభువులు
యోగనిద్రాముద్ర నూని తామే యద్వై
యదియ తాత్మెయందు రమ్యతకళలు
ఆత్మతో నాది మును లెట్టు లవనితోడ
నాది నృపు లైక కాలికులై చరింత్రు!

మనోబుద్ధ్యహంకృతు లౌపనిషదు
లాత్త గండూషితత్రయు లౌర్వవహ్ని
గర్భితాంత స్తపస్కులు ఘనులు ఋషుల
కెవ్వడు విరోధి తద్వ్యథ కెత్తిన యది!

(నిష్క్రమణం)

వెనకవైపునున్న తెర నెమ్మదిగా లేస్తుంది. ఎత్తైన ఒక తక్తుమీద కూర్చుని ముందు మేజా వుంచుకుని నవ్యసాహిత్య పీఠాధిపతి శ్రీ స్వామీ శివశంకర శాస్త్రి ధారావాహికంగా కవనం వ్రాస్తూవుంటారు. చదువుతూ వ్రాస్తారు.

ఆయనకు ఎదురుగా మరో మేజాముందు గిరజాల జుట్టున్న ఒక బారులాల్చీ యువకుడు కూర్చుని రూళ్ళకర్రా పెనసలూ తీసుకుని, రూళ్లు గీస్తూవుంటాడు: స్వామీజీ అవతల 'ఓ కాంతా' అనప్పుడల్లా- కుర్రవాడు సర్ న ఒక రూలు గీస్తాడు.

స్వా

ఆ ప్రభాతము వేళ ఓ కాంతా!
అభిజనుల సౌధాన ఓ కాంతా!
కుట్టిమము వేదిపై ఓ కాంతా!
కూర్చుంటి వదినెతో ఓ కాంతా!
ఆయింటి భామినుల కో కాంతా!
ఆప్తురాలట వదినె ఓ కాంతా!
కుశలమడిగిన పిదప ఓ కాంతా!
గోష్ఠి చేసిరి వారు ఓ కాంతా!
నే పరధ్యానముగ ఓ కాంతా!
నింగి కాంచుచు నుంటి ఓ కాంతా!
చూచుచుండగ నటుల ఓ కాంతా!
సూర్యకాంతులు పడిన యో కాంతా!
మస్తకమ్మును ద్రిప్పి ఓంకాతా!
మరల కన్నులువిప్ప ఓ కాంతా!
ఆవిర్భవించినది ఓ కాంతా!
అభినవా కారమ్ము ఓ కాంతా!

అట్టాలకమునుండి ఓ కాంతా!
ఆ పురుషవిగ్రహము ఓ కాంతా!
వాల్చి నిజశీర్షమ్ము ఓ కాంతా!
వంపు సోపానములు ఓ కాంతా!
దిగుచుండు సమయాన ఓ కాంతా!
తిలకించినా నమ్మ ఓ కాంతా!
చివర సోపానమ్ము ఓ కాంతా!
చేరినంత నె నన్ను ఓ కాంతా!
విప్పు కన్నులతోడ ఓ కాంతా!
వీక్షించె నామూర్తి ఓ కాంతా!

స్వామీజీ వ్రాయడం మానేస్తారు—కుర్రాడు కూడా రూళ్లెయ్యడం మానేస్తాడు. స్వామీజీ లేచి నిల్చుని చేతులు దులుపుకుంటారు—కుర్రాడుకూడా లేచి నిల్చుని చేతులు దులుపుకుంటాడు.

స్వామీజీ: ఈపూట చాలా పనిచేశాను.

కుర్రాడు: నేనూ చాలా పని లాగేశాను.

స్వామీజీ: వరహాల్లాంటి కవనం వాహినిగా నాలుగు వేల పంక్తులు రచించాను.

కుర్రాడు: వజ్రాల్లాంటి రూళ్లు వరసగా నాలుగువేలు గీసేశాను.

స్వామీజీ: (భగ్గునమండి) చట్! ఏమన్నావ్!

కుర్రాడు: (అమాయికంగా) నేనేమన్నానండీ రూళ్లన్నాను.

[హఠాత్తుగా తెర దిగిపోతుంది.]

# : తృతీయాంకము :

[గిరీశం ప్రవేశం]

గిరీశం : ఇప్పుడు మనం విశ్వాన్నుంచి నిలయానికి ఎగురుతున్నాం. ఈ దశ్యాలనుచూసి భరించాలంటే మనస్సుమీద బుద్ధి కంట్రోలు పూర్తిగా సాంతం లాకు లెత్తేయ్యాలి. ప్రేక్షక మహాశయులకు హెచ్చరిక!

(నిష్క్రమణ)

[ఆరుద్ర ప్రవేశం]

ఆరుద్ర:

ఇది విష్కంభం
ఆదిమానవుడిలో స్రవించిన భయం
ప్రవహిస్తున్నాది నీలో
అతడి మస్తిష్కంలో హస్తంలో, అరుపులో
ప్రభవించిన తమం
భ్రమపెడుతున్నాది నిన్ను
ఏది నిజంగా కనబడుతూందో
దాన్ని గ్రహించలేవు
ఆకారరహితాలను చూడలేవు
'నిన్న'ని గుర్తించలేవు, నిన్నే పోల్చుకోలేవు
సీకనుపాప అయిదేళ్ల చిటిపాప
ఉద్దేశించిన భావాల ఆడబొమ్మలకి
వాక్యాలు గడ్డాలూ మీసాలూ పెడతాయి
తుపాకులు బహిరంగంగా
మనుషులను వెక్కిరిస్తాయి
విశాలలోకం సర్కసు లోపల
నియంతలనోట్లో ప్రజాజీవితం తెగుతుంది
సైన్సు గడ్డుసమస్యలను పుంఖానుపుంఖంగా
తయారుచేస్తుంది
గణితం మానవుని అవసరాలబడి ఎగేస్తుంది
విద్య జీతం నష్టంమీద
అనారోగ్య కారణాలవల్ల సెలవు పెడుతుంది
ప్లీడరు గుమాస్తాకి లంచం రెట్టింపవుతుంది
కిరాణాల కొట్లో ధరలు
రెచ్చి తమ్ము హెచ్చవేసుకొంటాయి
చిరంజీవి మానవుడా!
ఇది ప్రళయం
ఆదిమూర్తి లిబిడోలో
గడ్డకట్టిన కామం కరుగుతున్నాది నీలో
అతడి కనులలో కౌగిలిలో పొలికేకలలో
తిష్ట వేసినఆకలి ఆశ్చర్యపెడుతున్నాది నిన్ను
ఏదినిజంగాజరుగుతున్నదో దాన్ని చూడలేవు
ఆధారరహితాలను పేర్చలేవు
'నేటి'ని మార్చలేవు నిన్నే పోల్చుకోలేవు
నీ అవ్యక్తం, అలతొలిప్రొద్దుల
దండకారణ్యం.

(నిష్క్రమణం)

'శ్రీశ్రీ మార్క్సు పద్యాలనే వాడుడు!' అని వ్రాసివున్న అట్టలు వెన్నునా ఎదురొమ్మునా వ్రేలాడగట్టుకొని చెదరి చీకాకైన జుట్టుతో శ్రీశ్రీ ప్రవేశం.

శ్రీశ్రీ:

రెండు ఖడ్గాలు
రెండు ఖంజరీటాలు
రెండు అగ్నిపర్వతాలు
రెండు ఆంజనేయదండకాలు
జో జో
జ జ
రెండు కంకాళకార్తికదీపాలు
రెండు రాబందు రా(జా)జీనామాలు
రెండు కళ్లు తెరచిన నాగళ్లు
రెండు పిడికిళ్లు బిగించిన కొడవళ్లు
హా హా
హూ హూ
రెండు కళ్లు
రెండు కళ్ల జోళ్లు

రెండు కళ్ళజోళ్ళ నోళ్లు
రెండు కళ్లజోళ్ళ నోళ్ళ వాగుళ్లు
హ్రీం
రీ రీ
రెండు జిలిగ్రామ్య భాషలు
రెండు సమస్తాంధ్ర ఘోషలు
రెండు నిండు కొబ్బరికాయలు
రెండు నారింజకాయలు
బా బా
బీ బీ
రెండు చదువురాని విస్తరాకులు
రెండు దారితప్పిపోయిన కిరీటాలు
రెండు చీకటింట్లో రాకాసి కేకలు
రెండు నిలబడ్డ నిట్టూర్పు కొరడలు
దా దా
దీ దీ
రెండు వేషాలు విప్పేసిన తలగడల క్రింద
నిద్రమేలుకుంటున్న నక్షత్రాలు
రెండు నిశ్శబ్దాలు విరిసిన సరిగమ
దనిశల మీద
నీడలు పలికించిన విలోల కల్లోలాలు
రెండుయుగాంతాల సందున
దిగంతాలమాటున
వసంతాలడుకునే అనంతాలు
నే నే
నీ నీ
రెండు జగన్నాథ రథరథ రథాధర
ధరాధర
రసాతల జలపాతాలు
రెండు : స్వయం శమం వరం తకం
ప్రకంపమాన
లోకాలోకవిలోకాలు

రెండు : భ్రమా భ్రమర భ్రమణ భ్రమరణ
భ్రమావరణ బ్రహ్మ వైవస్వత
మన్వంతరాలు
శ్రీశ్రీమార్కు-పద్యాలనే వాడుడు!
[నిష్క్రమణం]

తెరలేస్తుంది — చీకటి చీకటిగావున్న పిడ శ్మశానం — కొష్ఠాలు ఎర్రగా జ్వాలలు రేగి మండుతూ వుంటాయి. గురజాడ అప్పారావుగారు, గిడుగు రామమూర్తిపంతులూ చెరోవైపునా రెండు చెట్లకు తలక్రిందులై వ్రేలాడుతూ వుంటారు. అనేకమంది గుర్తు తెలియని మనుషులు జేబుతలలతో పిశాచాలులా ఇటూ అటూ తిరుగుతూ వుంటారు. గుడ్లగూబలు అరుస్తూ ఇటు అటూ ఎగురుతూ వుంటాయి.

[ఆకాశంలో ఒక ధ్వని]
ఓహో సౌందర్యసామ్రాజ్యనిశీథమూర్తీ
తరాలనుంచి వ్యాపించివచ్చు
విచార వ్యాధిగ్రస్తుడా
సామ్రాజ్యాధిపునిబోలుదును నేను;
తరాల విచారము నాహృదయాన
ప్రవేశించి వ్యాపించి
సమాధిచేసె నా పుష్పాలశయ్యను!
నిర్జీవకార్యాలుగానుండు
మృతజీవిగా నే జేయునవి!
ఏమందువా ఓ నిశీథసౌందర్యమూర్తీ!
నారక్తనాళాలలో పసరెక్కి
పేరుకొన్నది విపరీతవైతరణి

చిరిగిపోయిన చొక్కాలాగూ చెదరిపోయిన జుట్టూ శ్రీశ్రీ ప్రవేశించుతాడు. అటునుంచి అదే శ్మశానంలో పురిపండా అప్పలస్వామి ప్రవేశించి యిద్దరూ రంగం మధ్యను తారసిల్లుతారు: శ్రీశ్రీ పురిపండా ముఖంలోకి తీక్ష్ణంగా చూసి వికటాట్టహాసంగా నవ్వి:

శ్రీశ్రీ : హా! హా! హా! విన్నావ్:—
తురాయికంటె! ఆ
కురాయికంటె

5. కీ. శే. శిష్ట్లా రచన.

కీచు రాయికంటె
హిమాంసు రాయి గొప్పవాడు
ఏం బ్రదర్ !

. . . . . . . . . . . . . . . . . . . . . .

హాంగ్ కాంగ్ లో
కింగ్ కాంగ్ తో, ఒ
రాంగుటాంగ్ ఆడిన
పింగ్ పాంగ్ లాగు!!! —

పురిపండా : హా! హా! హా! అవును బ్రదర్.

లోకం కాలంనాపై
రాబందు దంపతులై
నా శవాన్ని
బతికుండిన నా శవాన్ని
చీల్చినంచుకుతింటుంటే
పంచుకు భక్షిస్తుంటే
నీగుండెల వికసించిన
గులాబీల తెలివసనం
నావొడలి నలంకరించి
నాకెంపుల స్వప్నం
నాపథ వీధిని వెలిగిస్తే
శతసహస్రవధువులు రా
కన్నెలు నా వెంటవచ్చి
వెడలినాను వినువీధికి!

(శ్రీశ్రీని ముద్దు బెట్టుకుంటాడు)

శ్రీశ్రీ చిరాకెత్తి జుట్టు పీక్కుని తందనా లేస్తూ :

రాబందుల రెక్కల చప్పుడు
పొగగొట్టపు భూంకారధ్వని
అరణ్యమున హరీంద్రగర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గమృగోదగ్ర విరావం
ఝంఝానిల షడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి
కావాలోయ్ నవకవనానికి

(అప్పలస్వామి బుగ్గిమీద పొడిస్తాడు).

ఇద్దరూ చెట్టాపట్టాల్ పట్టుకుని వెర్రిగా నవ్వుకుంటూ మండుతూన్న కాష్ఠాలవేపు బయలుదేరతారు. మరొక యువకుడు ఎదురై.

“విన్నారా! అన్నాయ్!
ఈ సన్నాయ్ !—
రెండూ రెండూ నాలుగు
అన్నది నిజం !
నిజంగా నిజం ! ”

ముగ్గురూ నడుస్తూవుంటారు.

బెల్లపుకొండ రామదాసు ప్రవేశించి పైపంచ తీసి వల్లెగా వేసుకుని:

బె. రామ :

బ్రతుకొక అశోకవృక్షం
ప్రపంచమొక లంకానగరం
నేను సీతను !
జీవితాశోకవృక్షచ్ఛాయల్లో
కూర్చున్నా —
నా చుట్టూ
బాధిస్తూ దానవులు - మానవులు
నేను సీతను
జీవితాశోకవృక్షచ్ఛాయల్లో
హనుమంతుని రాక ఎదురుచూస్తూ
లంకాదహనం ఎదురు చూస్తూ !

బుగ్గను వేలేసుకుని చెట్టుక్రిందపోయి కూర్చుంటాడు.

పోతూపోతూ వున్న శ్రీశ్రీ పురిపండా చివాల్న వెనక్కి తిరిగి ఆవేశంగా నడిచి వస్తూ :

పురిపండా :

బురుజుమీదిబొల్లిగద్ద
బురుజుక్రింద కృకలాసం
ఉల్లిపాము తలపాగా
ఊరినిండ పులిపంజా
చీకటిచిందిన రక్తం
క్విజ్లింగుల విష్కంభం
పాడలేని పాడుకోట

పణ్యాంగన పరిహాసం!
రణరణరణ
ఝుణఝుణఝుణ
కనకదుర్గ కాలి అందె
కపాలపాత్రికనిండా
అపారమీ పానీయం
పగిలిపగిలి రగిలిరగిలి
ఇది విప్లవసంకేతం
చిరవాంఛిత సంక్షోభం!
ఓహో సైనికులారా
మీహాయు హేషల బెదరిన
అరదమ్ములు సీరదాలు
గజ గజ గజ
గజ గజ గజ
వృద్ధ వసుంధర స్వాహా
నా గేయం మీ కవచం
మీ ఖడ్గం నా గేయం
కుబుసం వదలిన సర్పం
నా గీతం పులిపంజా
ఝుణఝుణఝుణ
రణరణరణ

శ్రీ శ్రీ అందుకుని — తాండవం: అందరూ అతనితో పాటు కోలాహలంగా భీభత్సతాండవం.

శ్రీశ్రీ: ఝుణఝుణఝుణ
ఝుణఝుణఝుణ
ఝుణఝుణఝుణ
ఝనా ఝనా ఝనా
హింసనచణ
ధ్వంసనచణ
హింసరచన
ఝనా ఝనా ఝనా
ఝుటక్ పటక్
ఝనా ఝనా ఝనా
ఝనా ఝనా ఝనా
ఝనా ఝనా ఝనా
ఝనా ఝనా ఝనా

జట్టా పట్టాల్ పట్టుకుని వలయంగా తిరుగుతూ వుంటారు.

నే పథ్యంలో — 'అతిమనో బుద్ధ్యహంకృతు లౌపనిషదులు' అన్న పద్యం వినిపించుతుంది.

[అంతా కలిసి బృందగానం]

వస్తున్నది కాలభుజంగం
వైశ్వనాథ సాత్య నారాయణీయం
వెయ్యిపడగ లేసు లేసుకుని
కయ్యానికి వచ్చేస్తున్నది!
రారమ్మని ఆహ్వానిద్దాం,
రాకుంటే రమ్మే లేదోయ్!
రక్తిగట్టదీ భీభత్సం.

'అతిమనోబుద్ధ్యహం కృతులు' అన్న పద్యం చదువుతూ సత్యనారాయణగారు రంగంమధ్యకు వస్తారు. తక్కినవాళ్ళంతా ఆయన్ను వలయంగా చుట్టేసి భీభత్సంగా అరుస్తూవుంటారు:

'ఝనాఝనాఝనాంఝుణ
ఝనాఝనాఝనాంఝుణ
ఝనాఝనాఝనాంఝుణ
ఝనాఝనాఝనాం!'

వలయానికి మధ్యన సత్యనారాయణగారు పార్కర్ పెన్ బాకుతో కోడెతాచులా నాట్యం చేస్తూ యెవరందితే వారిని కాటెయ్యడానికి ప్రయత్నించుతూ వుంటారు.

[తెర పడుతుంది]

(ప్రేక్షకులలోనుంచి పూషా (రజనీకాంత రావుగారు) లేచివచ్చి రంగంమీద కెక్కి:

పూషా:

మనిషికి లా ఆఫ్ మదర్ కంట్రీ!
జీవితానికి ఆర్ట్ అండ్ పొయిట్రీ!
అక్కర్లేదు అన్ నెసిసరి!
యూనివర్స్ కింక పెడాంట్రీ
అక్కరల్లేదు అన్ నెసిసరి!

[ఇతి భరతవాక్యం]

# సూయజ్ రాజకీయాలు

## శ్రీ పి. శ్రీరాములు

"ఆధునిక యుద్ధతంత్రంలో హైడ్రోజన్ బాంబుకు ఏర్పడిన అతి ప్రధానస్థానం దృష్ట్యా సూయజ్ కాలువ ప్రాంతంనుంచి మన సేనలు వైదొలగక తప్పదు. అణ్వస్త్ర ప్రయోగంతో జరిగే యుద్ధధాటికి సూయజ్‌లోని మన రక్షణాశ్రయాలు తాళలేక వాటి దౌర్బల్యం బయటపడిపోకముందే మనం ఆ కాలువప్రాంతంనుంచి ఖాళీచేసి తీరాలి," అని సరిగా ఇవే మాటలు గాకపోయినప్పటికీ, ఈ అర్థంవచ్చే ధోరణిలో బ్రిటిష్ ప్రధాని చర్చిల్ మొన్న జులై రెండోవారంలో కన్సర్వేటివ్ పక్ష సభ్యుల సమావేశంలో ప్రకటించేసరికి ప్రపంచమంతా ఆశ్చర్యపడ్డది. భారత స్వాతంత్ర్యసమస్యపై వెనుక చర్చ జరిగినప్పుడు, "బ్రిటిష్ సామ్రాజ్యానికి అంత్యక్రియలు జరపడానికి నేను చక్రవర్తికి ప్రధానమంత్రిని కాలేదు" అని నిర్మొహమాటంగా అన్న విన్‌స్టన్ చర్చిలేనా సూయజ్ విషయంలో ఈ మాటలు చెబుతున్నదనిపించింది. నిన్న మొన్నటివరకూ అమిత మొండిపట్టుదలతో వ్యవహరిస్తూ వచ్చిన బ్రిటిష్‌ప్రభుత్వధోరణిలో ఇంత ప్రధానమైన మార్పు ఇంత ఆకస్మికంగా రావడానికి కారణమేమిటనే ప్రశ్న రావడం సహజం. వాస్తవంగా ఆధునిక రక్షణ తంత్రాంగంలో హైడ్రోజన్ బాంబువల్ల ఏర్పడిన అతి ప్రధానమైన పరిణామమే ఈ మార్పుకు కారణమా? కేవలం హైడ్రోజన్ బాంబే ఈ పరివర్తనానికి కారణమైతే, సూయజ్ ప్రాంతంనుంచి ఖాళీచేసే బ్రిటిష్ సేనలను సైప్రస్ దీవికో, లేక మాల్టాకో, లేక ఏ మలయాకో మార్చి అక్కడ తమ రక్షణ బలాలను అభివృద్ధిచేసుకోదలచడంలో ఉద్దేశమేమిటి? అంతవరకు ఎందుకు? తరచూ పేచీలకు దిగుతున్న స్పెయిన్‌తో జిబ్రాల్టర్ దుర్గం విషయమై బ్రిటన్ తక్షణమే రాజీ చేసుకోకూడదా? హైడ్రోజన్ బాంబు హఠాత్తుగా ఆకాశంనుంచి ఊడిపడ్డది కాదు. అమెరికా దీన్ని నిర్మించీ, పరీక్షార్థం మొదటి బాంబును ప్రయోగించీ ఇంచుమించు రెండు సంవత్సరాలు కావస్తున్నది. తాను నిర్మించిన హైడ్రోజన్ బాంబును రష్యా పేల్చికూడా సంవత్సరం పూర్తి అయింది. అందుచేత హైడ్రోజన్ బాంబు విధ్వంసక శక్తి, అణ్వస్త్ర ప్రయోగంవల్ల ప్రపంచానికి సంభవించే ఘోర విపత్తూ బ్రిటిష్‌ప్రధాని చర్చిల్‌కు ఈనాడు కొత్తగా తెలిసినవి కావు. కేవలం ఈ బాంబు ఫలితంగానే సూయజ్ నుంచి తప్పుకుంటున్నామని బ్రిటిష్ ప్రధాని అంటే, దానికి ఏ పాటి విలువ ఇవ్వవచ్చో ఊహించవచ్చు. ఈ కాలువ ప్రాంతంలో వున్న 80 వేలమంది సైనికులను ఖాళీ చేసి, దాదాపు 40 లేక 50 కోట్ల పౌనులు ఖరీదుచేసే అత్యుత్తమ రక్షణసామగ్రిని బ్రిటన్ నిన్న మొన్నటివరకు శత్రుత్వంతో వ్యవహరించిన ఈజిప్టుకు ధారాదత్తం చేస్తున్నదంటే ఇతర కారణాలు—బలీయమైన ఇతర కారణాలే—వుండి తీరాలి. వివిధప్రపంచ సమస్యలమీదా, కమ్యూనిస్టు రాజ్యాలచుట్టూ ప్రపంచపరివ్యాప్తంగా నిర్మించదలచిన రక్షణవలయ పరంపరల సమస్యలమీద అమెరికాలో ప్రెసిడెంట్ ఐసెన్‌హోవర్‌తో తానూ, తన విదేశాంగ మంత్రి ఆంథోనీ ఈడెన్ కలసి అంతరంగిక సంప్రతింపులు జరిపి స్వదేశానికి తిరిగివచ్చిన రెండు వారాలలోపలే బ్రిటిష్‌ప్రధాని చర్చిల్ సూయజ్ సమస్యపై ఈ ప్రధాన నిర్ణయాన్ని ప్రకటించడం గమనార్హమైన విషయం. చర్చిల్ ఈ ప్రకటనచేసి సరిగా రెండు వారాలైనా తిరగకముందే సూయజ్ సమస్యపై బ్రిటన్ ఈజిప్టుల మధ్య ఒప్పందం కుదిరింది.

జెనీవాలో ఇండోచైనాసమస్యపై తొమ్మిది రాజ్యాలమధ్య ఒడంబడిక కుదిరిన వారంరోజులకే, మధ్య ప్రాచ్యాన్ని దీర్ఘవ్యాధిమాదిరిగా పట్టి పీడిస్తూ విపరీతమైన అశాంతికి కారణభూతమైన సూయజ్ సమస్యపై బ్రిటన్ ఈజిప్టులు ఒక ఒప్పందానికి రావడం నిజంగా హర్షించదగిన విషయమే. "సమితి ప్రణాళికక్రింద ఉభయ ప్రభుత్వాలు తాము నిర్వర్తించవలసిన బాధ్యతలనుగుర్తించి, పరస్పర సహృదయతతో, గాఢ స్నేహభావంతో ఉభయులమధ్యా వున్న సంబంధాలకు నూతన ప్రాతిపదికను ఏర్పాటు చేసుకోడానికి సూయజ్ సమస్యపై బ్రిటన్ ఈజిప్టులు ఈ ఒప్పందం

కుదుర్చుకుంటున్నవి," అని ఈజిప్టు రాజధాని కైరో నుంచి తమ సమాలోచనలు జయప్రదంగా సమాప్తమైన తర్వాత ఉభయ ప్రభుత్వాలు చేసిన సంయుక్త ప్రకటన స్పష్టీకరించింది.

ఒడంబడిక షరతుల సారాంశం ఈ విధంగా వున్నది:

(1) సంతకాలు జరిగిన 20 నెలలలోగా నిర్ణీత కార్యక్రమం ప్రకారం సూయజ్ ప్రాంతంనుంచి బ్రిటిష్ సేనను పూర్తిగా ఖాళీ చేయాలి (2) సేనను, సామగ్రిని ఖాళీ చేయడంలో కావలసిన సౌకర్యాలను ఈజిప్టు కలిగించాలి (3) ఏ ఇతర రాజ్యమైనా ఈజిప్టుమీదగాని, ఈ ఒప్పందంమీద సంతకాలు జరిగేనాటికి (1954, జులై, 27) పరస్పర రక్షణ ఒడంబడికలు చేసుకొనివున్న అరబ్ రాజ్యసమితిలోని రాజ్యంమీదగాని, టర్కీమీదగాని దండయాత్రకు దిగినట్లయితే, సూయజ్ రక్షణ స్థావరాలను తిరిగి యుద్ధసన్నద్ధం చేయడానికీ, వాటిని క్రమపద్ధతిలో నిర్వహించడానికీ బ్రిటన్‌కు ఈజిప్టు సకల సౌకర్యాలూ కలిగించాలి. ఇందుకోసం బ్రిటన్‌కు విధిగా కావలసిన రేవుస్థానాలను ఉపయోగించుకునే అధికారం ఈజిప్టు ఇవ్వాలి. (4) పైన ఉదహరించిన ఏ రాజ్యానికైనా యుద్ధప్రమాదం సంభవించినప్పుడు బ్రిటన్, ఈజిప్టులు కర్తవ్య నిర్ణయానికి అవశ్యం సమావేశమై సంప్రతించుకోవాలి. (5) సూయజ్ కాలువ ఈజిప్టులో ఒక అంతర్భాగమనీ ఆర్థిక, వ్యాపార, యుద్ధావసరాలదృష్ట్యా ఇది అంతర్జాతీయప్రాధాన్యంగల నౌకాయానమార్గమనీ ఒప్పందం పరిగణిస్తున్నది. నౌకాయాన హక్కుల విషయంలో 1888 —నాటి నియమ నిబంధనలను ఉభయ ప్రభుత్వాలు భంగపరచకూడదు. (6) బ్రిటిష్ సేనలు ఖాళీ చేయడంతో సూయిజ్‌ను, అక్కడి యంత్రసామగ్రిని రక్షించే బాధ్యత ఈజిప్టుదే అయివుంటుంది. (7) సూయజ్ యంత్రసామగ్రి విషయంలో శ్రద్ధ వహించడానికీ, వాటిని ఎప్పటికప్పుడు తీరుగా వుంచడానికీ బ్రిటిష్ వ్యాపారసంస్థలతో గాని, ఈజిప్షన్ వ్యాపారసంస్థలతో గాని బ్రిటన్ కాంట్రాక్టులు వ్రాసుకుంటుంది. ఈ సంస్థలు బ్రిటిష్, ఈజిప్షన్ సాంకేతిక నిపుణులను కొంతమందిని నియమించుకోవచ్చు. (8) సంతకాలు జరిగిన తేదీ నుంచి ఈ ఒప్పందం ఏడేళ్లపాటు అమలులో వుంటుంది. ఈ ఏడేళ్ళ గడువు పూర్తి అయిన తర్వాత ఏ ఏర్పాటు చేసుకోవాలనే విషయంపై బ్రిటన్, ఈజిప్టు ప్రభుత్వాలు రెండూ ఈ ఒప్పందం ఆఖరు సంవత్సరంలో (1960 జులై మొదలు 1961 జులై లోపుగా) సంప్రతింపులు జరిపి ఒక నిర్ణయానికి వస్తవి.

ఇవి ఒడంబడికలోని అతిప్రధానమైన షరతులు. వీటి అంతర్యాన్ని జాగ్రతగా గమనిస్తే, ఏ అవాంతరం ఏర్పడినా తన సైనికబలంతో, ఆయుధబలంతో బ్రిటన్ మధ్యప్రాచ్యంలో—అంటే సూయజ్ ప్రాంతంలో—తిరిగి ప్రత్యక్షమయే ప్రమాదం వున్నదని బోధపడుతుంది పరస్పర రక్షణ ఒడంబడికలు చేసుకొనివున్న అరబ్ రాజ్యాలలో ఏ ఒకదానికైనాగాని, టర్కీకిగాని యుద్ధప్రమాదం ఏర్పడితే బ్రిటిష్ సేనలు సూయజ్ ప్రాంతానికి వచ్చి దూకుతవన్నమాట. ఈ షరతులో టర్కీనికూడా చేర్చడం ముఖ్యంగా గమనించవలసిన విషయం. టర్కీ ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థలో భాగస్వామిగా చేరిన రాజ్యమనే విషయాన్ని మరచిపోకూడదు. మొదట టర్కీతోపాటు పర్షియానుకూడా బ్రిటన్ చేర్చి ఈజిప్టుకు ప్రతిపాదనలను అందజేసింది టర్కీ, పర్షియాలను చేర్చడానికి వీల్లేదని పట్టుపట్టిన ఈజిప్టు చివరకు టర్కీ పేరు చేర్చడానికి ఎందువల్లనో సమ్మతించింది. పర్షియా పేరు తొలగించడానికి బ్రిటన్ ఒప్పుకున్నది. కైరో సమాలోచనలలో ప్రారంభదశలో ఏర్పడిన ప్రతిష్టంభన చివరకు ఈవిధంగా పరిష్కారమైందిగాని, అరబ్ రాజ్యాలతోపాటు టర్కీని కూడా ఒప్పందంలో ఇరికించడానికి సమ్మతించడం ద్వారా ఈజిప్టు పొరపాటే చేసిందని భావించవలసి వస్తున్నది టర్కీకి పాకిస్తాన్‌కు మధ్య ఇటీవలే కుదిరిన రక్షణఒడంబడిక దృష్ట్యా చూస్తే ఈజిప్ట్ ఏవిధంగా బ్రిటన్ పన్నిన వలలో పడిపోయిందీ స్పష్టపడుతుంది. ప్రత్యక్షంగా గాకపోయినప్పటికీ, పరోక్షంగానైనా ఈజిప్టు టర్కీ పాకిస్తాన్‌ల రక్షణ ఒప్పందంలో చేరినదవుతున్నది. అందుచేతనే, సూయజ్ సమస్యపై బ్రిటన్ ఈజిప్టులు చేసుకున్న ఒప్పందంపట్ల కొన్ని అరబ్ రాజ్యాల ప్రజలు తమ తీవ్ర అసంతృప్తిని వ్యక్తపరచడం జరిగింది.

ఒప్పందం జరిగిన మరుసటిరోజే ఈజిప్టు ప్రధాని నజీర్ "దీనితో బ్రిటన్—ఈజిప్టు సంబంధాలలో నవశకం ప్రారంభం కాబోతున్నది," అన్నాడు. "అచిరకాలంలోనే ఈజిప్టులో బ్రిటిష్ ఆక్రమణఅధ్యాయం సమాప్తమవుతుంది. గత వంద సంవత్సరాల చరిత్రలో ప్రప్రథమంగా

ఈజిప్టు భూభాగంలో ఒక్క విదేశీసైనికుడు కూడా వుండడు. బ్రిటన్‌తో చేసుకున్న ఈ ఒప్పందం ఫలితంగా ఈజిప్టు జాతీయాశయాలలో అత్యధికభాగం ఈడేరబోతున్నవి," అని కూడా చెప్పుకున్నాడు.

గత ఏడు దశాబ్దాలుగా బ్రిటిష్ సామ్రాజ్యాధిపత్యంపై అనేక ఘట్టాలలో తీవ్ర ప్రతిఘటనోద్యమం సాగిస్తూ వచ్చిన ప్రజలు ఇప్పుడు కుదిరిన ఒప్పందానికి సం స్తున్నారంటే అందులో విడ్డూరమేమీ లేదు. ఈజిప్టు ప్రజల స్వాతంత్ర్యకాంక్షకు, జాతీయాభిమానానికి ఈ సంతోషం ఒక నిదర్శనం మాత్రమే. బ్రిటిష్ సేనలు తమ భూభాగాన్ని ఖాళీచేసిపోవడమే ఈజిప్టుకు కావలసింది. ఉత్తరోత్తరా ఏ అవాంతరాలు ఏర్పడినప్పటికీ, ప్రస్తుతానికి, 80 వేలమంది బ్రిటిష్ సైనికులు ఖాళీచేసిపోతారు. ఈజిప్టు ప్రజలు అదే తమ నెత్తిన పాలుపోసినట్లనుకుంటున్నారు.

బ్రిటిష్ సేనలు తమ దేశంనుంచి బేషరతుగా, నిర్నిబంధంగా వెళ్ళిపోవాలని నిన్న మొన్నటివరకూ వాదిస్తూ వచ్చిన ఈజిప్టు నాయకులు చివరకు కొన్ని షరతులతో కూడిన ఈఒడంబడికకు ఒప్పుకున్నారు.

బ్రిటిష్ సామ్రాజ్య వ్యాపారనిర్వహణంలో గత 80 ఏళ్లనుంచీ అతిప్రధానమైన రహదారిగా, జీవనాళికగా ఉపయోగపడుతున్న సూయజ్ కాలువ 19 వ శతాబ్ది మధ్యభాగంలో ఈజిప్టులో ఫ్రెంచి ప్రతినిధిగా పనిచేసిన ఫర్డినాండ్ డ లెస్సెప్ అనే మహనీయుని కృషి ఫలితంగా నిర్మాణమైంది. 1869 ప్రాంతంలో టర్కీ, ఫ్రాన్సులవద్ద ప్రత్యేక అనుమతి పొంది, కొంత ధనాన్ని సేకరించి దానితో కాలువ త్రవ్వించడానికి ఇతడు ఉపక్రమించాడు. అప్పట్లో ఈజిప్టు టర్కీకి సామంతరాజ్యంగా వుండేది కాబట్టి ఫర్డినాండ్‌కు టర్కీ అనుమతి అవసరమైంది. కాలువ త్రవ్వకం పని పదేళ్లలో పూర్తి అయింది. ఎర్రసముద్రపు నీరు, మధ్యధరాసముద్రజలాలలో సంగమమైంది. 1869 నవంబరు 16 న—అంటే దాదాపు 85 సంవత్సరాల క్రితం—సూయజ్ కాలువను పోర్టు సయ్యాద్‌లో ప్రారంభోత్సవం జరిగింది. అప్పటి ఫ్రెంచిరాణి నౌక ఈ ప్రారంభోత్సవంలో ముందుదారి తీసింది; దాని వెనుకే ఇంకా ఇరవై ఓడలు నడిచినవి. ఫర్డినాండ్ తన సంకల్పసాధనలో ఈ విధంగా కృతకృత్యుడైనాడు. నేటికీ ఇతడి శిలావిగ్రహం పోర్టు సయ్యాద్‌లో వున్నది.

సూయజ్ కాలువ పొడుగు 100 మైళ్లు. మరొక ప్రధానమైన పెనామా కాలువ మాదిరిగా సూయజ్ వంకరటింకరగావుండదంటారు. మొదట త్రవ్వినప్పుడు సూయజ్ కాలువ లోతు 26 అడుగులు, కాలువఅడుగు భాగంలో పడక వెడల్పు 72 అడుగులుమాత్రమే వుండేది తర్వాత, తర్వాత దానిలోతు, వెడల్పు బాగా ఎక్కువచేశారు. ఇప్పుడు లోతు 42 అడుగులు, అడుగు భాగాన వెడల్పు 200 అడుగులు వున్నది. కాలువ పైభాగం వెడల్పు 400 లేక 500 అడుగులు వుంటుంది. కాలువవెడల్పు అంత ఎక్కువ గాకపోవటంచేత, ప్రయాణం చేసేటప్పుడు ఓడలు ఢీకొని ప్రమాదాలు జరగకుండా కాలువలో అక్కడక్కడ రైలుస్టేషన్లలోమాదిరి సిగ్నల్సులాంటి వాటిని కూడా ఏర్పాటుచేశారు

ఈ కాలువ వ్యవహారాలన్నిటినీ మొదట ఒక జాయింట్ స్టాక్ కంపెనీ నడుపుతుండేది. నౌకావ్యాపారంచేసే అన్ని దేశాలకూ వాటాలు వుండాలనే ఉద్దేశంతో సత్కార్య జిజ్ఞాస గలిగిన ఫర్డినాండ్ ఈ కంపెనీని స్థాపించాడు. తనకు కేటాయించిన వాటాలను ఫ్రెంచిప్రభుత్వం కొన్నది; ఒక్కొక్క వాటా 500 ఫ్రాంకులచొప్పున ఈజిప్టు పాషా మొత్తం 2 లక్షల వాటాలు కొన్నాడు. సూయజ్ కాలువలో ప్రయాణంచేసే ఓడలలో ఆ రోజులలోనే అత్యధికసంఖ్య బ్రిటిష్‌వారిది. ఐనప్పటికీ బ్రిటన్ ఆనాడు ఆ కంపెనీలో ఒక్క వాటాను కూడా కొన్న పాపానపోలేదు. కంపెనీ డైరెక్టర్లలో అత్యధికసంఖ్య ఫ్రెంచివారిది. క్రమక్రమంగా బ్రిటిష్‌వారికి కూడా కంపెనీలో వాటాలు సంపాదించాలనే ఆదుర్దా బయలుదేరింది. ఇక్కడ కొద్దిగానైనా ఈజిప్టుచరిత్ర తెలిస్తేనేగాని, దానిమీద బ్రిటన్‌కు ఆదిలో ఏవిధంగా ఆధిపత్యం ఏర్పడిందీ బోధపడదు. 16 వ శతాబ్దంనుంచీ ఈజిప్ట్ చాలా కాలంపాటు ఆటోమన్ సామ్రాజ్య భాగంగా టర్కీకి చెందివుండేది. 19 వ శతాబ్దారంభంలో మహమ్మదలీ అనే ఒక టర్కిష్ పాషా 'ఖడీవ్' అనే హోదాతో ఈజిప్టులో "స్వతంత్రం"గా వ్యవహరించడం ప్రారంభించాడు. 'ఖడీవ్' అంటే అరబిక్ భాషలో వైస్రాయి అని అర్థం. ఐతే ఈ ఖడీవ్ హోదా మహమ్మదాలీ కుటుంబానికి వంశపారంపర్యంగా రావడం మొదలుపెట్టింది.

1875 ప్రాంతాన ఈజిప్టును పాలిస్తున్న ఇస్మాయిల్ పాషా అనే అతడు దుర్వ్యయం కార

ణంగా అప్పులపాలై ఋణబాధా నివారణకు మార్గాంతరాలు ఆలోచించడం ప్రారంభించాడు. సూయజ్ కంపెనీలో తనకున్న వాటాలను అమ్మివేసి ఋణవిముక్తి పొందడం మంచిదనే ఉద్దేశాన్ని ఇతరుల ద్వారా కలిగించి, బ్రిటన్‌లో అప్పుడు పరిపాలన చేస్తున్న బెంజమిన్ డిస్రేలీ ప్రభుత్వం ఆ వాటాలన్నిటినీ కొనివేసింది. అంతటితో కంపెనీ మొత్తం వాటాలలో సగభాగం బ్రిటన్‌కు సంక్రమించినవి. తర్వాత ఏడాదికి—1876 లో—ఇంకా ఋణబాధలోనే వున్న-ఆ ఇస్మాయిల్ పాషాను ప్రలోభపరిచి బ్రిటన్ ఫ్రాన్సులు ఈజిప్టు పరిపాలననే తమ హస్తగతం చేసుకున్నవి. అధికారం హస్తగతమైన వెంటనే ఇస్మాయిల్‌ను గద్దెదింపి అతని కుమారుణ్ణి పాషాగా చేశారు.

తర్వాత 1882 లో కల్నల్ అరబీ అనే అతడి నాయకత్వాన జరిగిన తీవ్రమైన తిరుగుబాటు ఫలితంగా ఫ్రెంచి ఆధిపత్యం చిరగడైపోయినా, ఈజిప్టుపైనా, సూయజ్ కాలవపైనా బ్రిటిష్ ఆధిపత్యం మాత్రం స్థిరపడిపోయింది. తమ వ్యవహారాలలో బ్రిటన్ ప్రమేయం ఎక్కువైనకొద్దీ ఈజిప్టు ప్రజల అసంతృప్తి కూడా ఆనాటి కానాడు తీవ్రతరమైంది.

సూయజ్ కాలువపై బ్రిటన్ హక్కులు వదలుకోవాలని ఈజిప్టు నాయకులు బ్రిటిష్ కార్మికపక్ష ప్రధాని రామ్సే మక్డొనాల్డ్‌ను కోరితే, ఆయన "సూయజ్ విషయంలో ఏ విధమైన శషభిషలకూ అవకాశం లేదు. ఆ కాలువ బ్రిటిష్‌వారికి ముముఖ్యం. దానిపై యథేచ్ఛాధికారాన్ని కలిగి వుండడమే బ్రిటిష్‌వారి ప్రధానాశయం," అని విదిలించి కొట్టాడట. బ్రిటిష్ ప్రభుత్వం నిన్నమొన్నటి వరకు ఇదే పాట పాడుతూవచ్చింది.

1914 లో ప్రథమ ప్రపంచయుద్ధం ప్రారంభం కాగానే, బ్రిటిష్ ప్రభుత్వం ఈజిప్టును తన అధీనంలోవున్న "రక్షిత రాజ్యంగా" ప్రకటించింది యుద్ధం సమాప్తమైన తర్వాత 1922 లో గాని బ్రిటన్ ఈజిప్టు రక్షితరాజ్య ప్రతిపత్తిని రద్దుచేయలేదు. ఆ సంవత్సరంలోనే మొదటి ఫౌద్ ఈజిప్టులో రాజు బిరుదును స్వీకరించాడు. ఈ ఫౌద్ రాజుకుమారుడే రెండుసంవత్సరాల క్రితం రాజ్యపరిత్యాగంచేసి ప్రవాసిగా [illegible]న ఫరూక్ రాజు. ఫరూక్ రాజు 1936 ఏప్రిల్ మొదలు 1952 జులై వరకు రాజ్యంచేశాడు. నిష్కళంక జాతీయవాదిఅనీ, ఉత్తమ దేశభక్తుడనీ నిన్నటిమొన్నటివరకు ప్రఖ్యాతిగాంచిన ముస్తాఫా నహాస్ పాషా ప్రధానమంత్రిగా వుండగా 1936 లో బ్రిటన్ ఈజిప్టులమధ్య 20 ఏళ్ల ఒప్పందం కుదిరింది. ఈజిప్ట్ సర్వసంపూర్ణ స్వతంత్ర ప్రతిపత్తిని బ్రిటన్ అందులో పరిగణించింది. ఒక్క సూయజ్ కాలువ ప్రాంతం తప్ప మిగతా ఈజిప్టు భూభాగమంతటినుంచీ, తన సేనలను ఉపసంహరించడానికి బ్రిటన్ ఒప్పుకున్నది. 1922 లో రక్షిత రాజ్య ప్రతిపత్తి రద్దయినా, తిష్ఠవేసివుండిన బ్రిటిష్ సేనలు దానితో సూయజ్ ప్రాంతంలో మాత్రమే కేంద్రీకృతం కావడం జరిగింది సూయజ్‌లో 10 వేలమంది బ్రిటిష్ సైనికులను, 400 మంది వైమానికులను మాత్రమే బ్రిటన్ వుంచాలనే షరతు కూడా ఒకటి పెట్టుకున్నారు. ఆ సేనలే పెరిగి పెరిగి ఈనాడు 80 వేలయినవి. ఈ ఒడంబడికద్వారా ఈజిప్టు రక్షణ బాధ్యతను స్వీకరించడానికీ, యుద్ధప్రమాదం సంభవిస్తే ఈజిప్టులో ఎక్కడికి బడితే అక్కడికి తన సేనను తరలించడానికీ, అలెగ్జాండ్రియా, పోర్ట్ సయ్యద్ మొదలైన ఈజిప్టు రేవులను నౌకాశ్రయాలుగా ఉపయోగించుకోడానికీ బ్రిటన్‌కు అధికారం లభ్యమైంది. 1936 అంటే యూరప్‌లో నాజీ జర్మనీ, ఫాసిస్టు ఇటలీలు పెద్దపెట్టున రెండవ ప్రపంచయుద్ధానికి సన్నద్ధమవుతున్న రోజులు. పైగా ఈజిప్టుకు సమీపంలో వున్న అబిసీనియాను ఇటలీ కబళించివేసిన రోజులుకూడా. అందుచేత అప్పటి ప్రపంచ పరిస్థితుల దృష్ట్యా బ్రిటన్ ఈజిప్టుల మధ్య 1936 ఒప్పందం అవసరమైంది. ఈ ఒప్పందాన్ని రద్దు చేయడం కోసమే ఈజిప్టు ద్వితీయ మహాసంగ్రామం సమాప్తమైన తర్వాత 1946 నుంచీ బ్రిటన్‌పై హోరాహోరీగా ఉద్యమం సాగిస్తూవచ్చింది. 1946 మధ్యభాగంలో అట్లీ బ్రిటిష్ కార్మికపక్ష ప్రధానిగావున్నప్పుడు, విదేశాంగ మంత్రి శ్రీ॥ శ్రీ॥ ఎర్నెస్ట్ బెవిన్ [నా]యకత్వాన ఒక ప్రముఖ ప్రతినిధివర్గం కైరోకు వచ్చి సూయజ్ సమస్యాపరిష్కారానికి ప్రయత్నం చేసింది. ఒక ఒడంబడిక సైతం వ్రాసుకున్నారు. గాని, ఉభయపక్షాలు తర్వాత తిరస్కరించిన కారణంచేత ఆ ఒప్పందం అమలులోకే రాలేదు. 1947 లో సూయజ్ సమస్యపై భద్రతామండలికి ఈజిప్టు ఫిర్యాదు చేసింది గాని, తగినన్ని రాజ్యాలు ఈజిప్టు తీర్మానాన్ని బలపర్చని కారణంచేత ఆ ప్రయత్నమూ భగ్నమైంది. 1950 నవంబరు 16 న ముస్తాఫా నహాస్‌పాషా నాయకత్వాన ఈజిప్టు ప్రభుత్వం 1936 ఒప్పందాన్ని రద్దు చేసివేసింది. "1936 ఒప్పందం ప్రయోజనం కాల

దోషం పట్టిపోయింది. దీన్ని రద్దుచేయడం వినా నా ప్రభుత్వానికి గత్యంతరం లేకపోతున్నది. బ్రిటన్ ఈజిప్టు భవిష్యత్ సంబంధాలకు నూతన ప్రాతిపదిక ఏర్పడాలి. బ్రిటిష్ సేనలు తక్షణమే సూయజ్ నుంచి తప్పుకోవాలి. ఈజిప్టు రాజరికం క్రింద నైల్ నదీ లోయ ప్రాంతాన్ని (ఈజిప్టు, సూడాన్‌లను) ఏకం చేయాలి. బ్రిటన్ ఈ సూత్రాలను ఆమోదిస్తేనే మధ్య ప్రాచ్యంలో శాంతి సాధ్యపడుతుంది", అని ఫరూక్ రాజుఫర్మానాను ప్రధాని నహాస్‌పాషా ఈజిప్ట్ పార్లమెంటులో చదివేసరికి రాజకీయ ప్రపంచం నివ్వెరపోయింది. 1936 ఒడంబడికను ఏకపక్ష నిర్ణయంగా రద్దుచేసే అధికారం ఈజిప్టుకు లేదనీ, బ్రిటన్ ఈజిప్టు పరస్పర సంప్రదింపులద్వారా మాత్రమే ఆ ఒడంబడికను మార్చడం సాధ్యమనీ బ్రిటిష్ విదేశాంగమంత్రి జవాబు చెప్పాడు. ఈజిప్టునిర్ణయాన్ని బ్రిటన్ నిష్కర్షగా నిరాకరించింది.

ఈ వాద ప్రతివాదముల ఫలితంగా సూయజ్ ప్రాంతంలో మహా సంక్షోభం బయలుదేరింది. బ్రిటిష్‌వారికీ, ఈజిప్షన్లకు మధ్య బాహాట సంఘర్షణలు, రక్తపాతం జరిగినవి. ఉభయపక్షాలా అనేక మంది హతులైనారు. నహాస్‌పాషా ప్రభుత్వం సంక్షోభాన్ని ప్రారంభించి, ప్రజ్వలింపజేసిందేగాని, దాన్ని నిగ్రహించలేకపోయింది. 1952 ప్రారంభంలో నహాస్ ప్రభుత్వం పతనమైంది.

సరిగా రెండు సంవత్సరాల క్రితం (1952 జులై 20 మొదలు 26 వరకు) ఈజిప్టులో జరిగిన అత్యద్భుత సంఘటనలు మరచిపోదామన్నా మరపురానివి. జనరల్ నజీబ్ నాయకత్వాన సైనిక విప్లవం చెలరేగడం, వారంరోజులలో ఫరూక్ రాజు రాజ్యపరిత్యాగంచేసి పారిపోవడం, నహాస్‌పాషా ప్రభృతులను నిర్బంధించడం, సైనికప్రభుత్వం అధికారంలోకి రావడం జరిగింది. ఒక విప్లవసమితి యాజమాన్యాన జనరల్ నజీబ్, కర్నల్ నజీర్‌ల నాయకత్వాన ఇప్పుడు పరిపాలన సాగుతున్నది. విప్లవసమితి ఈజిప్టును పార్లమెంటరీ రిపబ్లిక్‌గా ప్రకటించింది. రాచరికానికి స్వస్తిచెప్పింది. స్వయం నిర్ణయాధికార సూత్రం ప్రకారం సూడాన్ భవిష్యత్తు నిర్ణయం కావడానికి ఈ సైనికపాలకవర్గం సమ్మతించింది. సూడాన్ సమస్యపై కూడా బ్రిటన్‌తో ఒక ఒడంబడికను (1953 ఫిబ్రవరిలో) ఈజిప్టు చేసుకోగలిగింది. ఈ విధంగా 1936 లో బ్రిటన్‌తో జరిగిన ఒప్పందం రద్దయింది; అదే సంవత్సరంలో రాజ్యానికి వచ్చిన ఫరూక్ రాచరికం రద్దయింది; ఆ ఒడంబడికను వ్రాసుకున్న నహాస్ పాషా ఈజిప్టు రాజకీయాలనుంచి అదృశ్యులైనారు.

మధ్యప్రాచ్యానికీ, సమీప ప్రాచ్యానికీ చెందిన అరబ్ రాజ్యాలన్నిటిలోనూ ఈజిప్టు అతి ప్రధానమైన దేశం. జనాభా రెండుకోట్లలోపే అయినప్పటికీ విస్తీర్ణం మాత్రం 3 లక్షల 86 వేల చదరపు మైళ్లు. దేశంలో విశేషభాగం నిర్జన ప్రదేశం. మానవవాస యోగ్యంగాని ఎడారులు. ఎక్కువ జనాభా మొత్తం ఈజిప్టుకు జీవగర్ర అయిన నైల్ నదీ లోయ ప్రాంతంలోనూ, సారవంతమైన డెల్టాలలోనూ కేంద్రీకృతమైవుంటుంది. ప్రజలు వ్యవసాయాది వృత్తులు అవలంబించి జీవించే భూభాగం దేశంలో 14 వేల చదరపుమైళ్ళకు మించివుండదు. మధ్యప్రాచ్య రాజకీయాలలో ఈజిప్టు ఇంత ప్రధానస్థానాన్ని ఆక్రమించడానికి దాని నైసర్గిక పరిస్థితే కారణం.

ఈజిప్టులో ఒకవైపు అభ్యుదయపద్ధతులు, మరొకవైపు ప్రతీప ధోరణులు ప్రస్ఫుటమవుతుంటవి. ఒకవైపు మహదైశ్వర్యంతో తులతూగుతున్నట్లు కనబడితే, మరొకవైపు జనసామాన్యంలో ఘోర దారిద్ర్యదేవత తాండవిస్తుంటుంది. ఒకవైపు ప్రాచ్య విజ్ఞానవీచికలు వెల్లివిరుస్తుంటే, మరొకవైపు పాశ్చాత్య వాసనలు పొడసూపుతుంటవి. ఈవిధంగా ఈజిప్టు ప్రజల జీవితం వ్యత్యస్తాలమయం. ఈజిప్టును ప్రాచ్య, పాశ్చాత్య జీవిత విధానాల సమ్మిశ్రమ దేశమని చెప్పినా చెప్పవచ్చు.

ప్రజల జీవితంలో ద్యోతకమయే వ్యత్యాసాలను సర్దుబాటు చేయడానికి జనరల్ నజీబ్ నాయకత్వాన ఇప్పుడిప్పుడే కృషి ప్రారంభమైంది. తీవ్రధోరణిలో భూసంస్కరణలను ప్రారంభించారు, పేదవారికి భూములు పంచుతున్నారు. సైన్యంలో చిరకాలంగా ఏర్పడివున్న కుళ్లును కడిగి వేస్తున్నారు.

ఈజిప్టు సూడాన్‌లు అచిరకాలంలోనే ఏకం కావడం ఖాయం. ప్రస్తుతం ఈజిప్టు అధ్యక్షుడుగావున్న నజీబ్ కొంతవరకు సూడాన్‌కు చెందినవాడే. ఈజిప్టు, సూడాన్‌లు ఏకమైననాడు, అఖండ ఈజిప్టుకు మధ్యప్రాచ్యంలో ఇప్పటికంటే ఇబ్బడి, ముబ్బడి ప్రాధాన్యం వచ్చితీరుతుంది. మధ్య ప్రాచ్య రాజ్యాలను కూడగట్టుకొనిరావాలంటే, పశ్చిమరాజ్యాలు ముందు ఈజిప్టుతో స్నేహభావాన్ని పెంపొందజేసుకోవాలి. మధ్యప్రాచ్యంలో ఏ రక్షణ వ్యవస్థను ఏర్పాటు చేయదలచినా, ఈజిప్టు

చేరకపోతే ఆ వ్యవస్థ అసలు ఏర్పాటే ఏర్పడదు; అథవా ఏర్పడినా, అది ఆట్టేకాలం నిలవదు.

మధ్యప్రాచ్య రక్షణ వ్యవస్థను స్థాపించడానికి బ్రిటన్ అమెరికాలు ఎంత అభేద్యమైన తంత్రాంగాన్ని పన్నుతున్నవో తెలిసిన సంగతే. ఈజిప్టును బుజ్జగించి, ఆ రక్షణవ్యవస్థలోకి తీసుకురావాలన్నదే బ్రిటన్ అమెరికాల ఎత్తుగడ. అమెరికా పట్టుదలపై బ్రిటన్ ఈజిప్టుతో సూయజ్ సమస్యపై ఒప్పందానికి రావడానికి ఇదే ముఖ్యకారణం. ఇదివరలో మధ్యప్రాచ్యరక్షణవ్యవస్థ ప్రసక్తి వచ్చినప్పుడు, దాన్ని ఖండితంగా మొట్టమొదట నిరాకరించింది ఈజిప్టుప్రభుత్వమే. ప్రజల అభిమానాన్ని చూరగొనని ఏ రక్షణవ్యవస్థలోనూ చేరేదిలేదని ఈజిప్టు ఆనాడు స్పష్టీకరించింది. స్థానిక ప్రజాభిమతంతో నిమిత్తం లేకుండా పశ్చిమ రాజ్యాలు ప్రతిపాదించే రక్షణవ్యవస్థలో చేరడం కొరివితో తల గోక్కోవడం వంటిదే.

సోవియెట్ రష్యాను, దాని విధానాన్ని ఖండిస్తూ ప్రకటన చేయడానికి ఈజిప్టు ఒప్పుకోని కారణంచేత, ఈజిప్టుకు ఆయుధ సామగ్రి సరఫరా చేయడానికి అమెరికా నిరాకరించినట్లు వార్తలు వస్తున్నాయి: దీన్నిబట్టే వారి ఉద్దేశాలను గ్రహించవచ్చు.

ఆశ్యాయాసియాశాంతిసాధనలో భారత దేశం ఎంత ప్రధానపాత్రను నిర్వహిస్తున్నదో, మధ్యప్రాచ్యశాంతిపరిరక్షణలో ఈజిప్టు—సవ్యమైన విధానాన్ని అనుసరిస్తే—అంత ప్రధానమైన పాత్రనూ నిర్వహించవచ్చు.

భారతదేశ అభ్యుదయానికి శాంతి ఎంత అవసరమో, అచిరకాలంలోనే ఏర్పడనున్న ఐక్య ఈజిప్టుకుకూడా శాంతి అంతే అవసరం. అందుచేత కమ్యూనిస్టు, కమ్యూనిస్టేతర రాజ్యాల ప్రచ్ఛన్న యుద్ధంలో భారతదేశం అనుసరిస్తున్న తటస్థవిధానమే ఈజిప్టు భవిష్యత్తుకు కూడా శిరోధార్యం కావాలి సూయజ్ ఒప్పందం జరిగినతర్వాత ప్రధాని కర్నల్ నజీర్ చేస్తున్న ప్రసంగాలు ఈ ధోరణ్నే వ్యక్తీకరిస్తున్నవి ఇది శుభసూచకం.

ఈజిప్టులో ఆంతరంగిక సుస్థిరత్వాన్ని నెలకొల్పాలంటే, ప్రెసిడెంట్ నజీబ్, ప్రధాని నజీర్ లు తమ అభిప్రాయ భేదాలకు, అనైక్యతకు సత్వరమే స్వస్తి చెప్పాలి. ప్రస్తుతం పనిచేస్తున్న సైనిక పరిపాలన స్థానే, ఎన్నికలద్వారా ఏర్పడే క్రమబద్ధమైన ప్రజాప్రభుత్వాన్ని సాధ్యమైనంత త్వరలో స్థాపించా

పెద్దకథ

# ఆరవసంతాలు

శ్రీపంతుల శ్రీరామశాస్త్రి

[గతసంచిక తరువాయి]

## శరత్తు

సరస్వతమ్మా! సరస్వతమ్మా!

ఎవరు, వస్తున్నా, ఎవరు వెంకన్నబాబే? ఎన్నా        మాసేను. రండి.

నిన్ను ఇలా సౌభాగ్యవతిగా మళ్ళీ చూస్తా ననుకోలేదు.

అందుకు అందరితోపాటు మీకూ కోపంవచ్చిం దన్నమాట? రండి లోపలికి.

రాకేం, వస్తానమ్మా, ఇంతసేపాయి మీ యిల్లు వెతుక్కుంటూ వచ్చినవాణ్ణి లోపలికి రాకుండా పోతానా? ఇది మీ యిల్లేకదూ?

అవును బాబూ! అలా కూర్చోండి.

కూర్చుంటాను గాని నాకి రీవిూదకంటె నేల మీదనే బాగుంటుంది.

మట్టినేలను కూర్చుంటారా? ఉండండి, ఈ తివాసీ వేస్తాను. బాబూ, మీరు మునపటిలాగ ఉన్నట్టు లేదు.

'ఎలా ఉంటానమ్మా అరవయ్యే    దాటిన వాణ్ణి. అయినా ఇప్పటికి ఎంతదూరమయినా నడవగలను. ఎంతపనయినా చెయ్యగలను; కాని, మునుపటి ఆ చొరవ ధైర్యం లేవు. అంతే కాదు, కొంచెంసేపు పనిచేసే సరికల్లా అలుపువస్తుంది. మధ్యలో ఆగి ఆగి మళ్ళీ పని చెయ్యవలసి వస్తుంది.

బాబూ, మీది వజ్రశరీరం గనక అరవైఆరేళ్లు దాటినా ఇంకా కూమాత్రం దృఢంగాఉండి నిబ్బరంగా మాట్లాడగలుగుతున్నారు. ఈ కాలపువాళ్లయితేనా? యాభైఏళ్ళకే పూర్తిగా ముసలివాళ్ళయి పోతున్నారు. కుర్రవాళ్లుగా ఉండదలచుకొన్నా, తల పండిపోడమో బట్టతల అయిపోడమో, పళ్ళన్నీ ఊడిపోడమో చత్వారం ప్రాప్తించడమో జరుగుతూంది. మన ఊళ్ళో అంతా బాగున్నారా?

ఏమి బాగు సరస్వతమ్మా! అంతా చెట్టుకొక పిట్ట అయిపోయేరు. ఊళ్ళో అన్నీ పార్టీలు, తగాదాలు, కోర్టు వ్యవహారాలు; నన్నుకూడా ఇరికించాలని చూసేరు. నాకు అసహ్యం అనిపించి బయలుదేరి వచ్చేశాను. అప్పుడే రెండేళ్ళయింది. మీ భావగారు అవధాన్లు బ్రతికిఉన్నంతకాలం ఊరంతా అతనెలా అంటే అలా నడిచేది. ఆ తరవాత తలతల పెత్తనాలు. అయితే ఇప్పుడు ఇది ఒక్క మనఊరికి సంబంధించిన వ్యవహారం కాదు, అన్ని ఊళ్ళూ ఇలాగే ఉన్నాయి. ఏమిటమ్మా?—ఈ రాత్రిప్పుడు నాకోసం ఏమీ ప్రయత్నం చెయ్యకు.

ప్రయత్నానికేముంది బాబూ! ఇందాకా మీరు వచ్చేముందే గడియారం తొమ్మిదిగంటలు కొట్టింది. ఆయన మామూలుగా రోజూ భోంచేసే వేళ ఇదే. ఇవాళంటే ఆయన ఊళ్ళో లేరుగనక, నేనూ పిల్లలూ సాయంకాలంతో భోంచేసి పడుకొన్నాము.

ఇప్పుడు నాకేమీ అక్కర్లేదమ్మా—మంచినీళ్లు తాగి పడుకొంటాను.

అయ్యో నామతి చూడండి; మీకు మంచినీళ్లే ఇవ్వడం మరిచిపోయేను. బాబూ! మీరేం అనుమానించకండి. మీకు నా చేతివంట తినడం అనుమానంగా ఉంటే, వస్తువులన్నీ ఇస్తాను, కాస్త ఉడికించేసుకొని భోంచేసి మరీ పడుకోండి.

అది కాదమ్మా! నాకు నీ చేతివంట తినడానికి అభ్యంతరమేమిటి? నీవంటి మంచి మనసుగల మనుషులు లోకంలో ఎందరుంటారు గనక! నే వనేది ఏమిటంటే, ఇవాళ మధ్యాహ్నం భోజనం కావడమే బాగా ఆలస్యం అయింది. ఇప్పుడేమీ ఆకలిగా లేదు. అందుచేత వద్దన్నాను గాని.

ఎందుచేతనయినా సరే మీ రిప్పుడు భోజనం చెయ్యకుండా పడుకొందికి మాత్రం వీల్లేదు. మిమ్మల్ని చూస్తే ప్రాణం లేచివచ్చినట్టుంది. ఊళ్లో అంతా దొంగతనాలు జరుగుతున్నాయిట. ప్రతి

రోజూ ఉదయం లేచేసరికల్లా ఎవరింట్లోనో ఒక రింట్లో దొంగతనం జరిగిందన్న మాటే. ఆయన, వాళ్లమ్మగారు పోయా రీమధ్యే, కర్మచెయ్యడానికి కాశీవెళ్ళారు. నాకు ఒకటే భయంగా ఉండి ఈ మూడురోజులాయి సరిగా నిద్రలేదు.

దొంగలు! ఎన్ని గుండెలుండాలి. నీకేం భయం లేదమ్మా!

మరి మీరుండగా నాకేం భయం? కాని, ఏదో దేవుడిలాగ మీరు వచ్చేరు, ఆయన మరి నాలుగు రోజుల్లో రావాలి. ఆయన వచ్చేదాకా మీ రిక్కడే ఉండాలి.

నేను ఫలానా చోటికి ఫలానా పనిమీద అని బయలుదేరలేదులే. సరె చూద్దాముగాని, సరస్వతమ్మా నీకెందుకు శ్రమ. నాలుగు వస్తువులూ ఎక్కడు న్నాయో చెప్తే చాలును. అసలిప్పుడు కొస్తమజ్జిగా అన్నంకంటె ఏమీ తినలేను.

అంటే మీకు నా చేతివంట తినడానికి ఇష్టం లేదందురూ?

అదా నామాట కర్థం? నీ యిష్టమే కానీ. నీ పిల్లలంతా నిద్రపోతున్నారు కాబోలు?

అవును బాబూ! ఉదయం చూద్దురుగాని. పెద్దది ఆడపిల్ల, పేరు ఇందిర. తరువాత ఇద్దరూ మగ పిల్లలు వసంతకుమార్, శరత్‌కుమార్ అని. తరవాత మగపిల్లవాడయితే హేమంతకుమార్ అని పేరు పెట్టా లనుకున్నారుకాని, ఆడపిల్ల గనక హేమలత పేరు పెట్టేరు.

బాగుందమ్మా చాలా బాగుంది. వంతులు వేసి నట్టు ఇద్దరు మగపిలలు, ఇద్దరు ఆడపిల్లలు. నీ పిల్లల అందానికీ గుణానికీ చెప్పేదేమిటి? మీ ఆయనకూడా చాలా రూపవంతుడు, గుణవంతుడూ అని విన్నాను. మీ అన్నయ్య చెప్పాడు.

మా అన్నయ్యకి చిన్నప్పటినుండి ఈయన మాటంటే వేదవాక్యం. అయితే మా అన్నయ్యగారి ఊరు వెళ్ళివస్తున్నా రన్నమాట? మా వదినవంట్లో ఎలా ఉంది?

ఇదివరకు ఏడాది కిందటినుండి ఎలాఉందో అలాగే ఉంది. మీ అన్నయ్య చాలా నిస్పృహాగా మాట్లాడేడు. మీ పెద్దమేనల్లుడికి స్కూలు మాష్టరీ ఉద్యోగం అయిందిట మొన్న ఉదయమే ఉద్యోగంలో ప్రవేశించడానికి వెళ్లేడు.

మా కృష్ణు డప్పు ఉద్యోగస్థు డయేడన్న మాట. చూసేవా మా అన్నయ్య ఉత్తరమయినా రాశాడు కాడు.

రాయకేమమ్మా రాశాడు, రేపటికో ఎప్ప టికో అందుతుంది. మీ అన్నయ్యకి ఎలా ఉందంటే తనే ఈ పరీక్షలన్నీ పాసయి ఉద్యోగానికి వెళ్తు న్నట్టుంది.

ఉండదూ మరి, అసలు చిన్నతనంలో ఒక, నాడు సంస్కృతం చదువు అంటే ఇష్టంలేక. ఈయనా మా అన్నయ్యా కలిసి ఇంటినుండి పారి పోయి ఇంగ్లీషు చదువు చదువుకోవా లనుకొన్నారు.

అబ్బో, అయితే యీజులు సామాన్యకు కాదన్నమాట?

అనుకోడంవరకూ అంతే. అయితే తీరా రయి లెక్కే వేళకి మా అన్నయ్యకి ధైర్యం చాలిందికాదు. తను ఉండిపోయేడు. ఈయనమాత్రం తరువాత ఎన్ని ఇబ్బందులు పడినా మరి ఇంటికి తిరిగిరాలేదు చదువు పూర్తయేదాకా!

పట్టుదలగలవాళ్ల సంగతే అంత!

మా అన్నయ్య ఉండిపోడం అయితే ఉండిపో యేడు గాని వాడి మనస్సంతా ఇంగ్లీషు చదువుమీదే ఉండేది. ఇప్పుడు వాడికొడుకింతవాడయేడంటే అదంతా తను చేసిన పనిలాగే ఉంటుంది మా అన్న య్యకు. నామట్టుకు నాకే ఆశ్చర్యంగా ఉంది. నిన్న మొన్నటిదాకా అన్నం సరిగా కలుపుకొని తినడం కూడా చేతనయేదికాదు మా కృష్ణుడికి మా వసంతుడికిలాగే. ఎంతలో ఎంతవాడయిపోయేడు. వాడు చిన్నప్పటినుండి నాతో అంటూ ఉండే వాడు, అత్తయ్యా నాకు పెద్దపెద్ద ఉద్యోగాలకంటె స్కూలు మాష్టరవడమే సరదా అని.

మరేమిటనుకొన్నావమ్మా పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది.

పోనీ మా వదిన బ్రతికివుండగానే కొడుకు ప్రయోజకుడు, ఉద్యోగస్థు డయేడన్నమాట వింది. తాను కిఉండగానే అయిపోయిం దంటే ఆవిడ మనస్సుకి మరి విచారం అన్నది ఉండదు.

పెళ్ళికేముంది? తల్చుకొంటే నెల్లాళ్ళలో అయిపోతుంది. అయినా ఇంట్లోనే సంబంధం ఉంది కదా? ఈ రోజుల్లో మునుపటిలాటి పట్టింపులులేవు పెద్దపెద్దవాళ్ళే ఎదురు మేనరికాలు చేసేస్తున్నారు.

అదా, మా పిల్లను ఇవ్వడం మాటా? నాకూ మా ఆయనకికూడా అభ్యంతరం లేదుగాని, ఇంకా ఏదీ మా పిల్లకి పదహేడు నిండలేదు. వాడూ చిన్న వాడే అనుకో, అయినా, ఉద్యోగస్థుడయేకు, పెళ్లవ గానే సంసారం దిద్దడానికి తగిన పిల్లయితే బాగుం టుంది. వీ టన్నిటి మాటకేమి, మా పిల్ల పుట్టినప్పటి దగ్గరనుండి దాని పెళ్ళి నిశ్చయమయిపోయింది. మా ఆయన చెల్లెలుకొడుకు ఉన్నాడు. పదహారో ఏడు వచ్చిందనుకొంటాను.

బాగుందమ్మా బాగుంది. ఏ సంబంధం అయితేనేం, వాళ్ళు బ్రతికి బాగుండాలి. ఫలానా వాళ్ళ పిల్లలమని పేరు నిలబెట్టాలి.

ఏదీ ఇంకా వీళ్లు పసిపిల్లలు. వీళ్ల పెళ్లిళ్లకేం తొందరొచ్చింది? వాడు మా మేనల్లుడు వెంకటరమణ సెలవులకి వస్తానన్నాడు, రెండుమూడు రోజుల్లో రావాలి. బాబూ, హనుమంతుడిదగ్గర కుప్పిగంతులని మీ గుండగా నేను వంటచెయ్యడమేమిటి? మీ చేత్తో పొయ్యిమీద పెడితే చాలు ఏ వస్తువుని ఎలా ఎంత సేపటిలో ఉడకమంటే అలాగే ఉడుకుతుంది.

పూర్వులిచ్చిన ఆస్థిపాస్తులేవీ దక్కకపోయినా ఇంకా ఆ ఒక్క శక్తిమాత్రం మిగిలిఉంది తల్లీ—దాన్ని నమ్ముకొనే ఇలా పట్నం చేరుకొన్నాను. మునుపటి ఆ బలం, ఎంతమందికయినా సరే ఎంత తక్కువ వ్యవధిలోనయినా ఎలా కావలిస్తే అలా చేస్తానన్న ధైర్యం లేవు. అంతేకాదు, వంట చేసే వాడికి ఏది ముఖ్యంగా కూడదో అది, అనుమానం వస్తుంటుంది. అయినా ఏదో పూర్వపువాసన ఇంకా పోలేదు. మీఆయన వస్తే ఆయన సాయం చాలా కావాలి. ఎవళ్లయినా తగినవాళ్లింట్లో కుదురుకొంటే మన జీవితం వెళ్లిపోతుంది. నాకేమీ డబ్బును గురించి పెద్ద ఆశలేదు—నాకెవళ్లున్నారు గనక? అయితే కాస్త మర్యాదస్థులూ, మంచీచెడ్డా తెలిసినవాళ్ళూ అయితే చాలును. అంచేత మీ ఆయన వచ్చాక...

అలాగే బాబూ, ఎంత కావాలంటే మాత్రం మీలాటివాళ్ల సాయం అందరికీ దొరుకుతుందా? మా ఆడబడుచుగారింట్లో ఈమధ్యని చాలా ఇబ్బంది పడుతున్నారు. ఏ ఒక్క మనిషీ మూణ్ణాళ్లయినా ఉండడంలేదు. వాళ్లిదీ మరేమంత పెద్దసంసారం కాదుగాని, ఆవిడకి చిన్నప్పటినుండీ పనీ పాటా ఒకరి చాటునుండి చెయ్యడమేగాని, స్వయంగా చెయ్యడం అలవాటులేదు. అందుకు తోడు ఎనమండుగురు పిల్లలు – ఆయన ప్లీడరు, పెద్దప్రాక్టీసు–ఎప్పుడూ ఎవరో బంధువులూ స్నేహితులూ ఇంటికి వస్తూనే ఉంటారు.

చాలా బాగుంది తల్లీ—అటువంటి వాళ్లకయితే మనమూ ఉపయోగపడగలము—వారికీ నాబోటివాణ్ణి పోషించడం కష్టంగా ఉండదు.

అదేమిటి బాబూ అలా అంటారు; నిజంగా నేను చెప్తున్నాను; మీలాటి సాయం కావాలంటే మాత్రం దొరుకుతుందా? నామాట ఆయన కాదంటా రని కాదుగాని, ఆడదాన్ని నేనెందుకనాలని ఊరు కొన్నాను. మా ఆయనవస్తే మిమ్మల్ని మరొకచోటికి వెళ్లనివ్వరు. నాకు ఇంటిపనంటే ఏమీ కష్టంలేదను కోండి, అయినా మీలాంటివాళ్ల సాయం ఎలా వస్తుంది చెప్పండి?

సాయంకోసమని నాలాటివాణ్ణి భరించగలరా తల్లీ?

బాబూ! ఆయన వచ్చేక ఎలా బాగుంటుందంటే అలా చేద్దాము—వంటయిపోయింది. మీరు స్నానం చేస్తారుకాబోలు; ఈలోగా నేను వడ్డన ప్రయత్నం చేస్తాను.

నేను వడ్డించుకొని తినలేనటమ్మా, నీకుకూడా ఎందుకు నిద్రపండుగ?

చెప్పానుకాదూ, ఈ మూడురోజులాయి నాకు రాత్రి నిద్ర లేనేలేదని. ఇవాళకూడా నిద్ర పట్టే లాగలేదు. మీరు మీ చిన్నతనపు కబుర్లు చెప్తూ ఉంటే వినాలనుంది.

అలాగేనమ్మా! నా కబుర్లకేమిటె ఎప్పుడూ ఉన్నవే. అయితే మీ ఆయన కేమిటీ ఉద్యోగం అన్నావు?

ఉద్యోగం అని జీతం అదీ కాదు; అచ్చాఫీసు. అందులో పుస్తకాలు, పరీక్షల పేపర్లు అవీ అచ్చువేస్తూఉంటారు. అంతా ఆయనకింద ఒక పది పన్నెండుమంది పనివాళ్లుంటారు. ఇప్పుడొక పుస్తకాల షాపుగూడా పెడతానంటున్నారు. అయితే దానికి నమ్మకస్తుడయిన మనిషి ఎవరయినా దొరకాలంటున్నారు. తానే రెండూ చేసుకోవాలంటే కష్టం, ప్రెస్సు బజార్లో కాకుండా ఒక మూలగా ఉంది.

బాగుందమ్మా చాలా బాగుంది. పదిపన్నెండు మంది పనివాళ్ళున్నారంటే, వాళ్లందరి జీతాలు

పోగా మనకి ఒక వంద ఉంటుందా? నేను పూర్వ కాలంవాణ్ణి, అంచేత నాకీ సంగతులేవీ తెలీవు, ఇలా అడిగేనని ఏమీ అనుకోకు.

అనుకోడాని కేముంది బాబూ? మేము బాగున్నామంటే మీరూ మా అన్నయ్యాలాగ సంతోషించేవాళ్లేకాని, వేరు కాదుకదా! సరిగా నెలకి ఎంత వస్తుందో ఏమిటో నాకు తెలీదుగాని, రెండు మూడు వందలకూడా కొన్నికొన్ని నెల్లో ఉంటుందిట. అయితే తక్కినవాళ్లలాగ పనివాళ్లని హింసించి ఎక్కువ పని చేయించి, తక్కువ జీతాలిచ్చే మాటయితే ఇంకా బాగానే మిగలవచ్చునట. వాళ్ల కడుపుమాడ్చి మనం మిగుల్చుకోడం దేనికంటా రాయన.

ఈ రోజుల్లో అటువంటి ధర్మబుద్ధి ఎవరికుంది తల్లీ! అటువంటివాళ్లకి భగవంతుడు ఆ విధంగానే ఇస్తాడు. నీ మాటలు వింటూంటేనే మరి నేను మీ యిల్లు విడిచిపోలేనేమో అనిపిస్తుంది. అయితే ఏదో నా చేతనయినపని చెయ్యందీ మాత్రం నేనుండలేను నాచేత ఎంతపని చేయించుకొన్నా నాకు పెట్టే తిండికి తగిన ప్రతిఫలం కాదనుకో—

బాబూ! వడ్డన పూర్తయింది. నా ఆలస్యం మరి లేదు.

ఇదుగో వస్తున్నాను—కాస్త బొట్టుందా?

ఆఁ ఇదుగో ఇక్కడ పీటదగ్గర ఉంచేను.

అమ్మాయి, సరస్వతమ్మా!

ఏమిటి బాబూ, ఓహో ఏమిటి తామరపువ్వులు కలవపువ్వులూనూ! ఎక్కడ దొరికే యివన్నీ?

మన చెరువులోనివే నమ్మా; అమ్మాయి ఇందిరకి ఇవంటే ఎంతో ఇష్టం.

నీ కెంత జ్ఞాపకం వెంకన్న బాబూ! అయితే ఇవాళ అల్లుడూ అమ్మాయి వస్తారంటావా?

ఎందుకురారమ్మా! అల్లుడు ఉత్తరం రాశాడు కదూ?

ఉత్తరం రాస్తేమటుకు అతగాడిమాట ఏం నమ్మకం? ఇదివర కెన్నిమార్లయిందికాదు, అనుకొన్న నాటికి రాకపోడం.

ఆఁ ఎందుకు రాకపోతారు? ఏదో అంత అవసరం పడితే తప్ప.

అతగాడికిఉన్న పెద్ద పనేమిటి లెద్దురూ అక్కడయినా తిరగడమే, ఇక్కడయినా తిరగడమే కదూ! తన తమ్ముళ్లు కాలేజీల్లో పెద్దపెద్ద చదువులు చదువుతూఉంటే అతగాడికి సిగ్గులేకపోయింది. చదువు మానేసి కూర్చున్నాడు. వాళ్ళ నాన్నగారు అన్నారు. పోనీ చదవకపోతే మానిపోయేను, మరేదయినా వ్యావృత్తి కల్పించుకో అని. నీకొక్కవలసిన డబ్బిస్తాను, ఏదయినా షాపు పెట్టు అన్నారు. ఊఁహూఁ ఇష్టం లేకపోయింది. ఈయన పోనీ ఏపనీ చెయ్యొద్దు, ఇక్కడ ప్రెస్సుకివచ్చి ఒక గంట కూర్చొని వస్తూపోతూ ఉండమన్నారు. అదీ నచ్చింది కాదు, ఎందుకు నచ్చుతుందీ, డబ్బు తెచ్చే శ్రమలేకుండా ఎంత కావాలంటే అంత ఇచ్చే తల్లిదండ్రులున్నప్పుడు ఎవరికిమాత్రం మంచిబుద్ధు లెలా పుడతాయి?

అదేమిటమ్మా అలా అంటావు? అతని తమ్ముళ్లకి మాత్రం తల్లిదండ్రులు కావలసిన డబ్బియ్యాలేదనా? వాళ్లంతా ఎంతశ్రద్ధగా చదువుకొంటున్నారు గారు.

అవును బాబూ, మన అదృష్టం అనుకోవాలంతే.

ఇంత మాత్రంలో అదృష్టానికీ దురదృష్టానికీ ఏముంది? వాళ్ల న్నగారు రెండుచేతుః ఆర్జిస్తున్నారు.

ఆర్జిస్తేమటుకు ఆరుగురు అన్నదమ్ములు పంచుకోవాలి; ముగ్గురు ఆడపిల్లల పెళ్ళిళ్ళు చెయ్యాలి. ఇంతకీ మగవాడన్నవాడు స్వశక్తిమీద ఆధారపడాలి గాని తల్లిదండ్రు లిచ్చిన ఆస్తిమీద ఆధారపడితే ఏముంది?

ఏం చెప్పమన్నావు తల్లీ—మేము అయిదుగురు అన్నదమ్ములం. చిన్నతనంలో నన్నే మావాళ్లందరిలోకీ తెలివయిన వాడనుకొన్నారు. కాని కొంచెం వయసు వచ్చిన దగ్గరనుండీ నాకు కుస్తీలు సాము గరీడీలు ఇవీ, ఇంటికివస్తే వంట-తిండి ఇవే కావలసినవి. కొసకి, మావాళ్లంతా వేదాల్లో ఇద్దరూ, శాస్త్రాల్లో ఇద్దరూ దిగ్దంతులనుపించుకొన్నారు. నేనూ నా కాలంలో కొంత పేరు సంపాదించకపోలేదు, వాళ్లలాగ వేదంలోనూ శాస్త్రాల్లోనూ కాకపోయినా వంటలోనూ తిండిలోనూ. అయితే నేను చెడ్డానంటే నావల్ల బాధపడే సంసారమునే బాదరబందీ ఏమీ లేదు.

అదే బాబూ నేననేదీని. ఎల్లప్పుడూ ఇలాగే ఉంటుందా? కొసవరకూ తల్లిదండ్రులమీద ఆధార

పడదామంటే సాగుతుందా? అనేమిటో అయినా ఈయనా కూడా అతని ఊసు మరి నాతో చెప్పకు అని ఊరుకుంటారు. ఆడదాన్ని నేనేం చెప్పగలను?

ఏమీ చెప్పనక్కరలేదమ్మా! అతను కుర్రవాడు స్వతహాగా చాలా తెలివయినవాడే. ఎప్పుడో ఒకనాడు తన బాధ్యత తాను గుర్తించకపోడు. అసలే లేదనకుండా మెట్రికులేషను వరకూ చదువుకొన్నాడు కదా తనకి ఎప్పుడో బుద్ధిపుట్టి ఏదయినా మంచిపని చేస్తానంటే తన్ను ఆదుకునేందుకు అవతల తండ్రీ ఇవతల మామగారూ ఉన్నారు. మరి నాకు షాపుకి వేళయింది. బాబు అప్పుడే నేను చెరువునుండి వస్తున్నప్పుడు ప్రెస్సుకి వెళ్తూ కనిపించేడు. అయితే స్టేషనుకి పిల్లల్నిద్దర్నీ పంపిస్తావుకదూ! బజారు వస్తువులేవయినా కావలిస్తే చెప్పు—మధ్యాహ్నం వచ్చినప్పుడు తెస్తాను.

అమ్మా! అమ్మా! సరస్వతమ్మా!!

ఏమిటి వెంకన్నబాబూ అంత గాభరాగా పిలిచేవు.

పిల్లలమార్కులొచ్చాయిటమ్మా. చిన్నబ్బాయి పెద్దబాబు పేరు నిలబెట్టేడు. మళ్ళీ తను స్కూలుకి ఫస్టు వచ్చేడు.

అలాగా వాళ్ళేరీ?

వాళ్ళింకా స్కూల్లో తక్కిన పిల్లల మార్కులూ అవీ చూస్తున్నారు; నన్ను వెళ్ళి నీకు చెప్పమన్నారు.

అమ్మాయేదీ.

అమ్మాయికూడా అక్కడే ఉంది. రెండేళ్ళ క్రితం పెద్దబ్బాయి స్కూలంతటికీ ఫస్టుగా వచ్చేడు. అయితే అప్పుడు అతనికి పోటీయే లేదట. ఇతని తరవాత వాడికి నలభైమార్కులు తక్కువవచ్చేయిట. చిన్నబ్బాయికి అలాకాదు, ఈ క్లాసులోకి వచ్చే వరకు తనమీది వాళ్లు నలుగురు ఉండేవారట. ఈ సంవత్సరం మొదట పెద్దబ్బాయి, తమ్ముడూ నువ్వు స్కూలుకి ఫస్టుగా రాకపోతే నన్ను నలుగురూ నవ్వుతార్రా అన్నాడట! దాంతో మానేవుకదూ, ఎలా చదివేవాడో మనం వద్దంటున్నాను. నలుగురినీ మించేడట. పాపం వాళ్ళు పట్టుదలగానే చదివి ఉండాలి, మూడు, నాలుగు ఎనిమిది పదిమార్కులు తక్కువ వచ్చాయిట. వాళ్లి హెడ్మాస్టరుగారు అబ్బాయిని ఎంత మెచ్చుకొంటున్నారనుకొన్నారు!

అమ్మాయి హేమగురించికూడా మళ్ళీ పెద్దబ్బాయిలాగే ఏ అనుమానమూ లేదట. సరిగా వేళకి బాబుగారు లేకపోయారు.

ఉంటే ఆయన పిల్లలకంటె ఒళ్ళు తెలియకపోదురు.

కాదుటమ్మా! ఇటువంటి ఆనందం అందరికీ రమ్మంటే వస్తుందా? ఏమిటి నీ విచారం, అల్లుడి గురించేనా? చూస్తూఉండు, నేను బ్రతికిఉంటానో లేదో, అప్పుడు నువ్వు అనుకొంటావు ఆనాడు వెంకన్నబాబు అన్నాడని. వాళ్ళన్నదమ్ము లందరిలో మీ అల్లుడే ప్రయోజకుడవుతాడు.

అతనేం పెద్ద ప్రయోజకుడు కానక్కరలేదు, అందరితోపాటు ఒకళ్ళమీద ఆధారపడకుండా తన బ్రతుకు తాను బ్రతకగలిగితే చాలును.

నీ కెందుకింత విచారమో నా కర్థంకాకుండా ఉంది. పిల్లలింక వచ్చేవేళయింది. వాళ్లకి బాబుంటే ఎలాగూ చేసేదే. వెళ్లి బట్టలు కుట్టించుకోమనమ్మా! ఇవాళ మరి నువ్వు వద్దు, నేను మడికట్టుకొంటాను. అబ్బాయిలు తమ ఫస్టుక్లాసుల సంగతి చెప్పుకొంటూ ఉంటే నా ఫస్టుక్లాసు ప్రజ్ఞమాత్రం చూపించకపోతే ఎలాగ? నువ్వేం చెప్పకు. మరి నాకు మళ్ళీ బజారుకి వెళ్ళిరావడానికి వేళలేదు; పనిమినిషిని పంపిస్తాను..

అలాగే కానీబాబూ! వీళ్లిప్పటిలాగే కొసవరకూ చదువుకొంటే అంతే చాలును. బాబూ, ఎప్పటికప్పుడు అనుకోడమేగాని తిరపతి వెళ్లడం కాకుండాఉంది. ఆయన మరేమీ అక్కడ చికాకు లేకుండా ఇంటికి తిరిగివస్తే, పిల్లలకి సెలవులుండగానే ఈ సంవత్సరమే వెళ్ళాలి.

ఔనమ్మా! తప్పకుండా వెళ్ళండి. ఇక్కడ నేనుండగా ఇంటిలో పూచికపుల్ల పోదు.

అదేమిటి వెంకన్నబాబూ! నువ్వు రాకుండా మేము వెళ్తామా? పొరుగువారి ఇద్దరు పిల్లలూ వచ్చేరు. వాళ్లకి జాగా చాలకుండావుంది. వాళ్లకి ఇల్లు అప్పజెప్పి వెళ్తాము. మళ్లీమళ్లీ వెళ్లగలమో లేదో నాలుగు యాత్రలూ చేసుకొని రావాలి.

అలాగే చేద్దామమ్మా! ఇవాళ ఏమవుతుందో నా పరీక్ష! ఫస్టుక్లాసు కాకపోతే మానె పరీక్షయినా పాసవుతుందో లేదా?

నీ వంటకి వంకలు పెట్టేవాళ్లెవరు వెంకన్నబాబూ!

ఏమో నాదంతా పూర్వంకాలపు పద్ధతి— అయినా యథాశక్తి ప్రయత్నించి చూస్తాను—

*   *   *

అమ్మా! సరస్వతమ్మా! మేలుకొనే ఉన్నావా?

వెంకన్నబాబూ! ఇంకా రేపు ఉదయానికి వస్తావనుకొన్నాను.

మొదట నేనూ అలాగే అనుకొన్నానుగాని ఆయింటి పద్ధతి చూసేక మరి ఉండాలనిపించలేదు.

ఏమిటి? మరేమయినా?

ఏమీలేదు, ఇదివరకు మీరంతా అనుకొంటూ ఉంటే నేను నమ్మలేకపోయేవాణ్ణి. ఆ యింటిలో యజమానురాలు ఎవరో నాకు బోధపడలేదు.

ఏం, మా వదినకు వంట్లో బాగాలేదా?

ఆవిడ ఎప్పుడూ అంతేనట. వేళకువచ్చి భోజనంచేసి వెళ్ళిపోడం. గదిలో ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చోడం, పడుకోవడం, ఇంట్లో ఎవరికి ఏది కావలసివచ్చినా అన్నిటికీ రుక్మిణమ్మే. ఆవిడను చూసినవాళ్ళెవళ్లూ వంటమనిషి అనుకోరు.

అసలు ఆవిడ వంటమనిషి కానేకాదు. పిల్లలకి చదువు చెప్పడానికి వచ్చింది. ఆ తరవాత మావదిన అనారోగ్యంలో ఇంటిపనంతా తనే చేసేది.

ఇప్పుడసలు ఆవిడ చేస్తున్న పనేమిటో నా కర్థంకాకుండా ఉంది. అంతా అజమాయిషీయే. వంటకి వేరేమనిషి ఉన్నాడు. ఆవిడమాత్రం ఆయనకు కాఫీ ఫలహారమూ అందిస్తుంది; ఆయనకు సరిపడినన్ని తమలపాకులు సిగరెట్లూ ఉన్నాయో లేవో చూస్తుంది. కారణం ఉన్నా లేకపోయినా పనివాళ్ల మీద కేకలేస్తూ ఉంటుంది. అసలు మన అల్లుడు చెడుదారి పట్టడానికి సగంమట్టుకు ఆమనిషే కారణమని నా నమ్మకం. తెలిసీ తెలియకుండా విచ్చలవిడిగా ఖర్చుపెట్టుకొందికి డబ్బిస్తే ఏమవుతుంది?

డబ్బిస్తేమాత్రం చెడిపోతారా వెంకన్నబాబూ, తక్కినవాళ్లంతా బాగా చదువుకొంటున్నారుకారూ?

అదీ నిజమేలే తల్లీ మగపిల్లలంతా మంచి ముత్యాలలాటివాళ్ళు. కాని, ఆ ఆడపిల్లలకి మాత్రం రోజురోజంతా ముస్తాబు చేసుకొందికే చాలకుండా ఉందంటే నమ్మ; కాక, వాళ్ళనని లాభంలేదు. ఎదురుగా కనుపించే మంచినికంటె చెడ్డనే వేగం నేర్చుకొంటారు. కబుర్లంత చలాకీగా చెప్తారా, ఒక్కరూ ప్రిపోకుండా ఏ కొసూ పాసుకాడం లేదట; అసలువాళ్ళకు చదవడానికి సమయమే ఉన్నట్టులేదు.

సరేబాబూ! ఎవరి అదృష్టానికి వారే కర్తలు. మనమేంచేస్తాం? ఎంతటి మహావృక్షమయినా పురుగు పట్టి దొలిచివేస్తే అంతే, కుల్లదేరిపోతుంది. మాటల్లో పడి అసలుమాట అడగడం మరిచాను. అల్లుడు పంపడం ఆలస్యమయిందని ఏమయినా అన్నాడేమిటి ?

అమ్మ అతనిసంగతి అంతా తెలిసిఉండి నన్నెందుకు అడుగుతావు. నువ్వేమయినా అంటావేమోనని ఊరుకొన్నానుగాని, గట్టిగా రెండు తగలనియ్యాలనిపించింది. అలా అయితేనేగాని మరి దారిలోకి రాడేమో.

ఏమన్నాడేమిటి? నిన్నేమయినా...

నన్నంటే నాకేం విచారంలేదు. బాబుగారికి వంట్లో బాగులేదని తెలిసికూడా మామగారికి తనకి రావడానికి పరువుతక్కువయింది కాబోలు వంట బ్రాహ్మణ్ణిచ్చి పంపించేడు. ఈమారు నేనూ మా నౌఖరువాణ్ణిచ్చి పంపిస్తానన్నాడు.

పోనీ అంతేకదా? అంచేతే నేనన్నాను, అబ్బాయిల్లో ఎవళ్ళనో ఒకళ్లని వెళ్లమని.

ఎలా వెళ్తారమ్మా, వారంరోజుల్లో పరీక్షలు పెట్టుకొని. అసలు మీరూ అమ్మాయీ గాభరా పడ్డారు తప్ప ఇప్పుడెంత తొందర ఏంవొచ్చింది? తీరా అక్కడకు వెళ్లేక ఆవాహనాలేదు విసర్జనా లేదు. అతని సంచారం మామూలుగానే సాగుతోంది. ఇంట్లో అమ్మాయి పనిచేస్తే మెప్పులేదు, చెయ్యక పోతే మాత్రం తప్పు. ఇక అతగాడికి ఎప్పుడు వస్తుందో ఆగ్రహం, ఒళ్లూపయినా తెలియదు. అందులో మునపటిలాగ కాదుకదా చంటిపిల్లతల్లి.

ఏంచేస్తాం వెంకన్నబాబూ! అన్నిటికీ ఆ వెంకటేశ్వరుడే ఉన్నాడు.

అదుగో అదే నాకు నచ్చదు. నువ్వొచ్చి గీపెట్టినా అమ్మాయిని పంపించం, కావాలంటే వచ్చి ఇక్కడ ఉండు. లేదా, ఎక్కడో ఉద్యోగంచేసి, స్వతంత్రంగా బ్రతకడం అంటే ఏమిటో నేర్చుకొంటే పంపిస్తామంటే మూడురోజుల్లో దారికి వస్తాడు.

ఏమిటో బాబూ! తానూ తండ్రిలాగ ఇంట్లోనే ఎవతెనో తెచ్చిపెట్టుకొంటాడని అమ్మాయి భయం. ఇదంతా నా దురదృష్టం—ఎవళ్లననుకొనీ ఏంలాభం?

ఒకవైపు రాచకార్యముల చక్కబెట్టుకొనుచు మరియొకవైపు తన్ను రక్షించుకొనుచు, రహస్యభంగము గాకుండ కార్యమును చక్కగ నడిపించినది ఈ శుచిముఖియే.

ఈమెలోని మరియొక గొప్ప విశిష్టత. ప్రతివారును తన్ను కోరి ప్రతిమాలి తనచే చెప్పించుకొనవలెనేగాని తానై వారి కేవిషయమును చెప్పదు. అబ్బా! యెంతగడుసరి! ఇంద్రునిచే బిలిపించుకొనెను. ప్రద్యుమ్నునిచేకూడ "మీకు కార్యభంగము కానిచో నాకు చెప్పదగినదగుచో చెప్పు"డనియడిగించుకొనెను. ఇట్లే మున్ముందు ప్రభావతిచే సర్వవిధముల ప్రతిమాలించుకొని యామె గుట్టులను తాను ముందు బుచ్చుకొని పిదప తన విషయమును చెప్పుచున్నది. అట్లే వజ్రనాభునిచే సైతము అంతఃపురములోనికి బిలిపించుకొనెను. తన కవసరమయిన సమయములలో గూడ యీమె యింతటిబింకముతో నుండుట మహాశ్చర్యము కదా!

మంత్రి కుండవలసిన లక్షణములన్నియు శుచిముఖికడ కలవు. బృహస్పతియంతటివానికి స్ఫురింపని విజయోపాయము లీమెకు స్ఫురించినవి. ఇంద్రోపేంద్రులు విజయసాధన కుపకరించు మార్గములను మాటచేమాత్రము చెప్పిరి. కాని యవి జరుగు నుపాయములనన్నిటిని మన శుచిముఖి తన మేధావిశేషమున నూహించి కార్యమును నిర్వహించినది.

ఈమెకు గల సమయస్ఫురణకు మితి లేదు. ప్రభావతితో పరిచయము చేసికొను ఘట్టమును చూచినచో నీమె సమయస్ఫూర్తి తెలియగలదు. త్రోవఁబోవు హంసికి తమగుట్టు తెలుపకయే చిత్రఫలకవిషయములను తెలుసుకొనవలయునని ప్రభావతీ రాగవల్లరులు, వారి గుట్టు వారిచేతనే చెప్పించి ప్రతిమాలించుకొని ప్రతివిషయమును చెప్పవలెనని హంసియు. ఒకరిని మించినవారింకొకరు. ఈ ముగ్గురి యుక్తిప్రయుక్తులు చదివి యానందింపవలసినదేగాని యిట్టివని చెప్ప నలవి గాదు. ఈ వాగ్వాదమున హంసియే జయించినది. చివరకు

"వట్టి మఱుంగుఁ బెట్టి నుడు
వం బనిలేదది యెల్ల భేరి జో
కొట్టుట కాక నిన్నెలువఁ
గూడున నె మాటల.

అని రాగవల్లరి హంసిని ప్రశంసించి జయపత్రము నొసంగి!

..."నీవుగంటి న
న్నట్టి శుభాంగు డీ రమణి
యాసల కాస్పద మివ్వడా తని
న్నట్టిగ నన్వయాది కథ
నంబునఁ దెల్పి యనుగ్రహింపవే"

అని తమ గుట్టును వెల్లడించినది. అప్పుడు శుచిముఖి వచనవక్రత చాలించి వారడిగిన యర్థమెల్ల దెల్పి వారికి నర్మసఖియైనది. ఈమె యెఱుంగని సఖీధర్మంబులు లేవు. అఖిలవిద్యలు దీనికి కరతలామలకములు. దీని యాలాపచాతుర్యంబువలన ప్రభావతీ రాగవల్లరులకు కడము కార్యంబు సాధించిపెట్టగల సమర్థురాలని తోచి ప్రద్యుమ్ను నెట్లయిన వజ్రపురికి తీసుకొనిరమ్మని ప్రార్థించిరి. వీరిట్లు మాట్లాడుకొనునప్పు డెదుట నెట్టున ఉరులలో దగుల్కొని చిలుకయొకటి విడిపించుకొన ప్రయత్నించుచుండెను ప్రభావతి దయతో దానిని విడిపించగా నది తప్పించుకొని పోవునప్పుడొక పత్రిక దాని పక్షములనుండి జారిపడెను. దానింగాంచి ప్రభావతి హంసితో "నీవా చిల్కనుబట్టి తేనోపుదే" యని యడిగెను. అపుడా హంసి "అయ్యది చిక్కవడకెంత దవ్వుపోఁగలదు, కూడ జని పట్టి తెత్తు" నని తమ చెలిమికి తగినట్లు బలికి దానిం బట్టితెచ్చుటకు బోయినది. దీని మనసున కే కార్యము అసాధ్యమని తోచదు. సమర్థులగువారి కసాధ్య కార్యము లుండవు కదా! చిల్కను బట్టుకొన్నది. "ఓసి! ఎచ్చటెచ్చటికి రహస్య వ్యాపారము చేయుచుంటివని" గట్టిగ పట్టి బెదరించినంతనే యాచిలుక తన కథనంతను వినిపించెను. తుదకది తన కథయే యైనది. "పక్షిపేర జాబు వ్రాయువాఁడు భ్రాంతుడు గాక మరేమి? ఆ కథ కేమిగాని నీవా ద్వారక కేల బోయితివని నొక్కి యడిగెను. అబ్బా! యెంత గడుసరి. శుచిముఖి యనునది తానేయని కూడ తెలియరాదు. ఆ చిలుకకు తన విషయమేమియు తెలుపలేదు. దాని పుట్టుపూర్వోత్తరములను తాను తెలిసికొనవలయును. చిల్కకు తాను బాసచేసి దానిచే సునాభతనయలు గద సాంబులపై ననురాగము నందుటను వినెను. విని నంత సరిపోలేదు. ఈ చిలుక చెప్పినది నిజమని యేమి నమ్మకము? చంద్రవతీ గుణవతులకడకు తన తోడనే చిలుకను తీసికొనిపోయి యాథార్థ్యమును నిర్ణయించుకొని మీకు దగిన యుపకృతిని నాచేనైనంత యొనర్తును మీ రహస్యము వెలివోనీనని వారికి నచ్చచెప్పి ప్రభావతికడకు చనెను. ప్రభావతి

యా చిల్క నేమి చేసితివని యడుగకమునుపే "కాంతుడు నీకై లేఖ యనిపెనట గదా! యని తానే మొదట పలుకరించి చిలుకవిషయమును మరపింప జూచెను. కాని ప్రభావతి "చిలుక యేదని యడుగగా "అది యెట్లైన బోనిమ్ము. లేఖ మనకే దొరికినది కదా! యని సంతోషముతో విడిచిపుచ్చితిని." అని సమాధానమిచ్చెను. శుచిముఖి నమ్మినవారిని మోసముజేయదు. ఇట్లు ప్రభావతితో నసత్యము చెప్పినంతమాత్రమున ప్రభావతికి నష్టమేమి? నిజము బల్కిన సునాభతనయల గుట్టు బయటబెట్టి వారికి బాధగలిగించినదే యగును గదా! మీ రహస్యము వెలిపోనీన"ని వారికి మాట యిచ్చినది. ఈ హంసి ఆడినమాట తప్పనిది కాననే వారికిచ్చినమాటను నిలబెట్టుకొన్నది

ఇక వజ్రనాభునితో పరిచయము కావలయును. ప్రభావతి తండ్రికడ ప్రసంగవశమున శుచి

"శుచిముఖి యంద్రు దానిని వ
చోనిపుణత్వమునందు సత్కథా
రచనలయందు నీతి విదు
రత్వమునందు బహుశ్రవావలో
కచణతయందు నెందు సరి
గానము దానికి వేయునేల దా
ని చతురతావిశేషములు
నీవ కనన్వలయు న్మహాత్మకా!"

యని యభివర్ణించినది. వజ్రనాభుఁడు దానిని చూడగోరెను. ప్రభావతి యాతని యనుమతితో శుచిముఖిని యంతఃపురమునకు రప్పించి "నీదు విద్యావిలసనంబు విన్నవించిన నయ్యా వినవలయునని వేడుకపడుచున్నాఁడు. శాస్త్రప్రసంగంబు సేయుము" అని చెప్పినది. అప్పుడు కవి శుచిముఖి ముఖమున తన శాస్త్రపాండిత్యము నిట్లు వెల్లడించెను.

వీనులకు సుధారసముల సోనలు
వర్షించు మృదుల సుస్వరఫణితిం।
దా నిట్టటు గ్రుక్కక పనిలేని
పునః పదములిడక లీలదలిర్పన్॥

కాణాదంబును, గౌతమీయమును, సాం
ఖ్యంబున్ భుజంగాగ్రణీ
వాణీమార్గము జైమినీయ మతమున్
వ్యాసోక్త శాస్త్రంబు వ
క్కాణించెం గడుఁ బూర్వపక్షములు జో
కం బెంచుచు న్పెంచి య
క్షీణ ప్రౌఢిఁ దిరస్కరింపుచుఁ దుదన్
సిద్ధాంతము ల్నిల్పుచున్."

"స్వమతిప్రౌఢి దృఢానుమానముల సం
స్థాపించు నేవేళ నె
ద్ది మతం బప్పుడు దానిదానికి నుపా
ధిగ్రస్తతా వ్యాప్తి భం
గముఖానేక సుదూషణంబులు వెసం
గల్పించుఁ దానన్య శా
స్త్రమతస్థాపన వేళ నవ్విహగి దై
త్యశ్రేష్ఠుఁ డోహోయనన్.

కావ్యనాటకాలంకారగాన మదన
శాస్త్రపరిచయ మహిమంబు జాల పాద
భామినీమణి నెఱపె నుద్దామపటిమ
నాయసురభర్త మెచ్చి పురేయనంగ.

అంత వజ్రనాభుఁడు శుచిముఖిని చూచి "నీవాదిగంతచారిణివి కదా! నీకనిన యద్భుతంబుల చెప్పు" మని యడిగెను. అపు డాహంసాంగన యించుక విచారించుట నభినయించి భద్రదనటుని గూర్చి చెప్పి వజ్రనాభునకు అతనిఁ జూడవలయునను కుతూహలము గల్గించినది. భద్రదనటుని దోడ్కొని వచ్చు పని రాజు శుచిముఖిమీదనే వదలినాఁడు. భద్రదనటుని తీసికొనివచ్చుటకు బోవుచు శుచిముఖి ప్రభావతి నుద్దేశించి "ఇంతయు భవత్ప్రియార్థముసుమీ"యనిచెప్పి చనియెను. లేనిచో ప్రభావతి ఈ హంసి నామాటేమియు జూడక తనదారిని తాను బోయె ననుకొనవచ్చును కదా! శుచిముఖి తన దౌత్యవిషయక రహస్యమును మాత్రము ఎప్పుడును ప్రభావతికి తెల్పినదికాదు.

ఇక్కడకు మన శుచిముఖి పని చాలవరకు పూర్తియైనదనియే చెప్పవచ్చును. ప్రభావతీ ప్రద్యుమ్నులకు బరస్పరానురాగము బుట్టించి వజ్రనాభునకు భద్రనటుని చూడవలెనను కోరికగల్గించెను. ఇచ్చటి విషయము లింద్రోపేంద్రులకు తెలియవలెను. వజ్రనాభవధకు, ప్రభావతిని పెండ్లియాడుటకు ప్రద్యుమ్నుడు తరలిరావలెను. శుచిముఖి ద్వారకకేగి శ్రీకృష్ణునకు సునాభతనయల విషయమునుఁజెప్పి ఇది ప్రకృత కార్యమునకు మరియు లాభదాయకమగుటచే గద సాంబులను ప్రద్యుమ్నునికి సహాయులుగా బంపుమని చెప్పెను. ఇంద్రునకుకూడ నీ విషయ మెఱింగింపనేగుచు దారిలో ప్రద్యుమ్నుని జూచెను. ఆతడు పేదకు పెన్నిధి దొరికినట్లు సంతసించెను. అతఁడామెవలన ప్రియోదంతమును విని "ఎట్లా పురముఁ బ్రవేశింతునా?" యని చింతిలదొడగెను. "ఓ కుమారక! నీకా చింత వలదు. తదుపాయ మెఱిఁగిన నేను వజ్రనాభవధకు నిన్నునుపున ట్లొనర్చితిని. నీ తండ్రి నీ కిప్పుడే వజ్రనాభవధకు మార్గము చెప్పున"ని యాతనిచే ననిపించుకొని ఇంద్రుని కడకేగి వజ్రనాభవధ జరుగబోవుచున్నదని తానొనర్చిన సమస్త కార్యముల విశదీకరించి మరల వజ్రపురమునకు వచ్చి భద్రనటుని బిలచివచ్చితినని చెప్పి వజ్రనాభునిచే మన్ననలఁగాంచి ఎల్లరకు తలలోని నాలుకవలె సంచరించుచుండెను.

వజ్రపురికి గద సాంబులతో ప్రద్యుమ్నుఁడు భద్రనట వేషమున వచ్చి వ్రజనాభునిచే మన్ననలఁగాంచుచు ఒకనాటిరేయి తుమ్మెదరూపమున అంతఃపురమునఁ బ్రవేశించి పెండ్లిపెద్దగా మన శుచిముఖి "అయంముహూర్తః సుముహూర్తోఽస్తు" నిపించగా ప్రభావతీ పాణిగ్రహణ మొనర్చినాఁడు. మరునాడు సునాభతనయలు శుచిముఖినడిగి నిజవల్లభ సమాగమోపాయము తెలిసికొనుటకు ప్రభావతీదర్శన నెపమున వచ్చిరి. వారికి ప్రభావతిని చూడగనే యనుమానము గల్గినది. ప్రభావతికూడ తన గుట్టు వార లెరిగిపోదురేమోయని కంగారుపడినది. చంద్రవతీ గుణవతుల మనసులోని విషయ మాగినదికాదు. "ఎంతయు మేనవింత పస లేర్పడుచున్నవి. రాత్రి యెద్దియో కొంత విశేష మబ్బినది కోమలికి. అయిన నగుగాక. ఈ యంతిపురి నేగతి నీ మహిమ గడించుకొంటివ"ని నర్మభాషణములు ప్రభావతి నుద్దేశించి బల్కిరి. ప్రభావతి వెలవెలబోయెను. ఏమి ప్రత్యుత్తరము చెప్పుటకును వీలులేకపోయెను. శుచిముఖి కన్నియు తెలియునుగదా! సమయము మించుచున్నదని తలంచెను. ప్రభావతి కుత్సాహము గల్గుటయేగాక వీరికి ప్రియులు లభ్యమగుటకును నీ రహస్యము ఇప్పుడు బయల్వెట్టుటయే తగునని చక్కగ నూహించి మర్మములదాక "ఇది యెంత పేర్చెదరు? మీ చదివిన యాకుననె తాను చదివినదీ మా సుదతియు. మొదల ఫలించెన్ తదభీష్టము పెద్ద పిన్నతనముల వరుసన్" అనెను. ఈమాటలతో చంద్రవతీ గుణవతుల మోములు తెల్లబడెను. ప్రభావతి మోము తెలివొందెను. చంద్రవతి గుణవతులు శుచిముఖిని రహస్యము దాచమని కనుసన్నల వారించిరి. ప్రభావతి వారి వృత్తాంతము మొదలంట దెల్పుమని బలవంతపెట్టినది. శుచిముఖి యుచితముగా "మీర లూరకుండెరు. ఈరు దివ్వగ షేను వచ్చుననుట వినరె" యని ప్రభావతికి చంద్రవతీ గుణవతుల యథార్థ వృత్తాంతమును వినిపించి ప్రభావతితో "నీ పతి మాయావి గావున నిన్ను చేరగలిగె, కాని వీరికి ప్రియప్రాప్తి నీ భర్త చేతిలోనున్నది. నీవు సమ్మతించిన నేను నీ భర్తతో చెప్పుదును" అనెను. ముగ్గురు తోడుదొంగలేకదా! ప్రభావతి యేల యంగీకరింపదు? కార్యసానుకూలము జరుగునని యెఱింగియే శుచిముఖి రహస్యమును బయల్వెట్టెను.

పిదప నామె ప్రద్యుమ్న గద సాంబులను గలిసికొని వారిని గూర్చుండబెట్టి యుక్తియుక్తముగ వారిలో వారి గుట్టులను, అప్పటి వారి కర్తవ్యమును విశదీకరించి తన్ను నమ్మిన ముగ్గురు కన్యలకు పతిసాంగత్యము గల్గించినది. ఇక వాసవకార్యము చక్కదిద్దుకొను కార్యము ఈ ప్రద్యుమ్న గద సాంబులపైననే గలదు. ఇక్కడకు శుచిముఖి చరిత్ర సంపూర్ణమయినట్లే.

ప్రభావతీ చంద్రవతీ గుణవతుల పుత్రుల నల్వురను అంతఃపురమున జూచి వజ్రనాభుడు యుద్ధము

నకు వచ్చిన సమయమున నంచ వేగరులచేతనే యా విషయమును ఇంద్రోపేంద్రు లెరింగి ప్రద్యుమ్న గద సాంబులకు తత్తనూజులకు తగిన సాయ మొనర్చిరి.

ఇట్లు ప్రభావతీ ప్రద్యుమ్నమున ప్రథమాశ్వాసములో ప్రవేశించిన హంసి తుదివరకు నుండి కార్యమును జరిపించినది. నాటకమున ప్రత్యంకమున నాయకు డుండునట్లే ఈ శుచిముఖి ప్రతిఘట్టమున వర్తిల్లుచుండెను.

ఈ నిపుణురాలు ఒకవంక రాచకార్యములను మరియొకవంక శృంగారకార్యములను చక్కబెట్టుచు, ఒకరి రహస్య మొకరికి తెలియకుండ ఒకరి పని మరియొకరికి విరోధి కాకుండ సమస్త కార్యములను గడిపినది. సరసత్వమున ప్రౌఢ. "ఎనయగ నెవ్వ రెంత మనసిచ్చి వచింతురు, తాను వారితో పనువడినంతమాత్ర ప్రతిభాషణ మాడు మితభాషి. గంభీర. మాలికలోని సూత్రమువలె నిది కథకంతకు ప్రాధాన్యమును వహించిన పాత్రము.

"నిద్దంపుఁబండు వెన్నెల గాయు చెక్కుల
యొప్పు చూడఁగ నొక్క యుత్సవంబు
మెఱుఁగుఁదీఁగెల బాగు మించు పదాంతహా
టక రేఖలరయ నొండొక ప్రియంబుఁ
గమనీయమగు మహాగమన గాంభీర్యాది
విలసనం బీక్షింప వేఱొయింపు
మాధుర్య ధుర్య కోమలవచనామృతం
బనుభవింపఁగఁ గౌతుకాంతరంబుఁ

గలుగఁజేయుచు నువ్విళ్లు గొలుపు నీదు
సంగతి యొకింత గని యెట్లు జాఱవిడుతు
నింక రాగవల్లరి పేరు నీవు నిజము
ననఁగ నీతో నొనర్తు నెయ్యంపుఁ జెలిమి"

అని ప్రభావతి యన్నట్లు పలు తెలుంగుల హృదయాహ్లాదము గల్గించు నీ శుచిముఖి **నెంత** వర్ణించినను తనివితీరదు.

కథానిక

# * దాపరికం *

శ్రీ కొనకళ్ల వెంకటరత్నం

నారాయణరావు చాలా చికాకుగా ఇంటి కొచ్చాడు.

రాత్రి భోంచేసి సావకాశంగా పక్కగది వరాండామీద వాలుకుర్చీ వేసుకుని తోట ఆవరణ వంక చూస్తో కూచున్నాడు. సుశీల పావంచాలమీద కూచుని పాన్దాను పక్కన పెట్టుకుని తమలపాకుల ఈనెలు తీస్తోంది. మసకవెన్నెట్లో చుట్టూ కదులుతున్న పత్తి, మందార చెట్లనీడలు కొత్తగా వెల్లవేసిన గోడమీద రకరకాల చలనచిత్రాలనూ కల్పిస్తున్నాయి. అంతవరకూ ఆమె ఎవరితో మాట్లాడుతోందో కనుక్కుంటే పాపన్నశాస్త్రిగారి అమ్మాయితోనని చెప్పింది. —

"అంటే పెళ్లిగావాలిసిన పిల్ల ఈమేనా?

"అవునవును"

"సంబంధమేదయినా స్థిరపడినట్టా?

"ఓపట్టాన్ని కుదురుతుందీ? బ్రహ్మసమాజం పుచ్చుకున్న బ్రాహ్మణవరుడు కావాలిట! మంచి హోదాగల ఉద్యోగంలో వుండాలట!!

"బికారి! వీడు నన్ను ఎద్దేవా చెయ్యొచ్చాడు— మళ్లీ కులవివక్షతలు కూడవని గుండెలు గవుక్కొంటో లెక్చర్లిమ్మనమంటే గంటలతరబడి ఇస్తాడు. వుదయం వాడికీ నాకూ పెద్ద ఘర్షణ జరిగిందిలే"

"దేనికి?"

"మన పెళ్లినిగురించి — వీడితోటి వొకటా? వితంతువివాహాలు శాస్త్రీయమైనవి అని నమ్మినా, నేనుమాత్రం కన్యావితంతువు కావాలనీ, భర్తతో కాపరంచేసిన స్త్రీని వివాహం కాననీ ఏరి కోరి ఎతికి నిన్ను పెళ్ళి చేసుకున్నానట. అంచాత నేను నికరమైన బ్రహ్మోని కానట. వీడుమహా......

"సరిపోయింది — దొంగలుపడ్డ ఆరునెలలకి కుక్క మొరిగిందట—ఏనాటి పెళ్లి? మూడేళ్ళ క్రితం జరిగిందానికి ఇప్పుడు తర్జన భర్జన లెందుకూ? అయినా, పాపన్నశాస్త్రికి పనా పాటా? అసలే యతిమత మాయనది. డీ అంటే డీ అంటో కూచుంటాడాయన. మీ శరణాలయ మేమిటో, మీ వ్యవహారాలేమిటో చక్కబెట్టుకోంటో మీ మానాన్ని మీరుండక మాట్లాడితే ఆయనతో మీకెందుకు రగడ చెప్పండి?"

చుట్టూ తిరిగి మళ్ళీ తనమీదకే వచ్చింది—అదీ నిజమే—దుష్టుడికి దూరంగా వుండమన్నారు... సరిపెట్టుకుని చక్కా వూరుకున్నాడు నారాయణరావు.

నారాయణరావు తండ్రి తాతలంతా బ్రహ్మసమాజ మతస్థులు. అంచేత తనూ బ్రహ్మోననే అనిపించుకుంటున్నాడు. కాని అతనిలోవున్న పితృదేవతల రక్తమింకా సంస్కరణోద్దేశాలవంక పూర్తిగా మొగ్గుచూపకండా వొచ్చింది. పాతఅంతా చెత్తకింద కొట్టివెయ్యనూ లేడు. కొత్తఅంటే వ్యామోహం తగ్గించుకోనూ లేడు. పోనీ పాతకొత్తలలో వుండే మంచిని విడమరిచి తన జీవితంలో చక్కా సమన్వయించుకోగల సత్తానూ లేదతనికి. ఆ రెంటికీ జరిగే సంఘర్షణలో ఆ మనిషి నలిగిపోతున్నాడా అనిపిస్తుంది. అంచాత ప్రతిదాంట్లోనూ మధ్యేమార్గమొకటి తొక్కుతో వుంటాడతను.

ఆయనదొక మతం—విడమరచి చూచుకుంటే మనిషికొక్క మతం తేలుతుందేమో—

సుశీల కన్యావితంతువని ఆమె తండ్రి నచ్చజెప్పినమీద నారాయణరావు ఆమెని వివాహం చేసుకోవడం జరిగింది. లేకపోతే ఆమెని చేసుకోకపోయివాడు—దానిమీద సిసలైన బ్రహ్మోలమని చెప్పుకునే కొందరు పెద్ద మనుష్యులకు చాలా ఆగ్రహమొచ్చింది అతనిమీద. అతనుమాత్రం మొగాడికి కానీ ఆడదానికి గానీ రెండో పెళ్ళి అంటే శాస్త్రీయమైన ముద్ర పొందిన వ్యభిచారమని నిర్వచనం చెప్తాడు.

మొదట్లో సుశీల తండ్రి లాహోరులో రామమోహన శరణాలయంలో పనిచేస్తో వుండేవాడు.

అప్పట్లో బ్రహ్మమతప్రచారం తీవ్రంగా సాగించే యువకులలో తెలుగు నాటినించి వచ్చి అక్కడ వుంటున్న ఒక కుర్రవాణ్ణి బుద్ధిమంతుణ్ణి చూచి సుశీల నిచ్చి పెళ్ళిచేశాడు. దరిమిలా ఆయన కాకినాడ బదిలీ కాకపూర్వమే సుశీల భర్త నష్టమైపోయాడు. కాకినాడలో సుశీలని నారాయణరావు కిచ్చి మళ్ళీ వివాహం జరిగించిన అనంతరం ఆయన కాలం చేశాడు. సుశీల తండ్రి పోయిం తరవాత శరణాలయంలో సూపరెండెంటుగిరీ నారాయణరావు చేతి కొచ్చింది.

నారాయణరావుకీ సుశీలకీ పసిపిల్లలంటే మహా ప్రీతి. నారాయణరావు శరణాలయంలో అడుగు పెట్టడం తరవాయి, తేనెతుట్ట చుట్టూ ఈగలు మూగి నట్టు పిల్లలంతా కమ్మేస్తారు. దానితో ఎవ రెవరికి ఏమేమి పంచాలీ అన్న ఆలోచన అతనికి తెమలక పూర్వమే అందరూ వొక్కసారిగా ఎగబడి బిసకొత్తులనీ, చాకలెట్లనీ, పిప్పరమెంట్లనీ, పంట్లాము జేబులో నించి తలా కాసినీ గబగబా లాగేస్తారు.

ఆవాళ సాయంత్రం టేబిలు క్లాత్తు అల్లు కొంటూ చీడీలమీద కూచుంది సుశీల. స్కూలు వొదిలి పెట్టారు గావును—అర్ఫనేజిలోనుంచి పిల్లల కేరింతాలు వినిపిస్తున్నాయి. పక్కని హవేలీ తోటలలో నించి దక్షిణపుగాలి జీడిమామిడి పూతలలో వూపిరి తీసుకుని చంటిపిల్లడిలా చెర్లాడుతోంది. గేటు తెరుచుకుని నీలిగోరింటచెట్ల చాలులోనించి నారాయణ రావు వొస్తూ కనిపించాడు. కూడా అయిదేళ్ల వొక పసి పిల్లణ్ణి నడిపించుకొస్తున్నాడు. సుశీల అల్లిక క్షణమాపి పసివాడివంక పరిక్షగా చూచి ఎవరా అన్నట్టు ప్రశ్నార్థకంగా నారాయణరావువైపు దృష్టి నిలిపింది.

నారాయణరావు మందహాసంలో అపురూప మైన వస్తువుని తీసుకొచ్చిన అహంకారం ప్రతిబింబి స్తోంది. సుశీల పిల్లాడిని దగ్గరికితీసుకొని, తల నిమిరి, విడిపోయిన బొత్తాములు పెట్టి మడతపడిన చొక్కా కాలరు సరిజేస్తూ వింటోంది. నారాయణరావు కథ యావత్తూ చెప్పాడు. నాలుగేళ్ళక్రితంమాట. లాహో రులో కాళీవుత్సవాలలో వొక పేదరాలికి తలి దండ్రులనుంచి తప్పిపోయి దొరికాడీ పిల్లవాడు. బిడ్డలమీద మమకారంచేత ఈ కుర్రవాణ్ణి ఇన్నాళ్లూ పెంచుకొచ్చి, ఖాయలాపడి ప్రయాగలో మూంజీ వారి సత్రంలో నిరాధారంగా చచ్చిపోతూ పసి వాడిని ఒక పండాకి అప్పగించింది, ఆ అభాగిని. ఆ బ్రాహ్మడు పసికందుని అక్కడ అనాథశరణా లయంలోజేర్చి చక్కాపోయాడు. ఈమధ్య పాపన్న శాస్త్రుల్లు కొమార్తెకి సంబంధాలు వెతుక్కొంటూ ఆ ప్రాంతంలోకి వెళ్ళినప్పుడు శరణాలయంలో ఈ కుర్రాణ్ణిచూచి వచ్చీరాని మాటలనిబట్టి విన్న వృత్తాంతాన్నిబట్టీ తెలుగుబిడ్డ అని గ్రహించి ఇక్కడ శరణాలయానికి తీసుకొచ్చి ప్రవేశపెట్టాడు.

సుశీల అశ్రద్ధగావింటూ తీక్ష్ణంగా చూస్తోంది, పసివాడివంక. ఫొటో తీసుకు నేముందు కదలని కెమేరాలా ఆమెదృష్టి అలాగే నిలిచిపోయింది. బైట చూపు లాగిపోయినా మనస్సు లోపల పనిచేస్తున్నట్టు ముఖభంగిమలో క్రీనీడలు తచ్చాడుతున్నాయి. నారా యణరావుకి ఆశ్చర్యంకలగలేదు: సుశీలకి చంటిపిల్లలంటే విపరీతమైన సరదా. అందులోనూ అంత ముద్దైన బిడ్డ! చుట్టేసుకు నేందుకు ఏ మ్రానుకోసమో వెల్లాడే తీగలలాంటి రూపురేఖలతో ముద్దు లూరించే పసి తనం!!...సుశీల తాను విన్నదానికీ, చూస్తున్న దానికీ లత కలుపుకుంటోంది గావును. ఒడిలిపోయిన కవటాకుల్లో వున్న ఆ పసిబుగ్గలమీద ఇంకిపోయిన లేత మిసమిసలు చూపుల కందటంలేదు. పోషణలేక బక్కచిక్కిన ఆ రూపురేఖల మరుగున లేని జీవం కోసం తడుముకొంటూ వున్నట్టుంది సుశీల. అక్కున జేర్చుకుని, "పేరేమిటి నాయనా?" అని అడగటంతో మళ్ళీ యీ ప్రపంచంలోకి వచ్చింది. ఒళ్లోకి దగ్గరసా, ఇంకా దగ్గరసా ఇమిడిపోతూ "కిట్టూ" అని తీపులొలుకుతూ బదులు చెప్పాడు పసివాడు. ఆ కల కంఠ పలుకుల్లో చిక్కుపడి గిలగిల కొట్టుకుంది ఆమె లోపల నిద్రాణంగా దాగివున్న మాతృహృదయం.

మర్నాడు ప్రొద్దుట చల్లగాలికి శరణా లయంలో పిల్లలంతా బంగాళా యెదట ఇసకలో పిచ్చికగూళ్లు కడుతున్నారు. ఆడపిల్లలు గుజ్జనగూళ్లు వండుతున్నారు. మొగరాయళ్లంతా భోజనాలకి సిద్ధంగా బైఠాయించి కూచున్నారు. కొంతమంది ఆడంగులు జీడిమామిడితోటలోకి విస్తళ్లు తేబోయారు. జంగిడిలో మిఠాయివుండల్లా మెరుస్తున్న పిల్లలమధ్య కిట్టూ నిశ్శబ్దంగా కూచున్నాడు. కొంతమంది గడుసు బుర్రలు "వంట ఇంకా కాలేద" మని ఆడపిల్లల్ని గదమాయిస్తున్నారు. ఇళ్లల్లో జరిగే దినచర్యలు పిల్లల ఆటలలో ఎలా ఛాయగా కనిపిస్తున్నాయో లీలగా దూరాన్నించి చూస్తోంది సుశీల.

నారాయణరావు ఆఫీసుకి వెళ్లిపోతున్నాడు.
"చూడండి!".

ఆగాడు.

బొటనవ్రేలితో నేలమీద రాస్తూ అడగటానికి సందేహిస్తోంది:

"కిట్టూని మనమెందుకు పెంచుకోగూడదూ?"

సమాధానంకోసం-లోపల వుబుకుతున్న ఆత్రుతని వెనక్కి లాగిపట్టింది. నారాయణరావు గమనించలేదు. కాపురానికొచ్చి నాలుగేళ్ళు కాలేదు—అప్పుడే లోపల సంతానవాంఛ రేకెత్తుతోందిగావును అని ముసిముసిగా నవ్వుకున్నాడు. అతను మాత్రం పస్తాయించలేదు :

"అలాగే కానీ—వాడొక్కడూ మన సంసారానికి భారమవుతాడా?"

చెంపమీద ఒక చిన్న చిటికవేసి వెనక్కి తిరిగిచూస్తూ వెళ్ళిపోతున్నాడు నారాయణరావు. సిగ్గుపొరలలో నవ్వు దాచుకున్న రహస్యంలోకి తొంగిచూచాలే అన్న కొంటెతనం చిలిపిగా అతని నైఖరిలో ద్యోతకమవుతూ నేవుంది. సుశీల గమనించలేదు.

ఆమె కళ్లు దీపావళీ ప్రమిదల్లా గుప్పున వెలిగాయి. ఆ రోజునుంచీ సుశీల నట్టింట మసలడం ప్రారంభించాడు కిట్టూ.

కిట్టూ సహజంగానే మందకొడిగా వుంటాడు. ఆటలకనీ పాటలకనీ తోడిపిల్లలతో ఎప్పుడోగాని జేరడు. ఆకతాయి లెవరయినా అల్లరిపెడితే తుర్రున యింటిలోకిదూరి తల్లికోడి రెక్కలక్రింద వొదిగే పిల్లలా సుశీల పమిటచాటున నక్కి "అమ్మా కథలు చెప్పవుటే?" అని గునుస్తాడు మళ్ళీ వారంరోజులదాకా ఆటలకి దిగడు.

కిట్టూ రాగానే సుశీల అల్లిక పనులన్నీ మూలబడ్డాయి. అలంకారాలమీద ప్రీతి అశ్రద్ధగా మారింది ఆమె కిట్టూకి నీళ్లు పోసి, బువ్వ పెట్టి క్రాపు దువ్వి చొక్కా లాగూ తొడిగి చంక నేసుకొని తారసిల్లుతుంటే వెయ్యి నగలు పెట్టుకొన్న గర్వం స్ఫురించేది, నారాయణరావుకి. ఇక పాటలకనీ పుస్తకాలకనీ అతనికి పురమాయింపులు తగ్గాయి వో మీటింగుకి వెళ్ళినా ఒక వినోదంలో మునిగినా సాయంత్రం పెందరాళే ఇంటిపట్టున లేకపోతే ఇవ్వాలసిన సంజాయిషీ జ్ఞాపకం రావడం మానుకుంది.

అసలు వాళ్ళ యిద్దరి భాషా నారాయణరావుకి సరిగ్గా వొంటబట్టలేదు. అప్పుడప్పుడు కిట్టూ తన సరసని కూచుని ఏవేవో విడ్డూరాలు చెప్పుకుపోతుంటే నారాయణరావుకి అర్థంకాక సతమతమయ్యేవాడు సుశీల పనిగట్టుకొనివొచ్చి తర్జుమాచేసి "ఫలానా" అని విడమర్చి చెబితే, "అమ్మయ్య!" అనుకునేవాడు.

ఒక గాలివాన రాత్రి కిట్టూకి ఫ్లానల్ చొక్కా తొడిగి, సెయిలర్స్ టోపీ పెట్టి, రగ్గు బాగా కప్పి వాడేదో వచ్చిరాని కాకమ్మ కథ చెబుతుంటే 'వూ'—కొడుతోంది సుశీల. గూట్లో పిట్టల్లా వున్నారిద్దరూను, బయట ప్రపంచంతో సంబంధం లేనట్టు. తోటలో చిటపటమని వాన చినుకులు తాళంవేస్తూ ఆ రెండు హృదయాలకీ లయకలుపుతున్నాయి. వెనకాలే వొచ్చి నిలుచుని ఆ ఘటనకు క్షణకాలం ఆశ్చర్యంలో మునిగిపోయాడు, నారాయణరావు. ఏ పూర్వజన్మవాసనా ఫలితమో ఇది! సముద్రపువుప్పుకీ అడవి వుసిరికాయకీ వున్న సంబంధం గుర్తుకి తెచ్చుకుని కాస్సేపుతర్కించుకున్నాడు. చప్పున మునివేళ్లమీద నడిచివెళ్ళి సుశీలకళ్లు గట్టిగా మూశాడు చమత్కారానికి. చేతులు మెల్లిగా వొదిలించుకుని, "ఏమిటండీ చిన్నతనపు చేష్టలు?" అన్నది సుశీల - తానప్పుడే పెద్ద ఆరిందా అయినట్టు. కిట్టూమాత్రం గట్టిగా చప్పట్లుకొట్టి వాళ్లిద్దరూ జారవిడుచుకున్న ఆనందాన్ని తానే కిలకిలనవ్వులతో పుణికి పుచ్చుకున్నాడు. ఆ నవ్వులలో కోవెల గంటలు టింగుటింగుమని మ్రోగాయి.

బ్రహ్మసమాజమందిరం పెళ్ళివారితో కిటకిటలాడుతోంది - పాపన్నశాస్త్రి కొమార్తె వివాహం వరుడు చదువుకున్నవాడూ, చిన్నవాడూ, అన్నివిధాలా యోగ్యమైనసంబంధమని నలుగురూ చెప్పుకుంటున్నారు. నారాయణరావు కొంచె మాలస్యంగా వచ్చాడు. రాగానే స్త్రీలు కూచునే స్థలంలో కిట్టూ, సుశీలా వచ్చివున్నారేమో నని వెతుక్కున్నాడు. అవుపళ్లేదు. కనుక్కుంటే తెలిసింది: సుశీల వచ్చి చాలసేపయిందట. వచ్చి ఒంట్లో బాగోలేదని చెప్పి అప్పుడే వెళ్ళిపోయిందట. ఇంటికొకసారి వెళ్ళివద్దామా అనిపించింది, నారాయణరావుకి. కాని రావడమే ఆలస్యంగా వొచ్చి, రాగానే తక్షణమే మళ్ళీ వెళ్ళిపోవటానికి సిద్ధపడితే బావుండదని నిలిచిపోయాడు.

శాస్త్రివొచ్చి మర్యాదా చేశాడు. వొస్తూనే అన్నాడు, "వరు డెవరో తెలుసా? సుశీల మొదటిభర్త తమ్ముడట, నిన్ననే తెలిసింది నాకు." అని వొక వికపు నవ్వు నవ్వి మళ్లీ పెళ్లిహడావుడిలో పడ్డాడు; నారాయణరావు తెల్లబోయాడు. అయితే కావచ్చుగాని అకస్మికంగా అందరిలోనూ తనని అలా చిన్నబుచ్చుతాడా?

విందుభోజన మయింతరవాత అతిథులంతా తాంబూలాలు సేవిస్తూన్నారు. పెండ్లికొడుకూ నారా

యణరావూ ఇష్టాగోష్ఠిలో పడటం తటస్థించింది. నారాయణరావు అతన్ని కదపకుండా తప్పించు కుందామనే అనుకుంటున్నాడు. కాని అతనే కావా లని పలకరించాడు. సంభాషణకి దిగక తప్పిందికాదు. మాటలమధ్య, "మా వొదినని చూడాలనివుంది వొచ్చి వెళ్లినట్టే తెలీదు నాకు," అంటున్నాడతను అప్ర యత్నంగా. తనయెదట, సుశీలని మా వొదిన మా వొదిన అని అతను రెట్టించి అనడం మనస్కరించ లేదు నారాయణరావుకి. కాని భరించక తప్పింది గాదు. అతను బి. ఎ. దాకా కలకొత్తాలో చదివాట్ట. తన చదువులకని అన్నగారూ వదినగారూ ఇద్దరూ మూడేళ్ళపాటు కలకత్తాలో కాపరం పెట్టాలిసి వచ్చిందట. పూజా సెలవులలో తలవని తలంపుగా అన్నగారు కలరా తగిలి...అదేమిటి? నారాయణ రావుకి అగమ్యగోచరంగా వుంది. ఇన్నాళ్లూ సుశీల కన్యగా వుంటగానే భర్తకాలం చేశాడని అను కొంటో వొచ్చాడు. మరిప్పుడు కలకత్తాలో కాపరా లంటాడేమిటి? ఎన్నడో కాలగర్భంలో లీనమై పోయిన సత్యం ఇవాళ బయటపడుతోందా?...... అతనింకా ఏమేమిటో చెప్పుకుపోతున్నాడు. నారా యణరావు సరిగ్గా వినిపించుకోటంలేదు. అతని మొహాన్ని కత్తివాటుకైనా నెత్తురుచుక్క లేదు. పాపన్నశాస్త్రి దూరాన్నించి గమనిస్తూ మాటల ధోరణి కనిపెట్టె సైగచేసి అల్లుణ్ణి తన దగ్గరికి రప్పించు కొని సంభాషణ తుదచేశాడు. నారాయణరావు కిదంతా అనుమానాస్పదంగా కనిపించింది. అది చాలక శాస్త్రి వరుడి చెవిలో ఏదో రహస్యం వూత్తున్నాడు. దానితో ఆ రహస్యం తనకి సంబం ధించిందని స్పష్టపడింది. నారాయణరావుకి, శాస్త్రి ప్రవర్తనకి వొళ్లుమండి చివ్వున లేచాడు.

మౌనంగా వెళ్ళిపోతున్నా అతని మనస్సులొ ఇందాక విన్నమాటలు వేటాడుతూనే వున్నాయి. ఏదో ఒక కఠోర సత్యాన్నించి పారిపోతున్నట్టుంది అతనికి. ఇంకా అక్కడ కొంతసేపు నిలిచి అతను చెప్పే సుశీల ఎవరో కాపరం ఎన్నాళ్ళు చేసిందో ఏమిటో, అన్నగారంటాడు ఏ అన్నగారో, అన్నీ వివరణగా కనుక్కొని తనకి కలిగిన అనుమానాన్ని స్థిరం చేసుకోవటమో లేకపోతే మొగలోనే తుంచేసి నిశ్చింతగా వెళ్ళిపోటమో జరిగించాలిసి వుంది. కాని, నిజాన్ని అంత సూటిగా ఎదుర్కొనే శక్తి లేదతనికి. ఆరా తీస్తే తను భరించలేని విషయాలింకా ఏమి బయటబడతాయోనని అలజడి పుట్టిందతనికి. కాని, తెలిసిన నిజాలకంటే తెలియని నిజాలకి బాధించే నైజం ఎక్కువపదునుగా వుంటుందని అతనికితట్టలేదు.

కేటు కవతల ఎంగిలాకుల్లో వెతుక్కొంటూ కొట్లాడుతున్నారు యానాదులు. కాలేజీ ఆవరణలో గులాబీజామ చెట్లకింద పిల్లలు చిలకలు కొరికిన పళ్లు ఏరుకుంటూ అందని చిటారుకొమ్మలవంక ఆశగా చూస్తున్నారు. నారాయణరావు తలవంచుకొని పోతు న్నాడు. సుశీల తండ్రి తనని అన్యాయం చేశాడా? ఏమో—వెయ్యి కల్లలాడి ఒక ఇల్లు నిలపమన్నారు. అందులోనూ, తన కన్నకూతురు విషయంలో అను కూలమైన సంబంధం అమురుతుందో అమరదోననే ఆదుర్దాలో ఒక్క అబద్ధం- -ఒక్కటి మాత్రమే— చెప్పాడూ అంటే నమ్మదగనిదేమీ కనుపించదు. సుశీలగూడా యీ కుట్రలో చేరినట్టేనా? గుండెల్లో చెయ్యి పెట్టి కలిచేసినట్టు బాధపడుతున్నాడు.

ఝల్లున తెల్లవారినట్టు రాత్రి హాయిగా నిద్ర పోయి మెలకువ తెచ్చుకున్నవాళ్ళకి తెలుస్తుంది. కాని, నారాయణరావుకి మాత్రం జాగరణలో రాత్రంతా రెక్కలు తెగిన రాబందులా తన కళ్ళ మీదనించి ఈడ్చుకొంటూ అతిభారంగా జరిగిపోయి నట్లనిపించింది. ఉన్నవీ, లేనివీ, ఉండగలవీ, సాధ్య మయ్యేవీ సంభవమయ్యేవీ అన్నీ వూహించి కల్పించు కుని అతని మనస్సు లేని బాధను సృష్టించి మెదడుని కుళ్లబెట్టింది, రాత్రంతా. పక్కని జీడిమామిడి తోటలో అడవి పిచ్చుకల కోలాహలం కిటికీలోనుంచి గందరగోళంగా వినిపిస్తూ కళపెళమని మసిలే రక్తా నికి మరి రెండు సమిధలు కలుపుతున్నట్టుంది నిన్నటి సంఘటన తరవాత సుశీలకీ తనకీ మాటలు జరగలేదు. సుశీలకూడా ఏదో అగాధంలోపడి కొట్టుకుంటోందని. అతనికి తెలుసు. రాత్రి రెండు ఝాముల వేళ తను లేచి చూచినప్పుడు కంటబడిన దృశ్యం అతను మరచి పోలేదు. ఒక చేత్తో కిట్టుని జోకొడుతూ మరొక చేత్తో కన్నీళ్లు తుడుచుకుంటోంది, ఏమయితేనేం? సుశీల పవిత్రమయింది—తనమీద పంచప్రాణాలు పెట్టుకున్నది—తనుతప్ప మరొక ప్రపంచంలేనిది—తానే సర్వస్వమూ అని నమ్ముకున్నది—క్షమించ లేనా అనుకున్నాడు. దానితో మనస్సు కుదటబడింది. క్షణకాలం అతని మెదడు కలిపెస్తున్న ఆలోచనలమీద హృదయం తిరుగుబాటు చేసింది. కాని అది తన హృదయదౌర్బల్యమేమో నన్న సంశయం వదలలేదు. వెచ్చనిదిళ్లూ, మెత్తనిపానుపులూ కావలిసినవి అమర్చి పెట్టే సౌకర్యాలూ వీట్లతో దినదినమూ ఆమె ఆదరణకి అలవాటుపడి ఆమెనీ ఆ సదుపాయాలనీ వొదులు కునేధైర్యం లేక ఏ ఎంగిలిబ్రతుకయితేనేం, ఎలాగో వొహలా సరిపెట్టుకోగూడదా అనే నైచ్యానికి

సిద్ధపడుతోంది వాళ్ళ అంతరాత్మ? —ఆలోచన తెగలేదు— అయితే కొన్నాళ్లు భర్తతో కాపరం చేసిన స్త్రీకి పునర్వివాహం చేసుకునే అర్హత లేదని అనడు. ఈ రహస్యం మొదట్లో తనకి తెలిసినా అంత బాధించేది కాదేమోనని ఇప్పుడనిపిస్తోంది. కాని, ఇన్నాళ్ళూ తనని మురిపించిన భావన వేరు. ఈ సుశీల తన సుశీల కాదు. తన సుశీల రాలని మంచుబొట్టులా నిర్మల మయినది. 'వాసనచూడని ప్రసూనం' ఆమె మొదటి యవ్వనపు పొంగులు, మలినం కాని కోరికల గుబాళింపులను తొలి కానుకలుగా తానే అందుకున్నా ననుకున్నాడు. ఆ వూహాస్వర్గంలో నించి పతనాన్ని సహించలేకపోయాడు.

రాత్రి భోంచేసి వొంటరిగా సముద్రపు వొడ్డుకి వెళ్ళిపోయాడు నారాయణరావు. విరిగిన కెరటాల తుంపరలు మీద పడుతున్నాయి. ప్రాణం హాయిగా వుంది. కెరటాలు లేకపోయినా సముద్రం గంభీరంగా అనిపించింది. సముద్రమూ ఆకాశమూ, ఎత్తయిన కొండలూ చూస్తే మానవుడిలో వున్న సంకుచితత్వం రవంతసేపు పక్కకి తొలగుతుంది. నారాయణరావు తీవ్రంగా ఆలోచించాడు. ఇందులో సుశీల అపరాధమేమీ కనిపించదు. మరొకవ్యక్తి కోరకయితే ఈ అసత్యం చెప్పాలిసిన అవసరమే లేకపోను. తన వుద్దేశాలూ గుట్టూ తెలుసును గాబట్టి, ప్రత్యేకించి తననే కావాలని కోరి వరించిన సుశీల తండ్రిని అబద్ధం చెప్పమని ప్రోత్సహించినా తప్పేమీ వున్నట్టు తోచదు. తనకోసమే గా? అప్పట్లో నిజం చెప్పివుంటే తను దక్కకపోయేవాడేమో కూడా. తన కుళంకలన్నిటికీ తరతరాల నించీ పురుషరక్తంలో పాతుకున్న స్వార్థమూ, ఈర్ష్యాపునాదులేమో? సామాన్య గృహస్తుకి మల్లే తనూ పెళ్ళాన్ని నాలుగతన్ని బైటికి ఈడ్చి, తలుచుకుంటే మళ్ళీ పెళ్ళిపీటలమీద కూచోగలడు. కాని ఉన్నతంగా ఆలోచించి చూసుకుంటే ఇది క్షమించరాని అపరాధమా? చివాలున లేచి ఇంటి మొహం పట్టాడు.

పాపం—సుశీల ఎంత బాధపడుతోందో. ఆమె అమాయికపు చూపులు మళ్ళీ తలపుకువచ్చాయి. నైర్మల్యం తరగని ఆ చూపులికి కళంక మంటగట్టి తానే పాపం చేస్తున్నాడు.

సముద్రపుగాలికి వెన్నెలతోడై చలి వొణికిస్తోంది—ఇందాకటినుంచీ తెలియలేదు.

ఇంటి ఆవరణలో అడుగుపెట్టగానే కొండంత బరువు దించేసినట్టయింది. తలుపుకొట్టేముందు కిటికీలోనించి తేరిపార జూశాడు. లోపల పరుపుమీద సుశీలా కిట్టూ ఇద్దరూ మైమరచి నిద్రపోతున్నారు. సుశీల చెంపలమీద కన్నీటి చారికలింకా చెరగనైనా లేదు. కిట్టూ వులిక్కిపడ్డాడు. క్షణకాలం నారాయణరావు నిశ్చలంగా చూశాడు. ఏదో ఆకర్షించిం దతన్ని. ఆ ముఖాలలో ఇదివర కెన్నడూ గోచరించని పోలికలు స్పష్టంగా ఇప్పుడు బయటపడుతున్నాయి. అవతల కిటికీ వూచలలోనించి ఆ రెండు ముఖబింబాలమీదా వెన్నెలపడి ముక్కుతీరులోనూ, నుదుటి వంపులోనూ, పెదిముల వృత్తాకృతిలోనూ, ఇన్నాళ్లూ కనపడని సూక్ష్మాతి సూక్ష్మమైన పోలికలని వెతికి వెతికిపట్టి ఇస్తోంది. కళ్లు రెండూ భూతద్దాలకింద మలుచుకుని చూస్తున్నాడు నారాయణరావు. తనదృష్టిలో ఏమైనా దోషమున్నదేమో—మతిభ్రమణం కాదుగదా? తీక్షణంగా చూశాడు. పగలు విరామంలేని కదలికలో చెలించే నీటిలో చంద్రబింబంలా ఏ ఆకారమైనా అలుముకుపోయి అనేక భంగిమలలో కనపడుతుంది. రాత్రి నిద్రలో, ఆ ప్రశాంతిలో రూపురేఖలన్నీ తేరుకుని పరిశీలన కవకాశమిస్తాయి. సుశీలకి కిట్టూ అంటే వున్న అపారమైన వాత్సల్యమూ, పాపన్నశాస్త్రి అల్లుడి చెవిలో వూదిన రహస్యమూ...ఒకదానితో ఒకటి సంబంధంలేని హంశాలెన్నో అతుక్కుని లంకె వేసుకుంటున్నాయి. కిట్టూ లాహోరు ప్రాంతాలలో కాళీ వుత్సవాల జనసమ్మర్దంలో తలిదండ్రులవద్ద నించి తప్పిపోయిన శిశువనీ, సుశీల భర్త ఆ ప్రాంతాలలోవాడేననీ ఒకేసారి తళుక్కున స్ఫురించాయి నారాయణరావుకి. దానితో ఏదో మీట నొక్కినట్టయి, ఆరిపోయిన అనుమానాలన్నీ మళ్ళీ గుప్పున వెలిగాయి. అతని గుండెలో రాయిపడింది. సుశీల సంతానవతి కూడానా? ఇందాకటినుంచీ సద్దుమణిగి పడివున్న అసహ్యాలు, ఈర్ష్యలూ—అన్నీ మేలుకుని చురకత్తులకింద మారి చకచకా పదును పెట్టుకుంటున్నాయి. ఎక్కడ వీ పోలికలు?

గిరుక్కున మళ్ళాడు.

మర్నాడు సాయంత్రం పాపన్నశాస్త్రి ఎందుకో వచ్చాడు. సుశీల సమాధానం చెప్పింది నారాయణరా వింటో లేడని. వెళ్ళిపోటానికి గడప దాటుతున్నాడు.

“మీతో మాట్లాడాలిసివుంది-ఒక్క మనవి-” అన్నది సుశీల. ఆమె లోపల తలుపుకి అరచాటుగా నిలబడింది లజ్జగా. అంతవరకూ పాపన్నశాస్త్రితో ఎన్నడూ చనువుగా సంభాషించి ఎరగదు.

ఆగాడు. జరగబోయే సంభాషణ ఏమిటో ముందుగానే బాగా తెలిసివున్న ధోరణిలో తాపీగా కూచున్నాడు పాపన్నశాస్త్రి.

"నా వివాహవిషయంలో మా నాన్నగారు దాచి వుంచిన కొన్ని సంగతులు మీయెదట పెట్టాలని వుంది" అని సందేహించింది సుశీల.

"అమ్మాయీ నాకంతా తెలుసును. నువ్వు ఆదుర్దాపడకు" అన్నాడు పాపన్నశాస్త్రి—ఆమె నివ్వెరపోయింది

"నువ్వు నీ భర్తతో కొన్నాళ్లు కాపరం చేశావనీ—"

"మా నాన్నతో ఎంత వాదించినా నిజం చెప్పటానికి వొప్పుకోలేదు. నేను అస్వతంత్రురాలిని."

"నీ కొక కుమారుడు కలిగాడనీ..."

సుశీల కళ్లల్లో బెదురు స్పష్టంగా కనిపిస్తోంది.

"ఆ పసివాడు లాహోర్లో కాళీ వుత్సవాలలో తప్పిపోయాడనీ..."

"అంతేనా."

"ఇప్పుడు నీదగ్గిరవున్న కిట్టూ నీ కన్నకొడుకేనని..

సుశీల ఊపిరికూడ విన్న నిరస్తుడిలా నిలబడింది.

"ఇక నే వెడతా," అని లేచాడు.

"ఇదంతా మావారికి తెలిసినట్టేనా?" దీనంగా అడుగుతోంది సుశీల.

"అమ్మాయీ నా కడుపున పుట్టిన బిడ్డ వొకటీ, నువ్వు మరొకటేనా నాకు. నీ సంసారం చితికిపోతే నాకు ముచ్చటా? నిన్న మా అల్లుడు సందర్భవశాత్తూ కొంతవరకూ చెప్పేశాడు—మీ ఆయనా నువ్వూ కలకత్తాలో కొన్నాళ్లు కాపరం పెట్టారని—అంతే. నేను ధోరణి బాగుండలేదని కనిపెట్టి సైగచేసి వారించాను; దానితో ప్రమాదం తప్పింది."

"మీరు దేవతలా సాక్షాత్కరించి నాకన్నబిడ్డని నా చేతులకి వప్పగించారు. వాడి భవిష్యత్తులో ఏమి సుడిగుండాలున్నాయో నాకు తెలియదు" అన్నది సుశీల గద్గదికతో.

"తల్లీ – బెంగపెట్టుకోవద్దు. గుండె రాయి చేసుకోవాలి. తప్పదు. నారాయణరావుతో నాకీ ప్రస్తావన అప్పుడే వచ్చింది. అతను దారికి వచ్చేటట్టు లేడు. కాని ప్రయత్నిస్తాను – కాని, అమ్మాయీ, వొకటి చెబ్తా విను. మన అంతరాత్మలో మకిలివున్నంతసేపూ ప్రపంచాన్ని శుభ్రంగా చూడలేమంటే నమ్మ"

పాపన్నశాస్త్రి వెళ్లిపోయాడు.

సుశీలకి ఆందోళన ఎక్కువయింది—అప్పుడే ఆమెకి తెలిసింది – నారాయణరావు పిఠాపురందివాణం ఆఫీసులోకి బదిలీ చేయించుకునేందుకు రాజాగారితో సంప్రదిస్తున్నాడనీ, అర్ఫనేజి బాలికలవల్ల కొంత చూచాయగా వింది·—కిట్టూని తిరిగి శరణాలయంలో చేర్పించేందుకు నిశ్చయించుకున్నాడనీ. చీకటి పడుతున్నకొద్దీ ఆమె మనస్సు మనస్సులో లేదు. ఉదయమనగా అర్ఫనేజి స్కూలికి వెళ్ళినకిట్టూ ఇంతవరకూ రాలేదు. గబగబా స్కూలుకివెళ్లి కిట్టూని తీసుకొచ్చేసింది. కిట్టూని శరణాలయంలోనే వుండాలని నిర్బంధపెట్టారట. అప్పుడే ఎక్కడనించో వొచ్చాడు నారాయణరావు. ఆమెవంక చూడకుండానే రిస్టువాచీ మేజాబల్లమీద పెడుతూ "కిట్టూని శరణాలయంలోనే వుంచెయ్యడం మంచిది" అన్నాడు. సమాధానం రాలేదు. "తరవాత నీ ఇష్టం" అని ముభావంగా వెళ్లిపోయాడు నారాయణరావు. రాత్రి మెయిల్లో పిఠాపురం వెళ్ళాలట — అర్జంటుగా. ఉదయమే వస్తానన్నాడు.

గదిఅంతా చిమ్మచీకటిగా వుంది. లోపల కిట్టూ ఏడుస్తున్నాడు. సుశీల ఖంగారుగా కిట్టూని కావలించుకుని బావురుమని యేడిచింది. తననీ తన కిట్టూనీ వేరుచేయాలన్న సంకల్పం నారాయణరావుకే కలిగిందో లేకపోతే ఇతరుల సలహాకి ఫలితమో ఆమె వూహ కందలేదు. కాని అలాంటి నిర్ణయం తన వెనకాల జరుగుతోందని మాత్రం ఆమె బాగా పసికట్టింది. "కన్నా—నిన్ను వదలనులే తండ్రీ" అని కన్నీళ్లతో సముదాయించింది. ఆకటికి చీకట్లో కిట్టూ మాయమవుతాడేమో—చీకటి మింగేస్తుందేమో... చెప్పరాని దుడుకుగా వుంది సుశీలకి. దీపంలేని సంగతి తట్టనేలేదు సుశీలకి. గబగబా లాంతరు వెలిగించింది. ఆమె చేతుల్లోనే సోలివాలి నిద్రపోయాడు కిట్టూ. దీర్ఘాలోచనలో మునిగిపోయింది సుశీల.

విధి బలవంతాన ఎక్కడికో అజ్ఞాతంలోకి లాక్కుపోయి తిరిగి ఈనాడు మళ్లా అప్రయత్నంగా, పెన్నిధిలా, ఆకస్మికంగా తన వొడిలోపడిన అమృతఫలం!! ఎలా వొదులుకుంటుంది? కిట్టూ తప్పిపోయింది లగాయితూ, ఎంతమంది దేవుళ్లకి

మొక్కింనో, ఏకాంతంగా ఎవళ్ళకీ తెలియకుండా; కిట్టూ ఏమయినాడో ఏ పేదగుడిసెలో ఆకలికి అలమటించి పోతున్నాడో, ఏ కఠోర హస్తాలలో కక్కటిల్లిపోతున్నాడో అని ఎన్నిసార్లు కుమిలి కుమిలి ఏడిచిందో, మళ్ళీ కిట్టూ తన చేతిలో పడేవరకూ కళ్ళె పెళ మనిలే ఎన్ని అగ్నిపర్వతాల్ని లోపల రహస్యంగా దాచుకుందో ఎవరికి తెలుసును?—ఎంత మంది దండెత్తిరానీ, తన ప్రాణాలు వాడిమీద కవచంలా కప్పి రక్షించుకుంటుంది. తన రక్తంతో వాడి చుట్టూ గిరిగీసి కాపలా కూచుంటుంది కాని వని

ఆ క్షణంలో నారాయణరావు ఎవరా? అనిపించింది. తనకీ అతనికీ సంబంధమేమిటి? పరపురుషుణ్ణి చూడాలిసిన దృష్టితో అతన్ని పరామర్శించుకుంటోంది శీల. తాను యాక ఇతిగాల స్థలంలో అడుగు పెట్టినట్టూ దానికి శిక్ష అనుభవిస్తున్నట్టూ భావించుకుంటోంది ఎందుకు తాను మళ్ళీ పెళ్ళిచేసుకుంది? దేనికి కుప్ప గూలిన యింటికి మళ్ళీ పునాదులెత్తుకుని కూచున్నది? క్షమించరాని అపరాధమేదో చేసినట్టు మనస్సు కోత పెడుతోంది ఆ ఇల్లే యిప్పుడు గోరీకింద మారి తననీ తన కిట్టూనీ మింగాలని నోరు తెరుచుకుని కూచుంది. కిట్టూ తనదగ్గర వున్నంతకాలమూ, కిట్టూకోసం దేశదేశాలు వెతికించినన్నాళ్ళూ, కిట్టూ మళ్ళీ దొరుకుతాడన్న ఆశ మినుకు మినుకు మన్నంతకాలమూ, మళ్ళీ పెళ్ళిచేసుకుంటావా అని అడిగే సాహసం తన తండ్రికిగాని చుట్టుపక్కల ఎవరికిగాని కలగలేదు. కిట్టూ తన జీవితంలో మళ్ళీ తప్పటడుగులు వెయ్యబోతున్నాడని కలగనివుంటే, తన కళ్ళల్లో కాంతులు జల్లడానికి, తన యెడారి బ్రతుకులో చిరునవ్వులు చిలికించటానికి మళ్ళీ అమృతకలశం పుచ్చుకుని ఎదురవుతాడని అణుమాత్రమైనా ఆశ మిగిలివుంటే ఏ కొండగుహాలలోనో, ఏ మహారణ్యంలోనో తల దాచుకొని తన కిట్టూకోసం కళ్ళల్లోకి ప్రాణాలు తోడుకొని ఎన్ని యుగాలైనా ఎదురుచూసేదే! కాని, పవిత్రతని అర్థం చేసుకోలేని, మాతృత్వాన్ని మన్నించలేని కర్కశహృదయాలమధ్య ఒకళ్ళ చేతుల్లో తన కిట్టూ భవిష్యత్తు అల్లాడవలసిన దుస్థితి కలిపించేదా?

ఈ అలజడిలో కర్తవ్యం మరచిపోయింది—సుశీల. తెల్లవారగనే నారాయణరావు వస్తాడు. కిట్టూ ప్రసావన తప్పకుండా వోస్తుంది. ఏమిటి బదులు చెప్పాలి? స్పష్టంగా ఊహించగలిగింది కూడా. కిట్టూని వదలనంటే ఇద్దరినీ బయటికినెట్టి తలుపు వేసుకుంటాడు. కిట్టూని విడిచిపెట్టడానికి అంగీకరిస్తే తిట్టుకొంటూనో, అసహ్యించుకొంటూనో, బాధిస్తోనో వేధిస్తోనో ఆజన్మాంతము ఏలతాడు. తన భావిజీవితాన్ని ఊహించి చూచుకుంటే కోత పుట్టింది సుశీ చప్పున లేచి ఒక నిశ్చయానికి రాగలిగింది. ఇక తప్పదు. చేతులనున్న బంగారు గాజులూ, మెడలో చంద్రహారమూ అన్నీ వొకదాని తర్వాత వొకటి వూడ్చి మేజాబల్లమీద పెట్టింది ఆ యింట్లో తన గతజీవితాన్నికూడా అలాగే వూడ్చి వేసుకోగలిగితే బాగుండు ననిపించింది.

అప్పుడే తెలతెలవారుతోంది. తూర్పున తెల్లటి రేఖలు శిక్షాపత్రాన్ని విప్పుతున్నట్టున్నాయి. కిట్టూ గాఢంగా నిద్రపోతున్నాడు. ఎత్తుకుని భుజాలమీద వేసుకుంది. తాను అజ్ఞానంగా పారవేసుకున్నా మళ్ళీ వెతికి దేవుడే తన బాధ్యతకి అప్పగించినట్లిన తియ్యని బరువు! ఇల్లంతా ఒక్కసారి కలియజూచింది నారాయణరావు పుస్తకాలూ, కుమ్మరికని తాను సగముల్లిన గుడ్డతెరా, పిల్లలతో కళకళలాడే ఇంటి ఆవరణా, పాలరాతి చీడీలూ, నారాయణరావుతో ఆపావంచాల మీద గడిపిన మధుర క్షణాలూ, బంగాళాబంతి చెట్ల నీడలు మసిలే కాంపౌండు గోడ—అన్నీ, నా అన్న తెర పడి మొదటిసారి నగ్నంగా అవుపించాయి... వొక కలలో మనిషిలా వెళ్ళిపోతోంది.

శరణాలయంలోంచి గీతాలు, వినిపిస్తున్నాయి. మేలుకునే పిల్లల కలకలంతో శరణాలయమే వొక జాలిగుండెలా స్పందించింది. గీతాలు పై కరుణామృతపుంజాలా అన్నట్టు ంగులువారినై. కళింగలకాలవగట్టు వెంబడి నడిచిపోతోంది సుశీల. రేవులలో కార్తికస్నానాలు చేస్తున్నారు. ముత్తైదువులు. అరటిదొప్పలలో వెలిగించిన కార్తీకదీపాలు ప్రవాహంలో చుక్కలా సురిగిపోతున్నాయి, సత్సంతానంకోసం పుణ్యస్త్రీల హృదయసీమలలో కొనలుసాగే కోరికల వెలుగులా అన్నట్టు.

కిట్టూని హృదయానికి దగ్గరగా అదుముకుంది సుశీల. చూపుమేరదూరంలో, చీకటి సయారంలో, గానుగచెట్ల చిక్కని నీలినీడలలో ఆమె మాయమయ్యింది. ఎక్కడికో—విధి ఈడ్చికెళ్ళేచోటికి—విశాలప్రపంచంలోకి.

# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాధ కుండ తెల్లగాను మరియు ప్రకాశవంతముగాను ఉతుకును



"మేస్టారు, నేను సొగసైన పిల్లనని చెప్పుచున్నారు. అది ఎందువల్లననగా, తల్లి నా ఫ్రాక్‌లను సన్‌లైట్ సబ్బుతో తళతళమని మెరయునంత తెల్లగా ఉతుకును. సన్‌లైట్ యొక్క చాల ఎక్కువ మీగడవంటి నురగ త్వరగా, సులభముగా, బాధకుండా, మలినమును బయటకు తరిమివేయును."



"నేను నా క్లాసులో మిక్కిలి మనోహరమైన పిల్లను. సన్‌లైట్‌తో ఉతుకుట నారంగు ఫ్రాక్‌ను ఎంత ప్రకాశవంతముగా నుంచునో చూడండి! సన్‌లైట్ బట్టలను పాడు చేయకుండ అవి ఇంక ఎక్కువ కాలముండుటకు సహాయపడును."




## సన్‌లైట్ సబ్బు

బట్టలను కాపాడును, శ్రమను తగ్గించును, ఖర్చును తగ్గించును

S. 219-X52 TL

ఇండియాలో తయారుచేయబడినది.

# * రసావగతి

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ప్రతి అనుభూతియందు ప్రమాతయనబడు అనుభవించు వ్యక్తి, ప్రమేయమనబడు వింపబడుచున్న విషయముకలవు. ప్రమేయ మెల్లపుడు అనుభవింపబడుటకు యోగ్యమైనది. సంవిత్సంవేద్యమగు నీవస్తువు సంవిదాశ్రితమై యుండును. సంవేదనమున ప్రమేయ మనన్యత్వ సంబంధముతో కన్పించుటచే నీరెండును అపరోక్షముగా అనుభూతములగుచున్నవి. అనగా సంవేదనము వేరు, ప్రమేయము వేరు అను ప్రతిపత్తి ఈసమయమున లేదు. ప్రమేయముతో సంవలితమైన సంవేదన మర్థవంతమగుచున్నది. ఆత్మస్థమగు సంవేదనము బాహ్యజగమునుండి స్వరూపమును ధరించగలుగుచు వస్తుతంత్రమగుచున్నది. ఇట్టి సంవేదనము చిత్తవిస్తారవికాసముల ద్వారా భాసించుచు, విషయాభిన్నముగా కన్పించుచు, విశ్వజనీనమగుచు, అభివ్యక్తికి యోగ్యమైన దగుచున్నది. అని "బొశాంకెట్" (*Bosanquet*) చెప్పియున్నాడు. ప్రతి విషయము సంవిత్సంవేద్యముగా భాసించుచుండుటచే సకల జగద ము అనుభూతిమీద నాధారపడియున్నదని చెప్పవలెను. సంవేదనమున ప్రతి విషయము అనుభూతమగుచు, సంవేద్యమగుటకు సంవేదనము నాశ్రయించి యుండును.

అనుభూతమగు విషయము వేరు, అనుభూతము చేయు సంవేదనము వేరు. సంవేదన మపరోక్షముగా అనుభూతమగుచున్నది. ఈయపరోక్షానుభూతికి, తద క్త ప్రమేయమునకు సంబంధమెట్లు సిద్ధించుచున్న ప్రమేయములు గానున్న విషయములకు మాత్రమే సమవాయాది సంబంధములు సిద్ధము కాగలవని "ఎఫ్ ఎచ్. బ్రాడ్లే" (*F. H. Bradley*) సిద్ధాంతించియున్నాడు. సంవేదనమునకు ప్రమేయమునకు సంబంధము కుదురవలెననిచో సంవేదనమును ప్రమేయముగా ప్రమాత స్వీకరించవలెను. ప్రమాతకు సంవేదనము ప్రమేయమైన ఈ ప్రమేయమును గ్రహించగల మరియొక సంవేదనము కావలెను. ఈసంవేదనమునకు మరియొక సంవేదనము అని ఈరీతిగా అనవస్థాదోషము రాగలదు. పైగా అపరోక్షముగా అనుభూతమగు సంవేదనముకంటె ప్రమేయమగు సంవేదనము విలక్షణమగుచున్నది. ఈ విలక్షణ ప్రమేయమపరోక్షానుభూతి నతిక్రమించియుండును. ఈదోషములనుండి మరలిపోవలెననిన ప్రతి అనుభూతియందు ప్రమేయము కాజాలని సంవేదనము కలదనియు, ఈసంవేదనవశమున సమవాయాది సంబంధరహితమైన విషయానుభూతి కల్గుచున్నదనియు అంగీకరించవలసియున్నది. ప్రతి అనుభూతియందు విభిన్నాంశముల కంగాంగి భావరూపమగు సమన్వయముకలదు. అంగాంగిభావ సంబంధముతో విషయమపరోక్షానుభూతియందు ప్రతీయమానము గాక, తదతీతముగా ప్రతీయమానమగుచున్నది. అంగాంగీభావాది సంబంధము సంవిదధీనముగా, సంవిద్రూపముగా కూడా భాసించుచున్నది. కావున చైతన్యముచే నసంస్పృష్టమైన విషయము భాసించజాలదని వివరణకారుడు పలికినాడు. చైతన్యముతో సంవలితము కాని వస్తువునకు వస్తుత్వము లేదని తాత్పర్యము

అనన్యత్వ సంబంధముగల సంవేదన ప్రమేయములనుభూతము లగుచున్నవి. ఈరెంటిని మన సౌలభ్యముకొరకు వేరుజేయవచ్చును, మరల కలుపవచ్చును. కాని ఈప్రక్రియయంతయు సంవిదాశ్రితమని మరువరాదు. వేరుజేయుట, కలుపుట అనునవి కూడ అనుభూతములగునవేయని విస్మరించరాదు. సంవిత్సంవేదనమున వీటికన్నిటికి సమన్వయము సిద్ధించుచున్నది. ఈసంవిత్సంవేదనమున విభిన్నాంశములు గోచరించుటలేదు. అందుచే సమవాయాది సంబంధముల కతీతమై, అసంగమై సంవిత్సంవేదనమున్నదని గ్రహించవలెను. కాగా అనుభూతిలోగల వివిధాంశములకు అన్యోన్య సంబంధముకలదని, ఈ సంబంధములేనిచో నవి యుండజాలవని స్పష్టమగుచున్నది. అనుభూతికి పట్టుకొమ్మయగు సంవేదనమున అనుభూయమానమగు ప్రమేయము, ఆత్మస్థముగా అనుభూతమగు సంచారిభావము, అనుభవించు ప్రమాత అను మూడు విషయము లన్యోన్యసంవలితములై కలవు. కాని ఈమూడింటితోనే సంవేదనమున్నదని యెంచరాదు. సంవేదనమున గల ప్రతీతి వీటితో సంవలితమైయున్నను, వీటికన్న విలక్షణమైనదిగా స్ఫురించు

చున్నది. ఈస్ఫురణలో భావపరిస్పందము కొంత వరకుగలదు. భావపరిస్పందము సంవలనమును సంవేద్యము చేయుచున్నది. సంవేదనమున భేదావభాస లేకుండుటచేతను, అనుభవాధీనమై సిద్ధించు విషయమున కనాత్మత్వము చెప్పబడుటచేతను, వికార పరిణామాది రహితమై స్థాయిగానున్న ఆత్మయే అనుభూతియొక్క స్వరూపస్వభావ నిర్వాహకమని వివరణకారుడు చెప్పినాడు. సంవేదనమున వివిధవిషయముల కేకత్రతాను సంధానముకలదు. ఇట్టి సంవేదనము అభేదప్రతిపత్తితో కన్పించుటచే సంవిత్స్వరూపమే సంవేదనము లేక ప్రతీతి యనబడు అనుభూతికి చెప్పవలెనని తాత్పర్యము.

వివిధ విషయముల కేకానువృత్తసూత్రమున సమన్వయమును చూపుసంవేదనము సంవిత్స్వరూపమని నిశ్చయించితిమి. ప్రమాతకు, తద్విలక్షణమగు ప్రమేయమునకు గల సంబంధమును అనుభూతి యనరాదని, అనుభూతియనగా ప్రమాతృప్రమేయముల కభేదప్రతిపత్తియని కనుగొంటిమి. సర్వానుగ్రాహకమై అనుభూతియనబడు సంవేదనము అనుభవించు సంవిత్ లేక చైతన్యమున సర్వవిషయములను సమన్వయపరచుచున్నదని తేల్చితిమి. ప్రేమాస్పదము, కూటస్థము, సాక్షి, విషయేంద్రియాద్యనువృత్తిచైతన్యరూపమునై అనుభూయమానమగు అంశను ఆత్మయని పిలతురని వివరణ ప్రమేయ సంగ్రహము చెప్పచున్నది. సంవేదన రూపమున ప్రతీయమానమగు సంవిత్ లేక చైతన్యము జగన్నిష్ఠముగా భాసించుచున్నదని భావము.

సంవేదన మర్థవంతముగా భాసించగా వస్తుతంత్రమగుచు మహత్తర పరిణామమును చూపగల్గుచున్నది. భావరహితమైన సంవేదనముండజాలదు. భావసహితమైన సంవేదనము సదా అభివ్యక్తమగుచున్నది. సంవేద్యములేకుండా సంవేదనముండజాలదు గనుక అర్థవంతము కాకముందుకూడ సంవేదనము కలదని చెప్పవీలులేదు. భావాభివ్యంజకమగు సంవేదనము అర్థవంతమగుటచే కావ్యమున నుపహితమగుచున్నది. అర్థవంతము కాని సంవేదనమునకు రూపముగాని, స్వభావముగాని, అభివ్యక్తిగాని ఉండజాలవు. సంవేదన మర్థవంతమైనప్పుడు విషయసంవలితమై వస్తుతంత్రమగును. ఇచట వస్తుతంత్రమగుననగా ప్రమాతృప్రమేయములు విలక్షణములు కావని భావము. ఈసంవిదభేదమునకు అపరోక్షప్రకాశమానతయని వివరణకారుడర్థము చెప్పినాడు. ప్రత్యక్షప్రతీతియనగా ప్రమాతృప్రమేయములు లేక సంవిత్సంవేద్యములు అభిన్నములుగా ప్రతీయమానమగుటయే అని అర్థము. విషయ సత్తానిశ్చయము సంవిదవభాసాధీనమగుటచే ప్రత్యక్షప్రతీతియందు భేదము మాత్రమే నిరస్తమగుచున్నది కాని, ప్రతీతిలో గల వివిధాంశములు పరిత్యక్తములగుటలేదు. విషయసత్తా నిశ్చయము నిశ్చయాంతరాధీనమగుటచే సంవిత్సత్తా నిశ్చయము విషయసత్తా నిశ్చయాధీనము కాదని స్పష్టము అనగా విషయముల అస్తిత్వము సంవిదధీనమైయున్నదని భావము. సంవిన్నిశ్చయము స్వతఃసిద్ధమని, విషయసత్తా సంవిదధీనమని గ్రహించవలెను. కావున ప్రత్యక్ష ప్రతీతియందు ప్రమాతృప్రమేయములకు భేదావభాసలేదని, అపరోక్షానుభూతియనగా అభేదప్రతిపత్తియని స్పష్టమగుచున్నది.

ప్రమేయమునకస్తిత్వము కలదని తెలిసికొనునప్పుడు సంవిదపరోక్షమేకలదు. ఈయపరోక్షమున సంవిత్సంవేద్యము లేకముగా భాసించుచున్నవి. అనగా సంవేద్యము సంవిదధీనమై భాసించుచున్నదని భావము ప్రమేయములవలన సంవేదనము, సంవిదధీనముగా ప్రమేయములు కన్పించుటచే అపరోక్షానుభూతియందు సంవిత్సంవేద్యములకుగలవైలక్షణ్యము స్వాభావికమైనది కాదని తేలుచున్నది

ప్రమాతయొక్క నిజస్వరూప స్వభావావగతి నొసగుచు, ప్రమాతను పూర్తిగా సంతృప్తిపరచగల్గిన అనుభూతియే మహత్తరమగు అర్థముతోకూడిన అపరోక్షానుభూతియని చెప్పవచ్చును. ప్రమేయ సంవేదనమున ప్రమేయమందుపహితమైన అర్థములేక భావము అభివ్యక్తమై ప్రతీయమానమగుచున్నది. ఇట్టి ప్రతీతిలోగల భావము ననుసరించి ప్రమేయానుశీలనము జరుగుచున్నది. అనగా ప్రమేయములను తనలో లీనముచేసికొనిన సంవేదనము నిజముగా వస్తుతంత్రమైనదని భావము.

ఏవం విధమగు అనుభూతిలో ప్రమేయమునకున్న స్థానమేమి? అపరోక్షానుభూతిలోగల ప్రమేయము మనలను సంతృప్తిపరచునది ఒక ప్రమేయము తదతిరిక్తవిషయ సంబంధమును కల్గియుండనపుడే ఇట్టి సంతృప్తి నొసగగలదు. కాని తదతిరిక్తవిషయ సంబంధము లేని ప్రమేయము నిరుపహితము, అద్వితీయమునగు తత్త్వము మాత్రమే కాగలదు. కావున ప్రత్యక్షగోచరమగు ప్రమేయము సమగ్రమై సంతృప్తిని పూర్తిగా కలుగజేయజాలకున్నది. ఈ ప్రమేయము నిజస్వరూపమున నభివ్యక్తము కాగానే దోషము నివారింపబడుచున్నది. ఒక ప్రమేయమును దర్శించునపుడితరవిషయ జాతముతో మన కింద్రియ సన్నికర్ష లేకపోయినను, ఇతరవిషయ సమూహమీ ప్రమే

యముతో సన్నిహిత సంబంధము కలియుండుటచే నీ ప్రమేయప్రతీతియందు ఆ విషయజాతము అనువృత్తముగా భాసించుచున్నది. ప్రమేయ మేకముగా ప్రతీయమానమగుచున్నను అన్యవిషయ సమూహము తత్సంబంధముచే సాక్షిప్తమగుచున్నది. ఇట్లాక్షిప్తమగు విషయావళి తద్విలక్షణముగా భాసించుటలేదు. కాగా జ్ఞానాకారమున అనువృత్తమగు నన్యవిషయ సమూహము ప్రమేయముతో ననన్యత్వము కలిగి ప్రతీయమానమగుచున్నది. ఇట్లు సహాకృత విషయమగు ప్రమేయము తదతిరిక్త విషయములతో నభిన్నముగా భాసించుట గలదు. తదతిరిక్త విషయాసంబంధము విషయ నానాత్వముపై ఆధారపడియుండుటచే నీ సంబంధము సాక్షిప్తముగా చేయుట ప్రమేయాస్తిత్వమున కవసరముకాదని సిద్ధమగుచున్నది. ప్రమేయ స్వభావముననే ప్రత్యక్ష ప్రతీతియోగ్యమగు పరిపోషముకలదు. కావుననే ప్రత్యక్ష ప్రతీతియందు విశేషముగాని సామాన్యముగాని అనుభూయమానముగుటలేదని, విశేష సామాన్యముల కాధారభూతమగు వ్యక్తియే ప్రతీయమానమగుచున్నదని కుమారిలభట్టు పలికినాడు.

ఏవం విధమగు ప్రతీతి అంతర్నిహిత జ్ఞానాభివ్యంజకము. మహత్తరమైన విషాదము సామాన్యమానవునకు కల్గినప్పుడతడు మరువతగని భావము నుచ్చరింపగల్గుచున్నాడు. అనగా ప్రజ్వలితమైన సంచారిభావము జ్ఞానరహితముగా ప్రవర్తించదు. భావోద్దీపన తీవ్రతమమైనకొలది అయత్న నిర్వాహితమగు భావాభివ్యక్తి కన్పించగలదు. కావున అభివ్యక్తమగు సంవేదనమున జ్ఞానము, ప్రత్యక్షావగతి కన్పించుచున్నవి. అందుచే జ్ఞానమునకు, అనుభూతికి ప్రాథమికావస్థగా అపరోక్షానుభూతిని గ్రహించరాదు.

ప్రత్యక్షప్రమయనగా చైతన్యమే అని వేదాంత పరిభాషాకారుడనినాడు. ఇది సమవాయాది సంబంధ రహితము. ఇందనుభూతమగునదియే తత్త్వము. అనగా సంవేదన సంవేద్యముల అనన్యత్వము ద్వారా తాత్త్వికజగత్తు సిద్ధించుచున్నది. దేశకాలోపహితుడగు ప్రమాత ఈ సంవేదనయందు కన్పించకపోవుటచే అపరోక్షానుభూతిని కేవలము పురుష వ్యాపార తంత్రముగా గ్రహింప వీలులేదు. ఇది సంవిత్సంవేదన మగుటచే కేవలము వస్తుతంత్రముగాగూడ స్వీకరింప వలనుపడదు. అపరోక్షానుభూతియందు ఆత్మానాత్మలు సమన్వితములై, అనన్యత్వ లక్షణ లక్షితములై కన్పించుచున్నవి. కావున అపరోక్షానుభూతిని తత్త్వానుభూతియని, నిరవయము, ఏకము, భేదాసంభిన్నము నగునది తత్త్వమని నిశ్చితమగుచున్నది. సంవేదనమున నవగతమగు ఈ త[illegible] సంవేదనాంతర్గతము, [illegible]ంవేదనమున కతీతముకూడ యని తెలియవలెను. ఆత్మానాత్మ లీతత్త్వము యొక్క భిన్నరూపములుగా మనకు భాసించుచున్నవి. ఈ భేదము సంవేదనమున నిరస్తమగుచున్నది. ఏవం విధమగు అభేదప్రతిపత్తియే అపరోక్షానుభూతియగు రసప్రతీతియందు ప్రతీయమానమగుచున్నది.

సమస్త విషయములు సంవిత్తున ప్రతిష్ఠితములగుటచే అసంవిదితములైన వాటికి అస్తిత్వము లేదని, విమర్శ శూన్యమగు సంవిత్ లేనేలేదని శివదృష్టి వ్యాఖ్యానావసరమున ఉత్పలుడు చెప్పినాడు. సంవేద్యము కానివిషయమున కస్తిత్వములేదు అనగా సంవిత్సంవేద్యమైనదే తత్త్వము. సంవేద్యమగు విషయ మనుభూతిలో గలదు. ఇట్టి విషయముద్వారా మనకు జ్ఞానము, అనుభూతి కలుగుచున్నవి. ఈ విషయము భావశూన్యము కాదు ప్రతివిషయము ఏదో ఒక భావము నభివ్యక్తము చేయుచున్నది. ఈ భావమా విషయస్వభావమున కుచితమైనదిగా గ్రహింపబడుచున్నది. ఇట్లు తెలియబడు భావము తత్త్వ నిర్దేశకమగును. కావున ప్రమేయము తత్త్వమును గూర్చి చెప్పుచున్నది. కాని ప్రతి ప్రమేయమునకు తత్తద్విశిష్ట స్వరూపముండుటచే నీ తత్త్వాభివ్యక్తి సమగ్రముగా, సంపూర్ణముగా కన్పించజాలదు. అందుచే ప్రతిప్రమేయము అన్యవిషయములతో సంవలితమైనట్లు భాసించుటగలదు. ఈ సంవలన సంయోగాది బాహ్యసంబంధముగాక, ఆంతరంగిక సంబంధమగుటచే వివిధవిషయములకు సమన్వయము కన్పించుచున్నది. ప్రతిప్రమేయము తదతిరిక్తవిషయాన్వితమగుటచే ప్రత్యక్ష ప్రతీతియందు ఇంద్రియార్థ సన్నికర్ష మాత్రమే కలదనరాదు. ఇంద్రియార్థ సన్నికర్షను తనలో నంతర్లీనముగా చేసికొనియున్న ప్రతీతి ప్రమేయము నంతర్లీనముగా చేసికొనియున్న తత్త్వమును తెలుపుచున్నది. కావున అహంకారము ఇదమునిదం రూపవస్తుగర్భమై సర్వలోక సాక్షికముగా గలదని పద్మపాదుడనినాడు. అపరోక్షానుభూతియందలి అస్మత్ప్రత్యయము ఉపాధి నిష్ఠవ్యక్తి నిర్దేశకము కాదు. ఇందలి సంవేదనము వికారాది పరిణామములుగల వ్యక్తినిష్ఠముకూడ కాదు. ప్రమాతృప్రమేయముల కభేదప్రతిపత్తిని చూపునట్టి ఈ యనుభూతి సంసర్గానవగాహి యగుటచే నిర్వికల్పక ప్రత్యక్ష మనబడుచు

న్నది. ఇంద్రియ గ్రాహ్యత్వాది వైశిష్ట్యముల కిచట యథేంద్రియ గోచరముగా అవగాహనలేదు. నిర్వికల్పక ప్రత్యక్షమున ఇంద్రియ గ్రాహ్యత్వాది ధర్మములు తత్తదాకారవశమున గాక జ్ఞానాకారముగా నవభాసించుటచే నిర్వికల్పక ప్రత్యక్షమును జ్ఞానమని యెంచవలెను. అనగా సంవేదనము(*Feeling*) జ్ఞానాకారమని, జ్ఞానమపరోక్షానుభూతి యనబడు నిర్వికల్పక ప్రత్యక్షమని సిద్ధమగుచున్నది.

ప్రత్యక్షప్రతీతియందు ఇంద్రియార్థ సన్నికర్ష గాక, ప్రమాతృభిన్నముగా ప్రమేయము భాసించుటయే ముఖ్యమని చెప్పితిమి. ప్రతి యనుభూతియందు ఇచ్ఛా జ్ఞానానందములు ప్రత్యేక ప్రత్యేకముగా భాసించవు. వీటి సంవలనము అనుభూతియొక్క ఆరంభదశయందు, అంత్యసమయమునకూడ కన్పించుచున్నది. అంత్యావస్థయందు విషయ నానాత్వము నిరస్తమగుచు సంవిన్నిజ స్వరూపస్వభావము లవగతము లగుచున్నవి. కావున ప్రమాణ చైతన్యము, ప్రమాతృ చైతన్యము, విషయావచ్ఛిన్న చైతన్యము అనువానికి అభేదమును జూపుచు, "ప్రమాతృ సత్తాతిరిక్త సత్తాకత్వ శూన్యత్వే సతి యోగ్యత్వం విషయస్య ప్రత్యక్షం" అని వేదాంత పరిభాషాకారుడు చెప్పగలిగినాడు. ఏవం విధమగు ప్రత్యక్ష ప్రతీతియే రస చర్వణయందు కూడ కన్పించుచున్నది.

ప్రత్యక్ష గోచరమగు విషయము నవగాహనము చేసికొని కావ్యరచనకు బయలుదేరుకవి నూతన విషయమును సృష్టించుటలేదు. ప్రతీయమాన విషయ నిష్ఠమగు భావమును లేక అర్థమును కావ్యరూపమున కవి అభివ్యక్తము చేయును. ఏతదభివ్యక్తికి కవి సాధనమగుచున్నాడు. ఇట్లుగాక కవియొక్క మనోగత భావము విషయములపై ఆరోపింపబడిన తర్వాత గల్గు అనుభూతియే కావ్యగతమగుచున్న దంటిమేని రసప్రతీతిని నిర్వచించుటయం దతిప్రయాసకు లోనగుచున్నాము. ప్రకృతిలో కన్పించు నదీపర్వత వన లతాదుల సౌందర్యము నారోపిత సౌందర్యమన జాలము కదా! ఈ సౌందర్యము తత్తద్వస్తు నిష్ఠమే కాని, ఆరోపితము కాదు. వస్తునిష్ఠమైన భావము సదాత్మకముగను, ధర్మముగను, సౌందర్యముగను అనుభూతిలో ప్రతీయమాన మగుచున్నది. కావున సౌందర్యమును సిద్ధస్వభావమని ఎంచవలసియున్నది.

సౌందర్యము సాక్షాదపరోక్షముగా ప్రతీయమాన మగుచున్నచో, రసచర్వణలోగల వివిధ విషయ సంవలనము, ఇంద్రియ గ్రాహ్యత్వాది ధర్మములు ఎట్లు ఆస్వాదింపబడుచున్నవి? వివిధ విషయ సంవలనము, ఇంద్రియ గ్రాహ్యత్వాది ధర్మములు లయ, స్వర, భాషాద్యుపాధులచే వచ్చునవి. కావ్యము భాషారూపమున నుండుటచే శబ్దము లింద్రియ గ్రాహ్యము లగుచున్నవి. ఇట్టి కావ్యము ననుపహితమగు రసము విభావాను భావాదుల సంవలనమును చూపుచున్నది. ఈ రెంటి ద్వారా కావ్య నిష్ఠమగు రసము ప్రతీతియోగ్య మగుచున్నది. అనగా సంసర్గావగాహియగు జ్ఞానమే కావ్యాస్వాదమున కలదు కాని నిర్వికల్పక ప్రత్యక్ష ప్రతీతికాదు అను ఆశంక కలుగుచున్నది.

రసచర్వణము శబ్ద వ్యాపారభావ మగుటచే శాబ్దీయని, అపరోక్ష సుఖాలంబన కలదగుటచే అపరోక్షాత్మికయని ఈ ఆశంకకు జగన్నాథుడు ప్రత్యుత్తర మొసగినాడు. శబ్దవ్యాపారమగు ఉపాధి ద్వారా రసమాస్వాదింపబడుటచే రసప్రతీతి శబ్దవ్యాపారమువలన కలుగుచున్నది. అట్టిచో శబ్దమను సాధనముద్వారా రసము లభ్యమగుచున్నదా? శబ్దము ద్వారా లభ్యమగుచో రసము అనుమాన ప్రమాణ గ్రాహ్యమగునని కొందరెంచినారు. శబ్దప్రమాణము ప్రత్యక్ష ప్రమాణముకంటె అత్యంతము విలక్షణమైనదా? రసచర్వణను అపరోక్షాత్మకముగా చెప్పుచు "తత్త్వమసి" అను నుపనిషద్వాక్యమున కర్థము చెప్పినట్లు కావ్యమునకుగూడ చెప్పవలెనని జగన్నాథుని వాదము.

"తత్త్వమసి" యనగా "నీవా బ్రహ్మవు" అని అర్థము. "నీవు" అను ప్రమేయము ప్రత్యక్షగోచరము. "నీవా బ్రహ్మవు" అనునప్పుడు ప్రత్యక్ష ప్రతీతి లేదా? ఇంద్రియార్థ సన్నికర్షజన్యజ్ఞానమే ప్రత్యక్షమనిన బ్రహ్మయను విషయముతో నీ సన్నికర్ష లేకపోవుటచే నిది ప్రత్యక్షజ్ఞానము కాదనవలసి వచ్చును. కాని భ్రమజ్ఞానమున ఇంద్రియార్థ సన్నికర్షయున్నను తత్త్వజ్ఞానము కలుగుటలేదు. ప్రత్యక్ష జ్ఞానము ఇంద్రియార్థ సన్నికర్షపై ఆధారపడక, యోగ్యత్వలక్షణ లక్షితమని చెప్పవలెను. యోగ్యత్వమున నింద్రియార్థ సన్నికర్ష ఒక అంశము. పైగా ప్రమాతృ ప్రమేయములకు గల అభేద ప్రతిపత్తి పూర్వకము ప్రత్యక్ష ప్రతీతియని విస్మరించరాదు. "నీవా బ్రహ్మవు" అనునప్పుడు "నీవు" అను ప్రమేయమునకు "బ్రహ్మ" అను విషయమునకు నభేదము ప్రతీయమగుచున్నది. "నీవు" అనబడు ప్రమేయము

వాస్తవ ప్రమాత. కాగా 'తత్, త్వం' శబ్దముల కభేదము సిద్ధించుచుండుటచే నిది ప్రత్యక్షజ్ఞానమే యని చెప్పబడవలెను.

శాబ్దజ్ఞానము వాక్యమునుండి వచ్చుచున్నది. పదసంసర్గవలన వాక్యముత్పన్నమగుటచే శాబ్దజ్ఞానము సంసర్గావగాహియగు సవికల్పకము కాదా? సవికల్పకజ్ఞానము ఆనుమానికమగుటచే శబ్దసంసర్గికల కావ్యమునగూడ రసమానుమానికముగా అవగతము కాదా? అను ప్రశ్నలను వివేచింపవలసియున్నది.

పదార్థసంసర్గవలననే వాక్యజన్యజ్ఞానము కలుగుచున్నదని యెంచ వీలులేదు. పదార్థసంసర్గనే నమ్మితిమేని భోజన సమయమున 'సైంధవమును' గుఱ్ఱమును తెచ్చి పెట్టవలసి వచ్చును. సైంధవమును కోరినవాడే ఉద్దేశముతో నే సందర్భమున, సైంధవ శబ్దము నుపయోగించినాడో తెలిసిన గాని "సైంధవమును తెమ్ము" అను వాక్యమున కర్థము చెప్పలేము. అనగా వాక్యజన్య జ్ఞానము తాత్పర్యనిష్ఠము. తాత్పర్యమును తెలిసికొనుటచే వాక్యజ్ఞానము సంసర్గావగాహి కాకుండా అవగతమగుచున్నది. ఇట్టి తాత్పర్యజ్ఞానమును అఖండార్థమందురు. సంసర్గశూన్యమై, సమ్యగ్ జ్ఞానహేతువైన వాక్యమున అఖండార్థము ప్రతీయమానమగుచున్నదని చిత్సుఖుడు పలికినాడు.

రసప్రతీతిలో కూడ సంసర్గాసంగియగు నిర్వికల్పక ప్రత్యక్షజ్ఞానము కలదు గనుక "సత్త్వోద్రేకాదఖండ స్వప్రకాశానంద చిన్మయః" అని విశ్వనాథుడనినాడు. సత్త్వోద్రేకము కలుగగా కావ్యగతమగు నఖండార్థము స్వసంవిత్ప్రకాశానందమయమై రసముగా ప్రతీయమానమగుచున్నది. ఆత్మానాత్మలకు కలుగు అభేదప్రతిపత్తి అలౌకికము, సంసర్గశూన్యము నగుటచే అఖండమగుచున్నది. తద్ద్వారా విషయాభేదమును గ్రహించిన ప్రమాతకు స్వాత్మావేశము కలుగును. ఈ స్వాత్మావేశమునకు సాధారణీకరణ భావనా వ్యాపారవశమున సిద్ధించుచున్నది. అనగా మన యనుభూతులు వస్తుతః సంసర్గ రహితములని భావము. కావున నటుని ప్రవృత్తిని నటుని ప్రవృత్తిగా గాని, దుష్యంతాది పాత్ర ప్రవృత్తిగా గాని, మనప్రవృత్తిగా గాని స్వీకరించుటలేదు. రసాస్వాదమున విభావాదుల పరిచ్ఛేదము కన్పించదు. దీనితోబాటు ప్రమాతృ ప్రమేయముల కభేద ప్రతిపత్తి కలదు. ఈ యభేదము చైతన్యనిష్ఠమై అపరోక్షముగా అనుభూయమానమగుచున్నది.

## 3

రసము సాక్షాత్తుగా ప్రతీయమానమగుచున్నదగుటచే జ్ఞాప్యము కాజాలదు. విభావాదులవగతములైన తర్వాత కూడ రసమనుభూతమగుటచేతను, రసముచే నుజ్జీవితములగుటచేతను, విభావాదులు రసనిష్పత్తి హేతువులు కాజాలవు; విభావాదులు ప్రత్యక్షాది ప్రమాణములవంటి సాధనములు కాకపోవుటచే రసమునకు జ్ఞప్తిహేతువులు కావు అని అభినవగుప్తుడనుచున్నాడు. సిద్ధస్వభావము కలిగిన రసము స్మృతిపై ఆధారపడునది కాదు. విభావాదులు నశించినను రసము నశించకపోవుటచే రసము కార్యము కాదు. కావున విభావాది సమూహాలంబనాత్మకమైనది రసమని విశ్వనాథుడనినాడు. అసంవేదన కాలమున రసమున్నదని చెప్పలేము. రసము భ్రమజ్ఞానమని యనలేము. లౌకిక వ్యవహారమున మన ముపయోగించు నిత్యానిత్యాది శబ్దములతో రసమును నిర్వచింపవీలులేదు. అనుభూతమగు రసమును అనిత్యమనలేము. అసంవేదన కాలమున రసమును నిత్యమనలేము. సంసర్గరహితమైనదగుటచే సవికల్పకముగాని, ఆనుమానికముగాని కాజాలదు. విభావానుభావ వ్యభిచారి సంయోగము కల్పించుటచే రసప్రతీతి లౌకిక నిర్వికల్పక ప్రత్యక్షమువంటిది కూడ కాజాలదు. కావున రసము అనిర్వచనీయమని చెప్పవలసివచ్చుచున్నది.

కావ్యగత రసప్రతీతిలో కన్పించు అపరోక్షానుభూతియందు శబ్దములు కలవు. లౌకిక వాక్యమున సంసర్గ సహితములుగా వర్తించు శబ్దములకిచట తద్విలక్షణమగు ప్రవృత్తి కలదు. కావ్యగత శబ్దములు భావనా సమున్మిషితములగుటచే నీ వైలక్షణ్యము వచ్చుచున్నది. ఈ భావనా వ్యాపారమును గుర్తించిన భట్టనాయకుని వాదము విచారణీయము.

భట్టనాయకుడా రసము ప్రతీయమానమగుటలేదు, ఉత్పాద్యము కాదు అభివ్యజ్యమగుటలేదు అని యనుచున్నాడు. స్వగతముగా రసము ప్రతీతమైన కరుణరస ప్రదర్శనలో మానవునకు దుఃఖము కలుగవలెను. కాని సీతాది విభావములులేని సామాజికునకీదుఃఖము కలుగనేరదు. సీతయొక్క దుఃఖమును గాంచు సామాజికునకు స్వకాంతా స్మరణము కలుగకపోవుటచే స్మృతివలన దుఃఖము కలుగుచున్నదని చెప్పలేము. దేవతాది పాత్ర లభినయింపబడునపుడు దేవతలకు మానవులకెంత వైలక్షణ్యముండవలెనుగనుక సాధారణీకరణము కూడ కలుగనేరదు. ఇట్లే హనుమంతుని సముద్రలంఘనమున

కూడ సాధారణీకరణ ముండజాలదు. వాస్తవముగా తానే రాముడనను స్మృతికూడ సామాజికునకు లేదు. శబ్దానుమానాదులద్వారా రసప్రతీతి కలదని చెప్పుట శాస్త్రవిరుద్ధము, అనుభవవిరుద్ధముకూడ. సామాజికు డభినయమగు సీతాపాత్రతో నభిన్నుడై సీత యొక్క దుఃఖమును ఉత్తరరామచరితలో ననుభవింప గలుగుచున్నాడు. సముద్రలంఘనాదిక మొనర్చు హనుమంతునితో సామాజికునకు కలుగు అభేదప్రతిపత్తి ఎట్లు సిద్ధించుచున్నదో చెప్పవలసియున్నది. కేవలము స్వగతముగా రసప్రతీతియున్న లజ్జ, జుగుప్స, స్పృహాఅను మనచిత్త వృత్తులు రసప్రతీతి కాటంకములను కల్గించకలవు

రసము పరగతముగా, అనగా నటగతముగా గాని కావ్యగతముగా గాని ప్రతీతమైనదనిన, ఈ రసము మనలో భావస్పందము తీసికొని రాజాలదు. మనము రసభావోద్రిక్తులము కాజాలము. కాని సామాజికున కిట్టి ఉదాసీనావస్థలేదు. రసభావోద్రిక్తులము కావలెనని ప్రదర్శింపబడు రసావస్థ మనదే యియుండవలెను. సమగ్రముగా, యోగ్యముగా రసము అనుభూతము కావలెనని ఈ రసావస్థ మనది కారాదు. అనగా రసప్రతీతియందు ప్రమాతృ ప్రమేయాది వ్యవస్థ తొలగిపోవుచున్నదని గ్రహించవలెను. కాని ఎందుచే నీ వ్యవస్థ తొలగిపోవుచున్నదో చెప్పవలసిన బాధ్యత సమీక్షకునిపై గలదు.

దోషాభావము, గుణాలంకారమయమునగు కావ్యమున. చతుర్విధాభినయరూపమగు నాట్యమున, నిబిడమగు నిజమోహ సంకటతా నివారణకారియగు విభావాది సాధారణీకరణాత్మకముగా రసము అభిహితమగుచున్నది. అభిధారూపమునన్న రసము భావకత్వ వ్యాపారముద్వారా భావింపబడుచున్నది. అనగా భావనా వ్యాపారవశమున భావ్యమానమగుచున్నది. భావనావ్యాపారమువలన పాత్రలతో సామాజికునకభేద ప్రతిపత్తి కల్గుచున్నది. విభావాదులీ భావనచే సమున్మిషితములై రసమునకు స్వగతత్వ ప్రతీతిని గాని, పరగతత్వ ప్రతీతిని గాని ఇవ్వజాలక తదతీతమగు అనుభూతిని ఒసగుచున్నవి. ఈ యనుభూతి అనుభవ స్మృత్యాది విలక్షణము. ఈ యనుభూతిలో చిత్తమునగల రజస్తమో గుణములు సత్త్వగుణముగా పరిణమించుచు, చిత్తద్రుతి, చిత్తవిస్తృతి, చిత్తవికాసము అనువానిని క్రమక్రమముగా తీసికొని వచ్చుచున్నవి అప్పుడు కలుగు సత్త్వోద్రేకమున ప్రకాశానందమయము, నిజసంవిద్విశ్రాంతి లక్షణము, పరబ్రహ్మాస్వాదసదృశమునగు రసభోగము కల్గుచున్నది. ఇట్టి రసభోగ మలౌకికము, లేక లోకోత్తరము.

ద్రవీభూతమగు చిత్తము ఆర్ద్రభావముతో నుండగా హృదయసంవాదము కల్గును. అప్పుడు ప్రమేయముతో తాదాత్మ్యము పొందగోరు చేతోరూపము చిత్తద్రుతి యనబడును. ఉపహిత వ్యక్తిత్వమీ యవసరమున పొందు అనుపహిత స్వరూపము చిత్తవిస్తార మనబడును. ప్రమేయముతో నభేద ప్రతిపత్తి కలుగగా సిద్ధించు ఆత్మవిశ్రాంతిని చిత్తవికాస మందురు. ఈ అవస్థాత్రయమున అనుస్యూతముగా భావనావ్యాపారము గలదు చిత్తద్రుతియందు గల తమోగుణము భావనద్వారా రజోగుణములోనికి పరిణమించి చిత్తవిస్తారమును తెచ్చును. ఈ రెండును సత్త్వగుణములోనికి పరిణమించగా కలుగు చిత్తవికాసమున రసభోగము కలదు. ఇట్టి రసభోగము పరబ్రహ్మాస్వాదము వంటిదని భట్టనాయకుడు పలికినట్లుగా అభినవగుప్తుడు, విశ్వనాథుడు సూచించుచున్నారు. కాని "సత్త్వోద్రేక ప్రకాశానందమయ సంవిద్విశ్రాంతి సతత్త్వేన భోగేన భుజ్యతే" అని భట్టనాయకుని మతమును మమ్మటుడు తెలుపుచున్నాడు. సత్త్వోద్రేకమున ప్రకాశానందమయము, సంవిద్విశ్రాంతి లక్షణమునగు రసభోగము కలదని భావము. ఈ రసభోగమునకు పరబ్రహ్మాస్వాదమునకు భేదము లేదని స్పష్టమగుచున్నది

## 4

భట్టనాయకుడు రసప్రతీతిని అంగీకరించక రసభోగమును గురించి పల్కుచున్నాడు, కాని రసప్రతీతిలో భావనా వ్యాపారము కలదని అంగీకరించితిమేని రసభోగమునకు రసప్రతీతికి వైలక్షణ్యము కన్పించదు. ప్రతీతి, భోగము, రసన, ప్రతిభానము, చర్వణ, ఆస్వాదన, అనుభూతి యనునవి పర్యాయపదములు.

అప్రతీత వస్తువు వ్యవహారయోగ్యము కాకపోవుటచే రసము ప్రతీతమని గ్రహించక తప్పదు. ప్రతీతియనగా ద్రుతి, విస్తర, వికాస స్వరూపము గలిగిన భోగీకరణమే అగుచున్నది. భట్టనాయకుని మతమున అభిధా, భావనా, భోగీకరణము అని మూడు వ్యాపారములు కలవు శబ్దార్థాలంకారములతో నున్న కావ్యము అభిధారూపము నందుచున్నది. భావనావ్యాపారముచే భావ్యమానమగు నీ యభిధారూపము శృంగారాదికముగా భాసించును అప్పుడు భోగీకరణరూపమున నీ రసము లనుభవింపబడుచున్నవి.

ఈ భోగీకరణము రసమున కవసరము. కాని ఎన్ని రసములున్నవో అన్ని భోగీకరణము లున్నవని యెంచరాదు. ఇట్లే రజస్తమోగుణములకు సత్త్వగుణముతో నంగాంగిభావ మనేకవిధముల నమ్ముచున్నదని కూడ ఎంచరాదు. ఒక్కొక్క గుణము నాధారముగా చేసికొని ఒక్కొక్క అంగాంగి భావమే రాగలదు గనుక ద్రుతి, విస్తర, వికాసములను మూడు రూపములే చెప్పబడినవి. కావున భోగీకరణ స్వభావము లనేకవిధములని, సత్త్వాదిగుణముల కనంతమగు అంగాంగి భావము కలదని, అభినవ గుప్తుడీ వాదమున నెంచిన దోషములు దోషములు కావని స్పష్టమగుచున్నది.

కావ్యానుశీలనమున రసములు భావింపబడు చున్నవని భట్టనాయకుని వాదము విభావాది సంయోగముచే జనియించు చర్వణాత్మకమైన ఆస్వాదరూపప్రత్యయగోచరతాపాదనమే భావనాశబ్దమున కర్థము. సాధారణీకరణమున కతి ముఖ్యమగు నీ భావనావ్యాపారముద్వారా రసభోగము కల్గుచున్నదను భట్టనాయక వాదమునే రసమభివ్యఙ్గ్యమగుచున్నదని అభినవగుప్తుడు చెప్పుచున్నది. అనగా భట్టనాయక, అభినవ గుప్తుల వాదములలో భిన్నభిన్న శబ్దములు మాత్రమే కన్పించుచున్నవిగాని భిన్నార్థము కన్పించుటలేదు. పైగా ముఖ్యమగు భావనా వ్యాపారమును రసచర్వణయం దంతర్లీనముగా నున్నట్లు గ్రహించిన అభినవగుప్తుని వాదము కన్న, భావనావ్యాపార ప్రాధాన్యమును విశదీకరించు భట్టనాయకుని మతము వ్యాజనాదరణీయము. అభివ్యఙ్గ్యమగు రసమును భావనావ్యాపారము లేకుండా ఆస్వాదించజాలము అని గుర్తించుకొనవలెను

విభావాదుల సంసర్గవలన సన్మాత్రవిమయమై, అద్వితీయముగా రసమున్నదని భట్టనాయకాభినవ గుప్తులిరువురును అంగీకరించుచున్నారు. సంవేదనముగా నభివ్యఙ్గ్యమగుచు, స్వపరసంవిత్తి గోచరమైన ఆస్వాదనాత్మకమగు అనుభవమే రసమని, ఈ రసమే కావ్యార్థమని భట్టనాయకుడు అంగీకరించుచున్నాడు. భరతుడు సహితము "కావ్యార్థాన్ భావయంతీతి భావాః" అనినాడు. పదార్థ వాక్యార్థములు రసములయందు పర్యవసితము లగుచున్నవి. కావున రసములు కావ్యార్థములుగా చెప్పబడినవి. రసములు కావ్యగతశబ్దములచే నర్థింపబడునవగుటచే కావ్యార్థము లనబడుచున్నవి. స్థాయిసంచారిణులగు భావములు రసము నభివ్యక్తము చేయునవి స్థాయిసంచారి భావములచే ఆస్వాద్యమగు నలౌకికార్థము నిర్వర్తింపబడుచున్నది. ఇందు మొట్టమొదట మన కవగతమగునవి స్థాయ్యాది భావములు. పూర్వాపర గమ గోచరీభూతమగు స్థాయ్యాదికము ఉత్తరభూమికాభాగి, ఆస్వాద్యము నగు రసమునకు భావకమగుటచే స్థాయ్యాదికమును రస నిష్పాదకముగా వ్యవహరించుచున్నాము.

## 5

కావ్యగతశబ్దము చెవిని బడగానే విమల ప్రతిభానశాలి యగు హృదయముగల సహృదయునకు విశిష్ట ప్రతిపత్తి కలుగుచున్నది. మృగయావ్యాపారమున లేడిని వర్ణించు దుష్యంతవాక్యము నుదాహరణగా గ్రహించి కావ్యప్రతీతి యెటులుండునో విచారింతము.

“గ్రీవాభఙ్గాభిరామం ముహు రనుపతతి
స్యన్దనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టః  పతన భయా
ద్భూయసా పూర్వకాయమ్
దర్భైరర్ధావ  ః శ్రమవివృతముఖ
భ్రంశిభిః  ర్ణవర్త్మా
పశ్యోదగ్ర ప్లుతత్వా ద్వియతి బహుతరం
స్తోకముర్వ్యాం ప్రయాతి.”

“మెడను వంచుచు మనోహరముగా నుండి మాటిమాటికి వెనుకకు రథముపైకి దృష్టిని నిల్పుచున్నది. బాణము పైన పడునను భయమువలన శిరోభాగము నధికముగా అపరకాయమున ప్రవేశింప జేయుచున్నట్లున్నది. అలసిపోవుటచే తెరచుకొనిన నోటనుండి సగము నములబడిన దర్భలు జారిపడుటచే మార్గము దర్భలతో నాకీర్ణమైనది. ఉదగ్రప్లుతి కల్గియుండుటచే ఆకాశమున నెక్కువకాలము భూమిపై స్వల్పకాలము పరుగెత్తుచున్నట్లు కన్పించుచున్నది” అని దుష్యంతుడు సూతుని హరిణగమనమును చూడు మనుచున్నాడు.

ఈ శ్లోకమున వాక్యార్థప్రతిపత్తి కల్గిన తర్వాత మానస సాక్షాత్కారాత్మక మగు ప్రతీతి కల్గుచున్నది. శ్లోకముచే నుపాత్తమైన దీ . ఈ ప్రతీతిలో హరిణము భాసించుచున్నది. ఈ హరిణము భయావిష్టమై కన్పించుచున్నది. రంగస్థలమున కన్పించు హరిణాదికము భావనా సమున్మిషితమైనదగుటచేతను, లౌకిక భయవిలక్షణముగా హరిణము భీత

మని భాసించుటచేతను, దేశకాలాద్యుపాధి రహితముగా నీ భయము మన ప్రతీతిలో కన్పించుచున్నది. లౌకిక జగమున కన్పించు సింహము మనలో భయము నుద్దీపించగలదు. కాని భావనాసంవలితమైన సింహము కావ్యజగమున కన్పించినచో ఈ భయము కలుగుట లేదు. ఇట్లే కావ్యగత హరిణము భావనా వ్యాపారవశమున లౌకికహరిణముకంటె విలక్షణముగా కన్పించుచున్నది. ఇందుచే "నేను భీతిగల్గినవాడను, ఇది భయముతోనున్నది, వీడు శత్రువు, వాడు స్నేహితుడు, ఇతడు మధ్యస్థుడు" అని మొదలుగాగల అనుభూతులు కావ్యజగమున లౌకిక విలక్షణములుగా కన్పించుచున్నవి. ఇట్లే సుఖదుఃఖాదికమువలన వచ్చు విఘ్నములుకూడ కావ్యప్రపంచమున కన్పించవు. కావున పై శ్లోకమును వినినతర్వాత నిర్విఘ్న ప్రతీతిగ్రాహ్యమగు భయానక రసము సాక్షాత్తుగా హృదయమును ప్రవేశించినదో యనునట్లు కన్నులముందు మెరపువలె మెరయుచు ప్రతీయమానమగుచున్నది. ఇట్టి భయమున స్వాత్మావేశము కలుగుటచే సాధారణీకరణము వచ్చుచున్నది. ఈ భయానకమున సాక్షాత్కారాయమాణ పరిపోషితమగునది నటాది సామగ్రి దేశకాల ప్రమాత్రాది నియమములు భావనా వ్యాపారవశమున తొలగిపోగా సాధారణీ భావము సిద్ధమగుచున్నది. ఈ సాధారణీభావము హృదయ సంవాదనిష్ఠము. అనాది వాసనాచిత్రీకృతమగు చిత్తములు గల మానవులకున్న వాసనా సంవాదవశమున సామాజికుల కందరకు నద్వితీయ ప్రతిపత్తి కల్గుచున్నది. ఇట్లు నిర్విఘ్న స్వసంవేదనమున రసపరిపోషము కలుగుచున్నది. ఈ నిర్విఘ్న సంవిత్ చమత్కారమనబడుచున్నది. చమత్కార శబ్దమునకు అద్భుత భోగాత్మ స్పందావేశరూపమని అర్థము. ఈ భోగావేశమున తృప్తి, విశ్రాంతి కలవు

సాక్షాత్కార స్వభావమగు రసప్రతీతిని ప్రతిభావమని యందురు. ఆస్వాదాత్మక ప్రతీతిలో రసము భాసించుచున్నది. విశేషాంతరానుపహితమగుచు రసనీయమగు నీయాస్వాదము లౌకికముగాని, లౌకికతుల్యముగాని, తదారోపాది రూపముగాని, మిథ్యగాని, అనిర్వచనీయముగాని కాజాలదు. ఏవంవిధమగు రసమును రసనాత్మక వీతవిఘ్న ప్రతీతి గ్రాహ్యమగు భావమని చెప్పవలెను. సకల విఘ్నవినిర్ముక్తమగు సంవిత్తును చమత్కారము, నిర్వేశము, రసన, ఆస్వాదనము, భోగము, సమాపత్తి, విశ్రాంతి అని మొదలుగాగల శబ్దములతో వ్యవహరించుచున్నాము.

శంకుకుడు మొదలగు సమీక్షకులు విభావాది ప్రత్యాయ్యమానమగు స్థాయిభావమే రసనీయము కాగా రసమనబడుచున్నదనినారు. ఈ వాదము యథార్థమైనచో లౌకికానుభూతులయందు కూడ రసప్రతీతి యుండకతప్పదు. స్థాయియే రసమనినచో, రసమను విశిష్టవిషయము లేదని, రసమునకభావరూపము కలదని, రసప్రతీతి యనినచో నభావవిషయ ప్రతీతి యని చెప్పవలసివచ్చును. కావ్యమున స్థాయిప్రతీతియే కలదని, ఈ ప్రతీతి అనుమానికముగా కల్గుచున్నదని చెప్పవలెను కాని ఇది భరతమునికసమ్మతమగు వాదమగుటచే రస నిష్పత్తిసూత్రమున స్థాయిశబ్దము చెప్పబడలేదు. రససూత్రమున స్థాయిశబ్దముచ్చరింపబడినచో శల్యభూతము కాగలదు. కావుననే స్థాయిభావము రసముగా పరిణమించుచున్నదను వాక్యమును ఔపచారికముగా గ్రహించవలెను గాని వాస్తవికముగా గాదు. అలౌకిక చమత్కారాత్మయగు రసాస్వాదము స్మృతి, అనుమానము లౌకిక స్వసంవేదనములకంటె విలక్షణమైనదని భావము

లౌకిక చిత్తవృత్త్యనుమానముద్వారా రసప్రతీతిని నిర్వచించు శంకుకునివాదమున రసత్వమే మాయమగుచున్నది. లౌకికానుమాన సంస్కృతుడగు సామాజికునకు ప్రమాదాదులు తాటస్థ్యముగా ప్రతీయమానములగుటలేదు. అనుమాన స్మృత్యాద్యుపకరణముల సహాయము లేకుండా, హృదయ సంవాదాత్మకమగు సహృదయత్వవశమున, సముద్గమగుచున్న రసాస్వాదాంకురీ భావనతో, తన్మయీభవనోచితమైన చర్వణయందు సామాజికునకు రసప్రతీతి కలుగుచున్నది. కావ్యానుశీలనమునకు ముందు రసచర్వణ మనలో యున్నచో తత్స్మృతి కావ్యావలోకనమున కన్పించవలెను రసచర్వణ లౌకిక ప్రత్యక్షాది ప్రమాణముల నపేక్షించదని, అలౌకికవిభావాది సంయోగవశమున వచ్చునదని తాత్పర్యము. ప్రత్యక్షము, అనుమానము, ఆగమము, ఉపమానము మొదలుగాగల ప్రమాణములద్వారా కలుగు రత్యాద్యవబోధముకంటె విలక్షణమైనది రసచర్వణ. సకల వైషయికోపరాగ శూన్యమై, శుద్ధ పరయోగిగతమగు స్వానందైకఘనానుభవముకంటె కూడ నిది విలక్షణమైనది. రసప్రత్యక్షము యోగిప్రత్యక్షము వంటిది కూడ కాదు. రసప్రత్యక్షము కంటె భిన్నములగు అనుభూతులయందు విషయావేశ వైవశ్యము కలుగుటచే సౌందర్యము చర్వ్యమాణమగుటలేదు. రసప్రత్యక్షమున స్వగతపరగతత్వ నియమము లేకపోవుటచే విషయావేశ వైవశ్యము కలుగదు. పరగతత్వ

నియమము లేకపోవుటచేతను, స్వాత్మాను ప్రవేశముండుటచేతను తాటస్థ్యస్ఫుటత్వము కలుగదు. విభావాది సాధారణ్యవశమున సంప్రబుద్ధమగు యోగ్యనిజరత్యాది వాసనావేశ వశమున విఘ్నరహితమగు ప్రతీతి కలుగుచున్నది కావున రసమునకు విభావాదులు నిష్పత్తిహేతువులుగాగాని, జ్ఞప్తిహేతువులుగాగాని కాజాలవు. రసచర్వణ కుపయోగించు విభావాదు లలౌకికములని గ్రహించవలెను.

ఇట్లైచో రస మప్రమేయము కాదా? అను సంశయము కలుగవచ్చును. కాని రస్యైకైక ప్రాణమగు రసమున ప్రమేయాది స్వభావ ముండజాలదని మరువరాదు. విభావాదుల సంయోగమువలన రసనిష్పత్తిని చెప్పునపుడు రసవిషయకమగు రసనాపరముగా నిష్పత్తిశబ్దమును వ్యాఖ్యానించవలెను. ప్రమాణవ్యాపారముగా గాని, కారకవ్యాపారముగా గాని రసనాశబ్దమున కన్వయము కుదరదు. స్వసంవేదన సిద్ధమగుటచే రసనావ్యాపారము నప్రామాణికమని త్రోసివేయలేము. విభావాద్యుపాయము లలౌకికములగుటచే రసనావ్యాపారమున కలౌకిక బోధరూపమును చెప్పవలెను. కాగా విభావాది సంయోగవశమున రసనావ్యాపారము బయలుదేరునని, రసనాగోచరముగా నిష్పద్యమానమగు లోకోత్తరమైన అరమే రసమని, రససూత్రమున గల తాత్పర్యమని నిశ్చయింపవలెను.

పై విచారణవలన తేలుచున్న సారాంశము నీరీతిగా సంక్షేపించవచ్చును ముకుట ప్రతిశీర్షకముల వలన నటునియందు నటబుద్ధి ఆచ్ఛాదింపబడుచున్నది. కావ్యబలముద్వారా నటునకు దుష్యంతాది పాత్రలతో నభేదము తీసికొని రాబడుచున్నను గాఢప్రాక్తన సంవిత్సంస్కారమువలన నటుని దుష్యంతునిగా మనము గ్రహింపలేకున్నాము. నట దుష్యంతులు దేశకాలోపహిత వ్యక్తులుగా నున్నంతవరకు నటుని దుష్యంతుడని వ్యవహరించజాలము. భావనావ్యాపారవశమున దేశకాల పరిత్యాగము జరుగుచున్నది. రోమాంచము మొదలగు సాత్త్వికభావములు రతి ప్రతీతికారులుగా కన్పించుచు దేశకాలోపాధిరహితమగు రతిని తెల్పుచున్నవి. తద్వాసనా వశమున నీ రతియందు స్వాత్మానుప్రవేశము కల్గుచున్నది. అందువలన తాటస్థ్యముగా గాని, నియతి కారణరూపమున గాని, నియత పరాత్మైకగతముగా గాని, రత్యవగతము కలుగుట లేదు. కాని భావనావ్యాపారముచే వచ్చు సాధారణీకరణ వశమున రత్యవగమము కలదు. విభావ ప్రాధాన్యముగను, అనుభావ ప్రాధాన్యముగను, వ్యభిచారిభావ ప్రాధాన్యముగను, విభావాది సర్వప్రాధాన్యముగను, సాధారణీభావము వచ్చుచున్నది. కాని సమప్రాధాన్యముగా వచ్చు సాధారణీ భావముననే ఉత్కృష్టమగు రసాస్వాదము కలదు. ఇట్టి సమప్రాధాన్యము కావ్యమున గన్పించును. దశరూపకమున నిది విశేషించి కనపడుచున్నది.

కావ్యాభ్యాసప్రాక్తన పుణ్యాది హేతుబలము గల సహృదయులకు పరిమిత విభావాద్యున్మీలనము ద్వారా పరిస్ఫుటమై సాక్షాత్కారకల్పమగు కావ్యార్థము ప్రతీయమానమగుచున్నది. ఇట్టి సహృదయులకే కావ్యము ప్రీతి వ్యుత్పత్తిప్రదమగుటచే కావ్యానుశీలనమున హృదయము నిర్మలమగుచున్నది. అహృదయులకు సహితము కావ్యాస్వాదము నైర్మల్యధాయి యని పల్కినచో సహృదయుల విషయమును ప్రత్యేకించి చెప్పనక్కరలేదు. నాట్యమున గీతవాద్య గణికాదులకు నిత్యోపకరణత్వ మంగీకృతమగుటచే నటుని సహితము దుష్యంతాది పాత్రలతో నభేదము గలవానినిగా గ్రహింపవలెను.

జగమున నొక విషయమును దర్శించి దాని నభివ్యక్తము చేయువాడు కవి. అభివ్యక్తి యోగ్యత్వము విషయనిష్ఠమైనను ఆత్మచే సంస్కృతమానసమే దీని నవగాహన చేసికొనుచున్నది. ఏవంవిధ మానస సాక్షాత్కారము కావ్యముననే కన్పించగలదు. బాహ్యజగమున మెరపువలె క్షణికముగా భాసించు విషయము కావ్య జగమున తటిత్తుల్య ప్రకాశమును కోల్పోవుచు స్థాయిత్వమునందుచున్నది. కావున మహాకవి జగము ననుకరించడని విషయములం దుపహితముగానున్న భావములను సంవిద్రూపమున నభివ్యక్తము చేయుచున్నాడని సిద్ధమగుచున్నది. ఈతత్త్వాభివ్యక్తిలో జగమంతయు ఆధ్యాత్మిక తత్త్వముచే నున్మీలితమైనట్లు కన్పించగలదు.

విభావానుభావ వ్యభిచారి భావములు కావ్యమున గలవు. భావనా విశేష మహిమద్వారా వీటి సంయోగము సిద్ధమగుచున్నది. భావనా విశేషము సహృదయతా సహకృతము. బుద్ధీంద్రియములను సమన్వయపరచు నీసంయోగము అనుభూతి యోగ్యమగునే కాని సమగ్రముగా భాషారూపమున నుచ్చరింపబడజాలినది కాదు. దేశకాలోపహిత వస్తువులతో వనన్యత్వ సంబంధముగల భాష అనుపహితములగు లోకోత్తర విషయములను పూర్తిగా అభివ్యక్తము చేయుట కుపకరించదు. భావనావశమున ప్రతీయమానమగు రస మనుపహితమగుటచే, తదుచ్చారణయందు కవి

యొక్క శక్తి సఫలమగుటలేదు. సంవిత్స్వభావమగు రసమును భాషారూపమున గ్రథించునపుడు మంచుచున్న నిష్కారణమువలెనున్న మానసము తననుతానే దహించుకొనుచున్నది. అనగా మనోనిష్ఠమగు భావముయొక్క ఛాయయే భాషారూపమున రాగలదు. ఈభాషారూపమున నుపహితమైనభావము భాషయను నుపాధి కతీతమైనదగుటచే అనుపహితతత్త్వాభివ్యంజకమగుచున్నది. భౌతిక దేహమాత్మను ఎక్కువకాలము ధరించలేదు. కాగా ప్రతికావ్యమున భావన, వ్యంజన అను రెండు వ్యాపారములు అన్యోన్యసంవలితములై కన్పించుచున్నవి ఈవిధముగా రసప్రతీతి ఆధ్యాత్మిక ప్రతీతిగానికి పరిణమించుచు సమగ్రమగు నిజస్వరూప స్వభావములను పొందుచున్నదని "హెగెల్" (*Hegel*), "ఎఫ్. ఎచ్. బ్రాడ్లే" (*F. H. Bradley*) అను సమీక్షకులు చెప్పియున్నారు.

మానవుని యనుభూతి పరిచ్ఛిన్న విషయములతో సంబంధించియున్నది. అపరిచ్ఛిన్నమగు తత్త్వమును భావించునపుడు మనము దేశకాలాద్యుపహితమగు దృష్టిని సామాన్యముగా పరిత్యజించుటలేదు. ప్రతిభావమును పరిచ్ఛిన్నత్వ సంవలితముగానే గ్రహించగల్గుచున్నాము బ్రహ్మాదిశబ్దములు సహితము భాషారూపమున నుపహితములుగా కన్పించుచున్నవి. వస్తువులను, ప్రవృత్తులను మాత్రమే చెప్పగల భాషతో శబ్దమున నుపహితమగు భావము నభివ్యక్తము చేయవలెనన్న రూపకాలంకారమును గ్రహించి తీరవలెను. భాషారూపమున చేయబడు భావాభివ్యక్తియందు రూపకము (*Metaphor*) గోచరించి తీరుచున్నది రూపకమున బుద్ధీంద్రియముల కనన్యత్వముకలదు. ఇందలి ఇంద్రియ గ్రాహ్యత్వలక్షణము మానవస్వభావనిష్ఠమగుటచే మన ఆత్మలను సంతృప్తిపరచు ప్రతివిషయము బుద్ధీంద్రియములను సంతృప్తిపరచజాలియున్నది. రస ప్రతీతిలో నిందువలన నింద్రియగ్రాహ్యమగు రూపము, బుద్ధిగ్రాహ్యమగు భావముకలవు. ఈరూపము భావమున కుపాధి. భావము రూపము నున్మిషితము చేయుచున్నది. ఈయున్మేషము భావనావశమున కల్గుటచే బుద్ధీంద్రియములకు సమన్వయము కూర్చునది భావనయని చెప్పవలెను. కావున విశ్రాంతి లక్షణ లక్షితమై భావనాసమున్మీలితమగు అనుభూతి భాషారూపమున గ్రథితముకాగా కావ్యము ఉద్దిష్ట పురుషార్థమును వ్యంజితముగా చూపగల్గుచున్నది.

ఈవ్యంజనా వ్యాపారముయొక్క శక్తిని గమనింపవలెను. కావ్యమున వ్యంజింపబడుచున్న తత్త్వానుభూతి దేశకాల ప్రమాత్రాదులచే ననియంత్రితమైనది. తత్త్వమును పరిచ్ఛిన్న రూపమున నుపహితము చేయు కావ్యము రసమున కుపాధి. తత్త్వానుభూతిలోగల తత్త్వము బుద్ధీంద్రియములకు సంవిద్రూపమున సమన్వయము చూపునది. అనగా కావ్యము సంవిద్రూపముగా పరిణమించిన గాని కావ్యమున గల భావరూపముల పరస్పర వైలక్షణ్యవిరోధము శమింపదు. రసనిష్ఠమగు వ్యంజనద్వారా ఈ విరోధ ముపశమించుటచే శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావమగు సంవిదనుభూతి కల్గుచున్నది. కావున "ప్రమాత్రా స్వప్రకాశతయా వాస్తవేనాన్య స్వరూపానందేన సహ గోచరీ క్రియమాణః, ప్రాగ్వినివిష్ట వాసనారూపో రత్యాదిరేవ రసః" అని జగన్నాథుడనినాడు. భావనా సంవలితమగు వ్యంజనా వ్యాపారము ప్రవృత్తముకాగా, ఆత్మవిశ్రాంతి, విస్తృతి, వికాసములు కావ్యమున ప్రమాతయొక్క సంవిద్రూపములుగా నవగతములగుచున్నవి వాసనలనబడు సంస్కారములద్వారా నీయవగతి రత్యాదిరూపములను పొంది రసమని పిలువబడుచున్నది. భావనచే నుజ్జీవితమైన భాషయందున్న వ్యంజనవలన కావ్యగత రసమనుపహితముగా ప్రతీయమానమగుచున్నది. కావ్యగత రసమునకు భాషయే ప్రబలమైన ఉపాధి. ఈ ఉపాధి తత్త్వము నాచ్ఛాదించునదగుటచే ఆవరణశక్తియని పిలువబడుచున్నది. భావనానుప్రాణితమగు వ్యంజనావ్యాపార మీ ఆవరణశక్తిని భగ్నము చేసి అనుపహితమగు రసమును చర్వణాపాత్రముగా చేయుచున్నది. ఈరసము సంవిదభిన్నము. కావున భగ్నమైన ఆవరణగల చైతన్యమే రసమని జగన్నాథుడు పలికినాడు.

దీపము నాచ్ఛాదించుచున్న తెరను తొలగింపగా వస్తువులు ప్రకాశించుచున్నవి దీపముయొక్క ప్రకాశముకూడ తెలియబడుచున్నది. సంవిద్రూపమగు రసమునకూడ నిదే విధమగు ప్రతీతికలదు. ఆత్మయనబడు సంవిత్ లేనిదే ఏసంవేదనమును కలుగజాలదు. స్థాయిభావ నిష్ఠములుగా సమన్వితములైన విభావానుభావ వ్యభిచారిభావములు కన్పించుచున్నవి. స్థాయిభావములు సంవేదనశూన్యములై ప్రవర్తించజాలవు గనుక ప్రతి యనుభూతియు సంవిదధీనమని స్పష్టమగుచున్నది. దీపమువలన వస్తువులు ప్రకాశించునట్లు విషయములన్నియు సంవిత్ ద్వారా భాసించుచున్నవి. అనగా విభావాది సంవలితములగు రత్యాదిభావములను ప్రకాశింపజేయునది ఆత్మచైతన్యము. అంతఃకరణద్వారా ఆత్మచైతన్యము ప్రవృత్తమగుచు విషయావభాసకు హేతువగుచున్నది. అంతః

కరణధర్మములకు సాక్షిభాస్యత్వ మంగీకరింపబడుటచే నిచట అనుపపత్తి యేమియు లేదు. కాగా "భగ్నావరణా చిత్" అని నిర్వచింపబడిన రసము నాస్వాదించునపుడు బ్రహ్మానుభూతియే కల్గుచున్నదని చెప్పవలెను.

ఇంద్రియ గ్రాహ్యములగు రూపములు, బుద్ధిగ్రాహ్యములగు భావములు, సమన్వితములైనపుడు మాత్రమే అనుభూతియొక్క స్వభావ మవగతము కాగలదు. మహాకావ్య మీరెంటిని సమన్వయపరచుచు పారమార్థిక తత్త్వమును సౌందర్యమును రూపమున నుపహితము చేయుచున్నది. ఆత్మావలోకనమున పరిపుష్టమైన ఆత్మసంస్కారము కలిగినపుడే ఏవంవిధ కావ్య ముత్పన్నము కాగలదు. ఇట్టి కావ్యప్రతీతియందు వ్యావహారికజగము ఆధ్యాత్మికముగా భాసించును. అనగా రసప్రతీతిలో కన్పించు విషయముల స్థితి, ప్రకాశము, అర్థము మొదలగు నన్నియు సంవిదధీనములే అని భావము. విభావాదులకు రూపనిందువలననే సాక్షిభాస్యత్వమును జగన్నాథుడు చెప్పినాడు. సాక్షిభాస్యములగు విభావాదుల నిజస్వరూపము సంవిదభిన్నమని స్పష్టమగుచున్నది.

పైవిచారణవలన రసచర్వణ సర్వానుగ్రాహకమని, ఆత్మచైతన్య స్వరూపమని, బ్రహ్మాస్వాదాభిన్నమని నిశ్చితమగుచున్నది. రసోపాధులగు కావ్యాదుల ద్వారా రసచర్వణ ఉన్మీలితమగుచున్నది. ఉపాధి రూపమగు కావ్యము లేనిచో రసచర్వణ కలుగనేరదు. అనగా కావ్యాలోకముననే రసము కలదని కాదు. కాని కావ్యాది రూపములయందే రసముపహితమగుచున్నదని, ఉపహితమగు రసమే ప్రతీతి యోగ్యమని భావము.

రసవిషయమగు కావ్యము ననుశీలన చేయునపుడు స్థాయిభావముల ప్రవృత్తులద్వారా ఆత్మచైతన్య మభివ్యక్తమగుచున్నది. పారమార్థిక దృష్ట్యా ప్రమాతృప్రమేయాది సంబంధముల కతీతమైన ఈ ఆత్మచైతన్యము చిత్తవృత్తిద్వారా బహిర్గతమగుచున్నది. పారమార్థిక తత్త్వమున తన్నుదా విస్మరించుకొనునట్లు చేయు తన్మయీభవనమును తెలుపు ఈ చిత్తవృత్తి స్థాయ్యాదిచిత్తవృత్తులకంటె విలక్షణమైనది. కావున "విభావాది చర్వణామహిమ్నా సహృదయస్య నిజసహృదయతావశోన్మిషితేన తత్తత్ స్థాయ్యుపహిత స్వస్వరూపానందాకారా సమాధావివ యోగినశ్చిత్తవృత్తి రుపజాయతే, తన్మయీభవనమితియావత్" అని జగన్నాథుడనినాడు. సమాధియందు యోగికి కలుగు తన్మయీభవన రూపమగు చిత్తవృత్తివంటి చిత్తవృత్తి రసప్రతీతియందు సహృదయునకు కల్గుచున్నది.

ఈ తన్మయీభవనమున గల సంవేదనమునకు అంతఃకరణతో సంబంధమేమియు కన్పించదు. అనంతఃకరణరూపమగుటచే నిందలి ఆనంద మలౌకికమగుచున్నది. కాని ఈ ప్రతీతి తత్తత్ స్థాయ్యుపహితమై కన్పించుటచే "భగ్నావరణా చిద్విశిష్టమగు రత్యాది స్థాయిభావము రసము" అని అభినవగుప్తుడు, మమ్మటుడు మొదలగు వారనినారు. ఈ వైశిష్ట్యమును ఆత్మచైతన్యమున కాపాదించుట దుర్లభమగుటచే "రత్యాద్యవచ్ఛిన్నా భగ్నావరణా చిదేవ రసః" అని జగన్నాథుడు ప్రపంచించినాడు. రత్యాదులచే నుపహితమైన అనుపహిత చైతన్యమే రసమని తాత్పర్యము. ఈచైతన్యమే సౌందర్యమని, రసమని ప్రతీయమాన మగుచున్నది కావున రసప్రతీతికి బ్రహ్మానుభూతికి భేద మేమియు లేదని స్పష్టము. తైత్తిరీయోపనిషత్ బ్రహ్మస్థితిత్వమును గూర్చి చెప్పుసందర్భమున "రసో వై సః; రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" అని చెప్పుచు రసమే బ్రహ్మయని చెప్పుచున్నది. ఈ రసమే సౌందర్యమని, శాంతమని అందురు.

# శాంతినికేతన దృశ్యాలు

## లినోకట్ చిత్రాలు

శ్రీ వేలూరి రాధాకృష్ణ




చిత్రకుటీరం

ఒకే ఒక తాళవృక్షాన్ని ఆధారం చేసుకుని నిర్మించిన విచిత్రమైన కుటీరం.



ప్రార్థనా మందిరం

ప్రతి బుధవారం ఈ మందిరములో ప్రార్థనలు జరుగుతాయి.




శామొలి

గాంధిజీ శాంతినికేతనానికి దయశేసినప్పుడల్లా ఆయన విడిది చేసిన పవిత్రమందిరం.



వైతాళికులు

ప్రతిదినం వేకువజామున వైతాళికులు ప్రభాత సంకీర్తనం చేస్తారు



ఆమ్రకుంజము

ట్టప్రధానోత్సవాది నానా మహోత్సవాలూ జరిగే సుందరమైన రసాలవనం.

# * అంతరాత్మ *

## శ్రీ బలివాడ కాంతారావు

సాయం సమయం; క్రుంగిపోతూన్న దినకరుని యెర్రని చూపు...యింటిముందు తోటలో వాలుకుర్చీమీద ఒంటరిగా కూర్చున్న డాక్టరు కోదండరామయ్యమీద పడుతూనే మాయమైంది. వీచే చిరుగాలి పాటకి, హోరెత్తే అలల వాద్యానికీ, పూల గుత్తులతో వున్న కొమ్మలు తల లూపుతుంటే డాక్టరు తల సంతోషంగా వూగింది. తలెత్తిన ముఖానికి ఆకాశం అగుపించింది. ఆ నీలాకాశంలో అక్కడక్కడా చెదరి చెదరి ముక్కలు ముక్కలుగా సంచరించే తెల్లని మేఘాలను చూచి మోదంతో ముస్తాబవుతున్నాడు! అమ్మయ్యా! తీరుబడి యెరుగని జీవితానికి కోరుకున్న ప్రదేశంలో విశ్రాంతి ఈ వేళనుంచే మొదలైంది! ఇంత చక్కని యిల్లు...యింటి చుట్టూ మోదాన్ని గొల్పే ప్రదేశం...హాయినిచ్చే కమ్మని వాతావరణం.. ఇవన్నీ తను యీ వయసులోకూడా ఆనందించగలుగుతున్నాడు.—తనలో యౌవన రక్తపుఛాయలు సమసిపోలేదు. ఆనందంతో వుబ్బుతూ తనెంత అదృష్టవంతుడనని అనుకోకుండా వుండలేకపోయాడు.

చీకటి కొద్దికొద్దిగా వ్యాపిస్తోంది. తన హోదా, గౌరవమర్యాదలు, పేరుప్రతిష్ఠలు, తన కోరికలు కొనసాగిన వైనం, తన పిల్లల గొప్పతనం, చివరకు తన చెక్కు చెదరని ఆరోగ్యం...అంతా నెమరువేసుకొని మురిసిపోతున్నాడు! ఈ ఆత్మమోదంలో ఒక తలపు తన ఆలోచనలకి కొద్దిగా అంతరాయం కలిగించింది.. తన భార్య సంగతి...ఆత్మలో ఆత్మగా మెసలింది. తను యెంతంటే అంత!...ఆమె చనిపోయిన లోటు యిదివరకు తనకు అగుపించకపోయినా—ఆమె యిప్పుడు వుంటే యెంత బాగుండేది? రాను రాను ఆమెగురించి ఆలోచనలతో మెదడు నిండిపోయింది. తను యిన్నాళ్ళూ భార్యగురించి పలవరించకుండా యెలా వుండగలిగాడు?......చాలా సేపటివరకూ తన మీద తనే విసుక్కున్నాడు......ఆమె ఆరోగ్యం బాగా లేనప్పుడు స్థలం మార్చవలసింది. మద్రాసులో వున్న స్పెషలిస్టుకు చూపించవలసింది!...లేక బొంబాయి తీసుకవెళ్ళివుంటే బ్రతికేదేమో?! అప్పుడు తీసుకొన్న శ్రమ, జాగ్రత్త చాలా తక్కువ అనిపించింది ఈ విషయం అంతా తను ఇదివరకు యెందుకాలోచించలేదు? భార్యకు అనారోగ్యంగా వున్నప్పుడైనా తనకు తట్టలేదే! అలా తట్టకపోవటానికి, చనిపోయాక పలవరించకపోవటానికి కారణ మేమిటి? ఈ వృత్తిలో మునిగిపోయి ఇలా ఆలోచించటానికే తీరుబడి లేకపోయిందే! తన జీవితంలో యిదొక్కటే బాధ—మరే బాధలు నలుగురిలా తను అనుభవించలేదు.........ఇక అనుభవించ వనిపించింది...... సృష్ట్యాదినుంచీ చావుబ్రతుకుల మయమైన మార్పులేని మానవచరిత్రను మరిచిపోయినట్లుం దియన... తను యేం చేసుంటే భార్య బ్రతికుండేదోనని యింకా యింకా ఆలోచిస్తున్నాడు.

ఈ ఆలోచనలు భార్యను ఒక్కసారి చూడాలనే కోర్కెకు దారితీశాయి. లేచాడు...ముందుగదిలో తనూ భార్య కలసి తీయించుకొన్న ఫోటో ముందు నిల్చున్నాడు. నిల్చునే తదేకదృష్టితో మనసు లగ్నంచేసి చూస్తూంటే...ఆమె ఒంటిని సొంపుగాఉన్న నగలు...ఆ ఆరువందల రూపాయల పట్టుచీర...ఆ నవ్వుముఖం...నవ్వుతూ వెక్కిరించినట్లు...వెక్కిరిస్తూ యేదో ప్రశ్నించినట్లయింది... ఆ ప్రశ్న తన శరీరమంతటినీ మలేరియాజ్వరం వచ్చినట్లు చేసింది!...నిద్రలో పీడకల గాంచిన మనిషికి తెలివివచ్చినట్లయి ... అబ్బె - అబ్బె ... అనుకొని అక్కడనుంచి బయటకు వచ్చాడు. అంతా చీకటిగా వుంది. క్షణంక్రితం అందంగా కనిపించిన మేఘాలు, ఇప్పుడు అందమైన నక్షత్రాలను ఆకాశంలో కప్పేశాయి! సాయంసమయపు అరుణరేఖల్లో అల్లాడిపోయిన తరంగాలు భీభత్సంగా, నిశిలో హోరెత్తుతున్నాయ్. అందమైన ప్రకృతి మశిపులముకుని భూతంలా భయపెడుతున్నట్లనిపించింది! మళ్ళీ ధైర్యం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూంటే పిరికితనం హెచ్చవుతోంది! తన భార్య తనను వెక్కి

రించలేదే!! ఏమీ అనలేదే! తనకే ఆ తలపు వచ్చివుంటుంది! తనలా సంస్కారం చదువూ వున్నవాడికి ఇలాంటి పిచ్చిఆలోచన లేమిటి? పోనీ ఆ బంగారం కనీసం శృంగారంతో వున్నన్నాళ్ళయినా అనుభవించలేదా? ఏమి తీసుకపోయానని తన భార్య ఎలా అనగలుగుతుంది? అది బొమ్మ! తనే అలా అనుకున్నాడు! తనెందుకలా అనుకోవాలి? అయినా యిన్నాళ్లు లేనిది యిలాంటప్పుడు యీ ఆలోచన ఎందుకు రావాలి, పట్టి పిరికివాడ నయ్యాననుకుని వెళ్ళి మళ్ళీ ఫోటో ముందు నిల్చున్నాడు. చూసాడు! కన్నెర్ర చేసి చూశాడు. కాని మనసు బితుకు బితుకు మన్నట్లు తోచింది. ఆ బితుకుతోపాటు తనకు యిదివరకెన్నడూ లేని అదొక విధమైన బెదురు కలిగి, తను లేని ధైర్యం తెచ్చుకుంటున్నానని యెవరో ఎత్తిపొడిచినట్లనిపించింది... బయటకు వచ్చాడు... ఆ ప్రశ్న భార్య వేసిందికాదు...తనలోనుంచి వచ్చింది. ప్రకృతి నలుమూలలనుంచీ ఆ ప్రశ్నే ప్రతిధ్వనించినట్లనిపించి కంపించిపోయాడు. "నే నామెతో చేరనంటే చేరను" అనుకోవాలని ప్రయత్నించినా తనలోని జ్ఞానం 'తప్పుండా చేరి తీరుతావని ఢమరుకంలా ఢమఢమ లాడుతోంది!...

ఎలాగో భోజనం చేశాక ఆ గడచిన నిముషాలన్నీ తమాషాగా వున్నాయే అనుకున్నాడు. కుళ్లిన శవాలను కూడా కోసిన తను, ఆ గడియల్లో చిన్నపిల్లాడిలా బెంగపడిపోయానని, ఆ క్షణికమైన అధైర్యం, మళ్ళీ పొరపాటునైనా రాకూడదని మనసు దిట్టం చేసుకొన్నాడు. నిద్రపోయేవరకు వాకిట కుర్చీలో కూర్చున్నా ఆ తలపే రాలేదుగానీ మంచం మీద నడుంవాల్చగానే, నరాల్లో బలంలేని మనిషిలా, అదోలా అయిపోతున్నట్లనిపించింది.

"భార్య...ఫోటో...తన డబ్బు...మేడలు... ఈ భవనం...ఆకాశం...భూమి...భూతం..కుర్చీ... పరుపు...పరుపుమీద తలగడ......తలగడమీద తన తల...తలమీద వెంట్రుకలు...వాసననూనె వ్రాసే యీ వెంట్రుకలకే నిప్పంటిస్తారే!"...నిర్దిష్టత లేని ఆలోచనలన్నీ వ్యాపిస్తూంటే ఛా, ఛా అనుకొన్నాడు. అంతటి ధైర్యశాలికి యిలాంటి ఆలోచనలు ఎప్పుడైనా వస్తాయని కలలోనైనా అనుకొన్నాడా? పడుకోవటానికి ప్రయత్నించాడు......ఆ ప్రయత్నంలో పడుకుంటూనే మధ్య మధ్య తెలివి వచ్చేసేది.—ఆలోచించేవాడు...వ్యర్థమైన ఆలోచనలని—మళ్లీ పడుకోవడానికి ప్రయత్నం...ఇలా తెల్లవారిపోయింది...మళ్ళీ ధైర్యం...నిరుత్సాహం... ఏవో తలపులు.

మిట్టమధ్యాహ్నం. మంచినిద్ర తీశాడు. లేచేసరికి దాహం వేసింది నిద్రలో ఏవో కలలు—సరిగా జ్ఞాపకం లేదు. జ్ఞాపకం చేసుకోడానికి ప్రయత్నించలేదు. నీరు త్రాగుతూంటే యే పదేళ్లనాడో ఎవడో పల్లెటూరువాడు ఉపయోగించిన "దాహం" అన్న పదం మెదడులో యే మారుమూలల్లో దాగున్నదో, యీ క్షణానికి తలపుకు వచ్చింది. నీరు సగం త్రాగి ఆగిపోయాడు. ఆ మనిషి—ఆ మాటలు—ఆ సన్నివేశం—అంతా కళ్ళెదుట వుంది..."అబ్బా! ఈ డాక్టరికి వల్లమాలిన దాహం. ఇంకో డాక్టెరి దగ్గరికి పోదాం!". అప్పుడు యిలాంటి వెధవలు రాకపోతే నేం అనుకొన్నాడు. ఆ మాటలే యిప్పుడు మరోలా అర్థం యిస్తున్నయ్ అందులో యేదో సత్యం వుందని తన కెవరో నొక్కి చెప్తున్నట్లనిపించింది. ఈ కొత్త యింట్లో బలే ఆలోచన్లొస్తున్నయ్! ఫోటో చూసి రాత్రంతా నిద్రలేదు! దాహం వేస్తే నీళ్ళు త్రాగితే యిలాంటి ఆలోచనలు యెందుకు రావాలి! మనిషి తన జీవితంలో తృప్తి లేకండా బ్రతకటంకంటే యింకో నేరం లేదు. సుఖజీవనంలో మంచి బ్రతుకు తెరువులో ఉన్నత శిఖరాలగురించి ఆలోచించి తను బ్రతికాడు...అలానే బ్రతకాలని నిర్ధారించాడు... తన కిప్పుడు లోటేం వుంది? లేనిపోని ఆలోచనలతో తనెందుకు గిజగిజ గింజుకోవాలి? ఈ నిమిషంనుంచీ తను మామూలు మనిషినని అనుకొన్నాడు.

మధ్యాహ్నం పడుకోవటంవల్ల రాత్రి వేళం నిద్ర రాలేదు. వార్తాపత్రిక తిరగవేస్తూ యెవరో లంచం తిన్న ఆఫీసరుమీద వేసిన నేరం న్యాయమూర్తి యెదుట విచారణ అయ్యే వార్త చదువుతూనే ఆపేశాడు. ఆ ఆఫీసరు తనవంటివాడని స్ఫురించినట్లయింది. తను వేరే అని అనుకోందామనుకొన్నా... కోర్టు...ప్రజ...న్యాయవాది... న్యాయమూర్తి... అంతా కళ్ళకు కట్టింది. ఇదంతా యేమిటనుకొన్నాడు! కోర్టు లెందుకుండాలి? న్యాయవాదులు—న్యాయమూర్తి యెందుకు? తనలాంటివా రున్నారనా? తను ప్రజలను దోచాడా? అన్యాయం చేసాడా? న్యాయం ఏమిటి? అన్యాయమేమిటి?......డబ్బు గడించి సుఖంగా బ్రతకటం ఒకరిని దోచట మెలా అవుతుంది? ఆర్జించిన డబ్బుతోనూ ఉన్న దిట్టమైన శరీరంతోనూ, యిప్పుడు విశ్రాంతితో హాయిగా బ్రతకాలనేకదా, యీ భైవేలిచ్చి యింత చక్కని ప్రదేశంలో యింత

భవనం కట్టించాడు...ఇలాంటప్పుడు, న్యాయా న్యాయ విచారణ తనకెందుకు కనిపించింది—మొదట తనకెందుకు లేకపోవాలని—మళ్ళీ తనేమీ అన్యాయం చెయ్యలేదే అని అనుకోబోయాడు—అన్యాయం అన్నపదం మళ్ళీమళ్ళీ తనను బల్లెల్లా చుట్టు ముట్టేస్తోంటే,—దాసోహం అన్నట్లనిపించింది! కుష్ఠురోగంతో గింజుకొనేవాళ్ళూ...పక్షవాతంతో బాధపడ్డవాళ్ళూ...పుండులుపడ్డవాళ్ళూ...రక్తం కక్కేవాళ్ళు...యిలా యెందరిదగ్గరో డబ్బు వందలు పుచ్చుకొని మందులిచ్చాడు...వాళ్ళగురించి అప్పుడు లేనిది...యిప్పుడే ఎందుకు తలపుకు రావాలి? వారి వంద లెలా యివ్వగలిగారు? వారూ దోచారా? ...దోచబట్టేనా అంత హీనంగా చచ్చారు? యింత పేరుపడ్డ ఘనవైద్యుడైన తనూ వాళ్ళకేమీ సహాయం చెయ్యలేకపోయాడే! మనిషిచేతుల్లో లేనిది ఏదో వుండితీరాలి! లేకపోతే తన భార్య ఎందుకు చావాలి? పోనీ చచ్చాక సుఖంగా శాంతంగా కాలం వెళ్ళబుచ్చుతానంటే తనమీద ఎందుకీ ప్రశ్నలవర్షం కురిపించాలి?...తన భార్య కురిపించలేదే! తన మనసే అనవసరంగా వికలం అవుతోంది. ఐనా తను చేసిన అన్యాయం ఏంవుంది? విరామం లేకుండా పనిచేశాడు-దాని ప్రతిఫలం పుచ్చుకొన్నాడు...ఇందులో తప్పేముంది? అన్యాయం ఏముంది? యింత సమర్థించుకోవటం దేనికనిపించింది! న్యాయాన్యాయాలు మానవకల్పితాలు....అని కష్టపడేవాడు సుఖపడేవాడిని చూసి ఓర్వలేక కల్పించిన వీ మాటలు. బ్రతికి నన్నాళ్ళూ భోగాలసలతో బ్రతకాలి. దరిద్రంతో అటమటించిపోవటం దేనికి. నలుగురూ యిలానే తలుస్తారా? వాళ్ళతో తనకేమిటి పని. తన తలపు తనది...తనెందుకు, అనవసరంగా, మనుష్యులు.. జీవితాలు...యీ తర్కంలోకి దిగటం...ఆలోచించటం మానే ప్రయత్నంలో హోరుమనిపిస్తున్న సముద్రపు ధ్వని వినిపిస్తోంది...సముద్రం ... కెరటాలు .... ఆటు - పోటు ... తుపానులు ... మనుష్యులు...మానవ సముద్రంలో తనొక నీటిబిందువు... తను మిగతా నీటినుండి వేరుపడలేడు...ఆ నీటిలోనే కలసిన తనొక బిందువు...నీటితో కలసివుంటేనే తన మనుగడ...బిందువుగా బయటకువస్తే రాలిపోతుంది. దిగువనున్న యిసుకలో నామురూపాలు లేకుండా యింకిపోతుంది. తనూ అంతే అనిపించింది...మనుషులతో వుండాలి...మనుషుల గురించి ఆలోచించాలి...వాళ్ళ కష్టసుఖాలు పంచుకొని వాళ్ళతో వుండాలి. వాళ్ళు ఆలోచించినట్లు తనూ ఆలోచించాలి. లేకపోతే తనకు మనుగడలేదు...న్యాయాన్యాయాలున్నాయి...మానవకల్పితాలైనా మానవుని మనుగడకి అవి ఉండితీరాలి!...అయితే.

తను అన్యాయంగా ప్రవర్తించాడా? – తనలో పెద్ద ప్రశ్న రేగింది...?

దీపం ఆర్పి చిన్నదీపం వెలిగించాడు. ఉన్న ఒక్క నౌఖరు గాఢమైన నిద్రలో ఉన్నాడు. వాడెందుకు అంత హాయిగా పడుకోవాలి? తనకెందుకు నరాలు పీకినట్లయి నిద్దర రాకపోవాలి? దానికి కారణం తనకు తెలుసుననిపించింది! వాలు కుర్చీమీద చారబడి తన గడిచిన రోజులను సినీమాలా చూస్తున్నట్లుంది.

పేరుపడ్డ డాక్టరు జీవితంతో కథ మొదలు. బ్రాంచి ఆసుపత్రిలో డాక్టరుగా వున్నప్పుడు:—నిశిరాత్రి—ఒక పల్లెని పల్లెటూరిమనిషి—డాక్టరింటి తలుపుమీదబడి పేదవాడ్నని, ఉన్న ఒకే కొడుకుని రక్షించమని గగ్గోలు పెట్టుంటాడు. యెంత ప్రాధేయపడినా—పొమ్మని గసుర్లె కాదు—గెంటించి వేస్తాడు...ఆ మనిషి తలబాదుకుంటాడు ...కేకలు వేస్తాడు...డాక్టరు తలుపు బిడాయిస్తాడు ...ఆ రెండోరోజు ఆ మనిషే మళ్ళీవస్తాడు... ఈసారి తన బంగళాచుట్టు తిరిగి పకపకా నవ్వుతాడు...మళ్ళీ ఆ క్షణంలోనే అంతులేని ఆవేదనను సూచించే గగ్గోలు...త్రోవంటే పోయేవారు యీ పిచ్చివాడ్ని చూసి కనికరించారు...డాక్టరు ఒక్క క్షణం అప్పుడు ఆలోచించినా, యీలాంటివాళ్లు తన కెందరో?

పెద్ద ఆసుపత్రిలో ఒక వార్డుకు పెద్దగా వున్నప్పుడు—డబ్బుపుచ్చుకుని వెనుకవచ్చి తక్కువ బాధపడే శ్రీమంతులను ఆసుపత్రిలో చేర్చుకొని, మొదటినుంచి కాసుకు కూర్చొని హెచ్చు బాధపడే పేదలకు పంగనామాలు పెట్టాడు.

ఒక కుర్రాడు...డాకరుని చూచే గజగజలాడిపోతున్నాడు...ఈ డాక్టరు తప్ప మరెవరు బ్రతికించలేరని నమ్మకంవుంది. ఈ డాక్టరు గసుర్లకు, ఆ కుర్రాడు జడిసిపోయాడు...యింకో డాక్టరు దగ్గరకువెళ్ళి కొద్దికాలంలో యెందుకు చచ్చిపోయాడో తనకు తెలుసు.

పాతికరూపాయల కన్నతక్కువ ఫీజు యెన్ని వందలమందిదగ్గర పుచ్చుకున్నాడు. అలా యిచ్చుకోలేనివాళ్లని యెందర్ని పంపించలేదు. ఒక్కొక్కటి యిలా కొల్లలుగా కళ్ళెదుట డాక్టరుగా తను చేసిన

పనులు కనిపిస్తున్నాయ్. అవి ఆపాలని తను ప్రయత్నించలేదు.. పినా ఆగవని తనకు తెలుసు!

అప్పుడే రాత్రి రెండుగంటలు దాటింది. తను తనగురించి యింతవరకూ చూసిన ఆ బొమ్మలకు తన లోని ధ్వని ప్రతిధ్వనింపుతూ తనలో యిదివరకు రేగిన పెద్దప్రశ్నకు సమాధానం యిస్తున్నట్టుంది. మంచంమీద వాలబడ్డాడు. మనసేదో ప్రవహించుకు పోతున్నట్టనిపించింది. బోర్లపడుకుని..."ఆ కుర్రవాడు చావడానికి, ఆ తండ్రి పిచ్చివాడవడానికి .. కారకుడు నేనే!" అనుకొన్నాడు. మళ్ళీ మనసంతా మహాసముద్రం అయినట్టనిపించింది. ఆ గగ్గోలుతో "అయ్యో నేనెంత పాడుపని చేశాను. నా నిద్రకు భంగమని వాడిని పంపేశాను. గట్లు పుటలు దాటి నేనెళ్ళి ఆ కుర్రవాడి మందిస్తే—చచ్చినా—వాడు తృప్తితో వుండి పిచ్చివాడు కాకపోను. నాకూ ఒక్కడే కొడుకుకదా! నేనే వాడి ...నో వుంటే! ఆరాత్రి మీద వాడే ఒక వందరూపాయలు పారేస్తే ఆర్థికస్థోమతిగలవాడై యుంటే—పరిగెత్తే వాడినే!... నేను డబ్బును చూసుకొనేనా బ్రతికాను....మానవసమాజానికి సేవకుడైన డాక్టరుకు రాత్రి పగలూ ఒకటే!"

"ఎందరు పేదవాళ్ళు నేను వేగంగా ఆసుపత్రిలో చేర్చకపోవటంవల్ల చచ్చిపోయారు? ఆ కుర్రాడిని ఆ డాక్టరు చేతకాక చంపేశాడే! దయాధర్మాలు లేక బతికొనని......యి... ప్పు... ఆలోచించలేదు......పొరపాటునైనా నా కెందుకీ ఆలోచనలు రాకపోవాలి?...... నేను గుడ్డివాడనయ్యానా? నా ధనాపేక్ష నన్ను గుడ్డివాణ్ణిగా చేసిందా?...యింత గుండె లేకుండా నేనెలా బ్రతికాను..." డాక్టరు కళ్ళలో నీరు తిరిగినట్లయింది. దొంతరులుగా ఆలోచనలు రేగి తనను మరింత కలవర పెట్టసాగాయ్. తెలతెలవారినా యింకా కుమిలిపోతున్నాడు. మొదట యీ ఆలోచన లేమిటని బాధపడినా, తరువాత తనలో యేదో మనోవికాసం కలుగుతోందని...తనకి మనోవికాసం యిదివర కెందుకు కలగకపోవాలి?...ఆ వికాసం చనిపోయిన తన భార్య కలుగచేస్తోందా?...లేక కష్టపడే పేదజనావళి గురించి తను ఆలోచించటం మొదలుపెట్టడంవల్ల కలుగుతోందా?

తెల్లవారిపోయింది! ఆ వెలుగు తనలోనే వున్నట్లనిపించింది. స్నానం కాఫీఅయ్యాక తోటలో యిటూ అటూ పచారు చేశాడు......భవనం వేపు చూశాక...యాభై వేలు తన జీతంమీద గడించగలిగే వాడా? తను పొందిన సుఖం మర్యాదలు ఒక్కొక్కటే జ్ఞప్తికి రాసాగాయ్. పదివేలు కట్నం ఇచ్చి తన కూతుర్ను ఒక యింజనీరు భార్యను చేశాడంటే ......బేంకులో యాభై వేలవరకూ వుంచి మెడికల్ సర్వీసు డైరక్టరుతో వియ్యం పొందాడంటే తక్కువ విషయమా? తను జీతంమీదనే ఆధారపడివుంటే ఒక గుడిసెలో నివసించవలసిందీసరికి......లోకంలో నిజంగా దోచేవాళ్ళెందరు లేరు. తన కళ్ళెదుట మామూళ్ళలు వర్తకు లెందరు కోటీశ్వరులు కాలేదు. ఎందరు ప్రభుత్వోద్యోగులు మేడమిద్దెలు కట్టించి పిల్లల పేర వ్రాయలేదు. పెద్ద పట్టణాల్లో, పై దేశాల్లో డాక్టర్లు తనకంటె చాలా హెచ్చు డబ్బు పుచ్చుకుంటూ లేరా?......వాళ్ళతో సరిపోలిస్తే తను గడించిన దేమాత్రం!.. తను చేసిన అన్యాయం యేముంది? తనే యింత గిజగిజలాడిపోతే వాళ్ళెలా గిజగిజలాడి చావాలి? తను బాధపడే అవసరం లేదనుకున్నాడు.

రాత్రంతా మేల్కొని వుండటంవల్ల మధ్యాహ్నం కంటి రెప్పలు బరువెక్కిపోతున్నాయ్. పడుకుంటే మళ్ళీ యేవో ఆలోచనలు వచ్చి రాత్రికి నిద్ర పట్టదని చేతికందిన పుస్తకాన్ని బీరువానించి తీశాడు .. పేజీ త్రిప్పగానే అగుపించింది—

"మనిషిలోని ఉద్రిక్తత ఆత్మని గుడ్డిదాన్నిగా చేసి తనలోవున్న జ్ఞానం యేం పనైతే చెయ్యనిచ్చేది కాదో—ఆ పనినే చేయిస్తుంది. ఎప్పుడైతే ఆ జ్ఞానం తిరిగివస్తుందో - ఆ వ్యక్తి తన తప్పులను తెలుసుకుని

పుస్తకం మూసి పరుపుమీదకు విసిరేశాడు. ఈ పుస్తకం తనదగ్గర యెన్నాళ్ళనుంచో వుంది. కానీ తను యీ మాటలు యిదివరకు చూచినట్లు లేదు—చూసినా యిప్పటిలా అర్థం చేసుకొని ఆలోచించినట్లు లేదు. గడచిన రాత్రిలా మనస్సు ఆలోచించ మొదలు పెట్టాంటే, ఆపి తన సౌఖ్యం హోదా తలుచుకొని మనస్సు త్రిప్పాలని వుబలాటపడ్తున్నాడు... ఈ ప్రయత్నంలో... మేడలు మిద్దెలు ... దర్జాగా—ఒకరి ఖాతరు లేకండా, ఒకరికి లొంగకుండా—బ్రతికాడే!...అలాంటి తను, చిన్నపిల్లాడిలా... మామూలు బజారు మనిషిలా, నిమిష నిమిషానికి యిలా కావటందేనికి? గడచిన సౌఖ్యాలు తలుచుకోవాలని విశ్వప్రయత్నం చేస్తుంటే—అవి మనసుకు సరిగ్గా అందటంలేదు...అందినా యెంతోసేపు నిలవటంలేదు...ఈ ఉక్కిరి బిక్కిరిలో యెవరో దూరంనించి యేదో పెద్దప్రశ్నతో దగ్గరకు వస్తున్న

ట్లనిపించింది. ఆ ప్రశ్న యిప్పుడు ఒళ్ళంతా జర జరా ప్రాకిపోయింది! "నువ్వు నీ సుఖాలని జ్ఞాపకం చేసుకొని ఆనందించగలవ్వా?" ఎవరీ ప్రశ్న వేస్తున్నారు? తనే! తనెందుకీ ప్రశ్న వేసుకోవాలి?

డాక్టరు అలా పక్కమీద చారబడిపోయాడు. ఇన్నాళ్లూ తను గుడ్డివాడనయ్యానని, తన జ్ఞానం తిరిగి వచ్చిందనీ, అంచేతనే తనిలా తికమక పడుతున్నానని, అనుకున్నాడు. ఒక కౌపీనధారి గతిస్తే చిన్నపిల్లలనుంచీ ముసలివాళ్లవరకు యెందరేడ్చారో— ఒక కోటీశ్వరుడు చస్తే వాళ్ల పిల్లలు కోర్టుకెందరు కెక్కారో, తన కిప్పుడు తెలుసుననిపించింది. పై దేశాల డాక్టరుకూ యీ దేశాల డాక్టరుకూ పోల్చటం తప్పని... ఈ మన పెద్ద పేద దేశంలో ఆశలకు హద్దులుంచుకొని, పేదలపై ఉన్నతవర్గాలవారు కనికరం చూపించకపోతే, దేశమే లేదనిపించింది... తన సౌఖ్యమయ జీవితం... ఆ ఘట్టాలు... అవన్నీ జ్ఞాపకం... నీటిబుడగలు. అంతే; శమదమాదులు, కష్టాలు— అన్నీ మనసులో హత్తుకొని మనిషిని మూసలోపోసిన బంగారంలా చేస్తాయ్. పురాణాలు శాస్త్రాలు అన్నీ తోడిమానవునిమీద ప్రేమాభిమానాలే చాటాయిగానీ యింకేమీ లేదు. ఈ పరమసత్యాన్ని తను గుడ్డివాడై గ్రహించక నిర్దయుడై బ్రతికానని కుమిలిపోతూ నెరెప వాల్చాడు.

గడియారం మామూలుగానే నడుస్తోంది. ఐదు గంటలు కొట్టబోతుంటే అలా కళ్ళప్పచెప్పి దానివేపే చూస్తున్నాడు. అది అయిదు గంటలప్పుడు ఆరు గంటలు ఎందుకు కొట్టకూడదు? దీనిగురించి చాలా సేపు తర్కించుకొన్నాక, యింతసేపూ తను అనవసర విషయంగురించి అర్థంలేకండా ఆలోచించానని పక్కమీదనుంచి లేచిపోయాడు. ఆ నిమిషంనించీ తెలివివున్నపుడల్లా యేదో ఆలోచన వుండనే వుంటోంది.. నిద్రలోనూ ఆలోచనలు వున్నాయని తనకు రోజూ వచ్చే కలలే చెప్పుతున్నాయ్... గడియారం గంటలు కొడ్తోంది... అలా రోజులు గడిచిపోతున్నాయ్... గడియారంలా తన బ్రతుకూ యే గొడవా ఆలోచనా లేకుండా, ఒక తోవలో తిరిగివుంటే బావుండే దనిపించింది. కాని మళ్లీ తప్పనుకున్నాడు; అలా వుంటే; యింత డబ్బు, గడించేవాడు కాదని, ఈ ఆలోచనలకు తావుండేదికాదని తోచింది మనిషికి మెదడుంది — గడియారానికి అదిలేదు — మెదడున్న వాడిచే సృష్టింపబడిందది— మెదడున్న వాడిని సృష్టించినవాడెంతవాడో?

ఒకరోజు గదిలో కూర్చుని, భార్య ఫోటో వేపు చూస్తూ వేగం చచ్చిపోవటంలో, ఆమె అదృష్టవంతురాలనుకున్నాడు. చావుగురించి, తలపులు మళ్లీ తనను కలవరపరచాయి తోటలోకి వెళ్లాడు. చుట్టూ పచారుచేస్తూవుంటే పచ్చని గరిక కనిపించింది. అది ఎందుకు పచ్చగా ఉండాలి? గొడ్లుతిని పుష్టిగా ఉండటానికి. గరిక తిన్నగొడ్లు చస్తాయి గరిక చావదే—చావు—ఎందుకు తనకీ ఆలోచనలు? రాత్రనక, పగలనక, విరామంలేకుండా అసంఖ్యాకంగా, తనను అంటిపెట్టుకొని, పాడైపోయిన కౌలేయం మనిషిని అల్లరిపెట్టినట్లుగా చేస్తున్నాయ్ ఇవన్నీ తనిలాకూర్చుని తినటంవల్ల వస్తున్నాయని స్వంతంగా ఒక ఆసుపత్రి పెడదామనుకున్నాడు. దానికి శరీర శక్తిలేదనిపించింది. మళ్ళీ డబ్బు జబ్బుల గొడవల్లోపడి తనకు విశ్రాంతి వుండదు—తన ఆరోగ్యం పాడవుతుంది... అవును ఆరోగ్య పాడవుతే... మనిషి చచ్చిపోతాడు!— హడిలిపోయాడు.

రోజులు—నెలలు గడిచిపోతున్నయ్. తను ఆలోచనల ఊబిలో దిగబడిపోయానని—విమోచన మార్గమేమిటని రాత్రింపగళ్లు ఆలోచిస్తూన్నాడు. తను పొందిన సుఖమంతా—యిప్పుడు పొందుతున్న ఆరాటంలో యెన్నోవంతనిపించింది. నరాలన్నీ తోడుకపోతున్నాయని— గుండె దడపట్టుకుంటోం దని, అనుకోకుండానే స్ఫురించింది. తను యేం చెయ్యడానికి వెళ్ళినా యెవరో అడ్డుపెట్టున్నట్టనిపించింది. యెవరో అజ్ఞాతుడైన పోలీసు—తనలోనే దాగొని వున్నాడనిపించింది. ఇన్నాళ్ళూ లేనిది యిప్పుడే వీడు లాఠీపట్టుకొని బాధాలా?— ఒక్కొక్కనాడు మనసు వికలమయ్యేది. ఏదో చేసేద్దామని ఉబలాటపడేవాడు. దానధర్మాలు చేద్దామనుకొంటే—యేంలాభం యిప్పుడు?—తీర్థయాత్రలు సేవిద్దామనుకొన్నాడు—యేంలాభం?... కష్టపడేవాళ్ళకు కొంత డబ్బు పారేద్దాం! యేం లాభం? చేసిన పాపాలను యీ లంచాలతో తుడిచిపెట్టేద్దామనుకొన్నావా? ఈ ప్రశ్నలు తనలో వుండే వేస్తున్నాడెవరో - యెదరగా పిల్లిలా నక్కిపోతున్నాడు!

రానురాను తన ఆలోచనలు, భయంమీద తప్ప, దేనిమీదా కేంద్రీకరించలేక పోతున్నాడు. అంతా బూటకంలా కన్పిస్తోంది. బయటకు వెళ్దామంటే బుద్ధిపుట్టటంలేదు. ఏదో భయం. కారుడ్రైవుచేస్తూంటే మనుషులను తొక్కించి తనూ చచ్చి

పోతాడేమోనన్న పిరికిపుట్టోంది. ఇల్లుకదలటం మానివేశాడు. ఒకనాటి సాయంకాలం మబ్బుగావుంది. సముద్రంమీద వర్షం కురుస్తోంది. కొండంతయెత్తుకు కెరటాలు లేస్తున్నయ్. చల్లనిగాలి వుండివుండి వీస్తోంది. వరండాలో నిల్చుని సముద్రంవేపు చూస్తున్నాడు. ఒక చిన్నపడవ వర్షంవల్ల కెరటాల్లో చిక్కుకుని తిరగబడిపోతూన్నట్లనిపించింది...తనే ఆ పడవమీద వున్నట్లు—ఆ లోతునీళ్లో పడి గిజగిజ గింజుకపోతున్నట్లయి — కాళ్ళు—శరీరం—గజగజలాడిపోతూంది......మునిగిపోతున్న వాడు చేతులెత్తి... ... "తండ్రీరక్షించు — రక్షించు," అని అరచి గగ్గోలు పెట్టినట్లనిపించింది...... హృదయం కంపించిపోతూంది......తను మనసులోనే చేతులెత్తుకున్నాడు. గట్టిగా యీ మాటలనే మనసులో అనుకొన్నాడు. కొంతసేపటికిగాని తను యిదంతా వూహించుకొన్నాననే జ్ఞానం రాలేదు. తనకు యిదివరకు యిలాంటి అనుభూతి యెప్పుడూ రాలేదు. కష్టంలో వుండేవాడి పరిస్థితి యెలా వుంటుందో తన కిప్పుడు అర్థం అయ్యింది. ఇలా కష్టంలో వున్నవాళ్లు రక్షించమని తనదగ్గర కెందరొచ్చారు? అలాంటి వాళ్ల దగ్గర తను చేరాలాడాడు? డబ్బు కక్కనిది మందివ్వలేదు! తనవంటి నిర్దయుడి కెందుకింత గొప్పకళ దేవుడిచ్చాడనిపించింది. ఒక దమ్మి పుచ్చుకోకండా, యేరాత్రిమీదైనా వాళ్లని రక్షించడానికి పరిగెత్తవలసింది! ఇదే తలచుకొని చతికిలబడ్డాడు. తలుచుకొన్నకొద్దీ గుండె ద్రవించుకపోతూంటే లోనించి పోలీసు లాఠీతో తెగబాదుతున్నాడు. చేయెత్తి "తండ్రీ! రక్షించు! రక్షించు" మనటానికి తనకు అర్హత లేదనిపించింది. దేవుని పేరెత్తాలనుకున్నా యెత్తలేక పరుపుమీద పడ్డాడు. ఒళ్లంతా వుబ్బిపోతూన్నట్లు...అంతలోనే యేదో భయం...చిరాకు...జాలి...యేడుపు కూడా వచ్చినట్లయింది.

చాలా సేపటికి గానీ మనసు మళ్లీ యథాస్థానంకు రాలేదు. వచ్చాక గదిలో అటూ యిటూ, కొద్దిగా పచారు చేస్తూవుంటే, యెదరగా అద్దంలో ముఖం కనిపించింది. మెర్క్యురీలైటు గదిలో వెలుగుతూంది. బయట ముసురు చీకటలో ప్రారంభమైంది. ఒకటే ఘీంకారం...ఎక్కడో పొదచాటున వున్న ముదుసలి నక్క తడిసిపోయి—చలికి వణుకుతూ అరుస్తున్నట్లనిపించింది. అరుపు విని తనగురించి ఆలోచించటం మొదలు పెట్టాడు....నక్క - జిత్తులమారి...అందులో ముసిలి నక్క...తన పరిస్థితి అలానే వుందినుకున్నా- తరవాత అలా పోల్చుకోవటం జేని కనిపించింది.

అద్దం దగ్గరగా వెళ్లాడు. ఇన్నాళ్ళనుంచీ వున్న అద్దమే! ఇదివర కెన్నోసార్లు యీ అద్దంలో ముఖం చూసుకొని తృప్తిపొందాడు. ఇప్పుడు-ఆ ముఖం... ముఖంలో కళ్లు...పెదాలు...చెవులు... మీసం... న్నీ శుష్కించినట్లు—గబుక్కున తనెంత చిక్కిపోయాననుకున్నాడు.. అక్కడనుంచి కదిలినా... తను ఆలోచనలతోనే యెండిపోయానని—తనెందుకాలోచించాలని అనుకుంటూనే కుర్చీమీద కూర్చున్నాడు. హోరున వర్షం...ఉండి వుండి గాలి రివట వేస్తోంది...చలి వేస్తున్నట్లు—ఏదో కప్పుకోవాలనిపించింది నౌకరుని పిలవాలనుకుని లేచి వీధితలుపులు బిడాయించి వస్తూనే, మళ్ళీ అద్దంలో ముఖం చూడాలనిపించింది. వెళ్ళాడు...ఈసారి ముఖమే కాదు...వక్షం... చేతులు...వ్రేళ్లు...వ్రేళ్ల చివరలు కూడా...అద్దంలో చూసుకొన్నాడు...చేతులు వ్రేళ్లు తనెందుకు అద్దంలో చూసుకోవాలి?......ఆ చర్మం .. అంటిపెట్టుకొన్న మాంసం ... మాంసం మధ్య యెముకలు అద్దంలో చూస్తుంటేగానే...తన ముఖం...శరీరం అంతా అస్థిపంజరంలా అగుపించింది. ...ఇదివరకు యిలాంటి యెముకలను తాకి, రిపేరు కూడా చేశాడు....ఇప్పుడు చూస్తుంటే కెవ్వన కేక వేదామన్నంత భయం వేసింది...

ఆ గదిలో వుండలేక యింకో గదిలోకి వెళ్లిపోయి, సోఫామీద చతికిలబడ్డాడు. తనెంతగా చిక్కిపోయాడు. బలంలేనిది తన బ్రతుకేమిటి?...ఈ అస్థిపాస్థులన్నిటినీ విడిచిపెట్టాలా?—అంతా యెముకలమయం...వీటి తాలూకు అంత్యం? ఈ విషయాలు తలచుకోకుండా వుండాలని ప్రయత్నించాడు. ప్రయత్నించినకొలదీ వీటి విషయాలే తలుపు కొస్తున్నాయ్. ఆరాత్రి భోజనంమీద కూడా లేదు ... ఎక్కడ కక్కడే ఆ ముఖం...ఆ అస్థిపంజరం అగుపిస్తోంది...చెయ్యి చూసుకొంటే రక్తమాంసాలు లేనట్లు...అలా పరుపుమీద వాలుతూంటే ఒక అస్థిపంజరం కదులుతూ పరుపుమీద పడినట్లనిపిస్తోంది ..తను యిదివరకు మెడికల్ కాలేజీలో చూసిన అస్థిపంజరాలన్నీ, కదులుతున్నట్లు—కదులుతూనే తనవేపు వస్తున్నట్లు...తను పిచ్చివాడుగా మారుతున్నట్లు అనుమానం, భయం వేసింది...యెడతెగని ఆలోచనలతో భయం వేస్తూంటే—నౌకరుని, తన గదిలోనే పడుకోమన్నాడు. చారబడింది మొదలు వాడిది ఒకటే నిద్ర. చాలాసేపు గింజుకుంటున్నాడు. తనిప్పుడు చచ్చిపోతున్నానేమో అనిపించింది. ఈ తలపులతో ఒళ్ళు కంపించిపోయింది. లేచాడు...

వర్షం వెలిసింది. అంధకారంలో చుక్కల మిసమిస వెలుగులో చెట్లు భూతాల్లా అగుపించాయి. తను చచ్చి భూతమవుతాడేమో ననిపించి—కిటికీ దగ్గర నిల్చోడానికి భయం వేసింది—నిద్రపోదామని ప్రయత్నించాడు...అద్దం!—కాళ్ల పీకు—రెండు మైళ్లు యెకాయెకి పరిగెత్తినంత ఆయాసం వచ్చింది.. వేడెక్కిన తలను నీటితో తడిపాడు. ఎంతో సేపటికి గాని నిద్రరాలేదు...లేచేసరికి వచ్చిన కలలు సరిగా జ్ఞాపకంలేవు—అద్దం కలలో రావటంవల్ల జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నించాడు. నిజంగా తనకు కలలో అద్దం కనిపించింది -తను అద్దంముందు నిల్చున్నాడు. తల అగపడలేదుకదూ?...ఉ మొండెం! నిజంగానే? అమ్మో అనుకున్నాడు. కాదు అలా అగపడలేదు...అగపడిందేమో? పాడు కల...పీడకల...తనింకెంతకాలమో బ్రతకడు? తను చచ్చిపోతాడా? నిజంగానే?...యింత వేగంగానే? ..."చచ్చిపోను...చచ్చిపోడానికి వీల్లేదు" అని అనుకోబోతూడు...అదం! అమ్మో అద్దం! ఈసారి నిమిష నిమిషానికి పిరికితనం బలిసిపోతూంది. ఇంకే ఆలోచనకీ మనసులో తావులేదు ... ఒక్కటే! చావు...చావు...! నిమిషాలన్నీ కూడుకుని గంటలయ్యాయి. మనిషి కంపించిపోతున్నాడు...గంటలన్నీ కూడి రోజయ్యింది. మళ్లీ చీకటి...భయం... నిద్దర పూర్తిగా తనను విడిచిపెట్టింది—నిద్రలేని రాత్రులు అంతులేని ఆవేదనతో గడిచిపోయాయి... కొలవటానికి అందని ఆవేదన—బాధ!...పచ్చని ప్రకృతి యెండిపోతూంది! రక్తం గడ్డకట్టుకపోతూంది...ఆలోచనలతో తల పగిలి మెదడు చెల్లాచెదరయిపోతూంది...! అస్థిపంజరం యిదివరలా యింటిలోనైనా తిరగటానికి భయపడి మంచంపట్టింది!

టెలిగ్రాం అందుకున్న కొడుకూ కోడలూ వచ్చారు. తనంతవాడు -తన కంటేగొప్ప డాక్టరు —చూడగానే "యింతగా చిక్కిపోయేవరకూ [illegible] నాన్నా" అంటే ఆ మాటల్లోనే తనరాతవుందని తోస్తోంది మాటాడటానికి శక్తిరాలేదు. ఏవో మందులవిషయం కొడుకు ప్రయత్నిస్తుంటే—ఆ మందులు తనకు పనిచెయ్యవని తోస్తోంది. మందులు వద్దని చెప్పటానికి సిగ్గుపడ్డాడు. తన మనోవ్యధ కొడుకుకి ప్రాకకూడదని తన వుద్దేశం! దగ్గరవుండి అన్ని సగుపాయాలు కొడుకు, కోడలు చేస్తున్నారు. మనోవ్యధ గట్టిమనిషిని కూడా చంపుతుందని తనకు తెలుసు. చావుభయం—ఆ ఆలోచనలతోపాటు యీ యిచ్చే మందులమీద ఆలోచనలు కూడా తోడైనయ్. తను డాక్టరెందుకయ్యానని విసుగ్గున్నాడు. తనకు తెలుసుకాబట్టి మందు మీదా నమ్మకం కలగడంలేదు.

తన జబ్బుకు మందులేదని యేనాడో తెలుసుకున్నాడు. తన ఒకే ఒక కొడుకు కోడలు దగ్గర వున్నారని కొద్దిగా తృప్తితప్పించి తనపరిస్థితి యేమీ మారలేదు. తను యేదో మనోవికాసం కలిగిందనుకున్నాక దానధర్మాలు చెయ్యటానికి యేదో సాకుపెట్టి తగ్గిపోయాడు. తన చేతులు పుచ్చుకోవటమే గాని యిచ్చి యెరగవు.—అదీ బ్రతుకేనా?—ఇలాంటి తలపులతో బాధపడి పరిస్థితిని మరీ అధ్వాన్నంగా చేసింది.

ఆవేళ ఆదివారం—రాత్రి పదకొండు గంటలు దాటి అయిదు నిమిషాలయింది—గడియారం వైపు చూశాడు. అది ఆగిపోతూందనిపించింది. "క్షీ" యిమ్మని కొడుకుతో చెప్పాలనుకున్నాడు. అంతా గాఢంగా నిద్రపోతున్నారు. రక్తపోటు వచ్చిందని అనుమానపడసాగాడు. కొడుకుని లేపాలని, లేపినా ఆ పరిస్థితిలో అతను చేసేదేమీ లేదని...ఆలోచనలు లేకండా కాస్సేపు వుందామని ప్రయత్నించాడు. కానీ ఆ కొడుకుగురించే ఆలోచించసాగాడు—తన కొడుకు—ఒకే ఒకకొడుకు మళ్ళీ యేదో మైకం కమ్మినట్లయింది—కళ్ళల్లో నీరు చిమ్ముతున్నట్లు ఆ నీరు మెల్లమెల్లగా కారుతున్నట్లు భ్రమపడ్డాడు. "నా కొడుకు...నా బాబు—నాలానే అన్యాయార్జనతో పెంచబడ్డాడు - పెద్దవాడయ్యాడు .పెద్ద డాక్టరయ్యాడు— నాలా నే దోచేస్తున్నాడు- .చివరికి నాగతేపట్టుంది —నాకంటే యెన్నిరెట్లు హెచ్చుగా బాధపట్తాడో? అయ్యో తండ్రీ! నా ఒక్కగాని ఒక్క కొడుకు—నాలాంటి హీనమైన చావే చావాలా?" కళ్లంటి యీసారి నిజంగా నీరువచ్చింది. ఆ బెడ్ లైటు లేత వెలుగులో మళ్ళీమళ్ళీ కొడుకువైపు చూశాడు—తనింకెంత సేపో బ్రతకడు—"ఈ నిమిషాల్లోనైనా నా ముద్దు తండ్రివైపు చూస్తాను."—చూస్తున్నాడు. ఆ వెలుగులానే తనలో మైకం కమ్మివేస్తోంది! తను చచ్చిపోతున్నాడు—నిజంగా చచ్చిపోతున్నాడు. "భగవంతుడా!" అని తల్చడానికి తను వెనుదీయలేదు. పురుగులుపడి చచ్చినవాళ్ళబాధ, తను యీ కొద్ది నెలల్లో పడ్డ బాధతో పోలిస్తే యేమీకాదు. తనలా పురుగులుపడి చచ్చిపోయింటే చాలా అదృష్టవంతుడనిపించింది. ఈ ఆలోచనలతో మళ్లీ భయం వేసింది. చనిపోయేముందు మనిషి చేసే పాపాలు

మాతాయట—కళ్ళు మూతలు పడిపోతున్నా—చెవులు ఖంగుమంటున్నాయ్. అన్యాయమెరుగని పాపడు—"నివ్వే నన్ను చంపేశావ్" అంటున్నాడు. అరుస్తున్నాడు డాక్టరు బెదరిపోయాడు. ఆపక్కనే పకపకా నవ్వుతున్నాడో పిచ్చివాడు. నవ్వుతూనే గొల్లుమని యేడుస్తూ "నా కొడుకుని చంపేశావ్! నువ్వే! నువ్వే" కన్నీరు ధారగా డాక్టరు కళ్లలోంచి ప్రవహిస్తోంది! యింకా యింకా ఒకరు కాదు యిద్దరు కాదు...వందలకొలదీ బాధపడేవాళ్లు. ఆర్తనాదాలు...వెక్కిరింపులు...వికటాట్టహాసాలు.. డాక్టరు చెవులు బ్రద్దలైపోయాయ్—కళ్లు పేలిపోయాయ్...కెవ్వున కేక వేశాడు! తండ్రిచే కొట్టబడిన అల్లరి పిల్లాడిలా—తొమ్మిది నెలల నివాసమైన నరక కూపంవించి, వెలుగులో పడ్డ బిడ్డ అరుపులా వుంది!

తెల్లవారిపోయింది—తెలివి వచ్చేసరికి—తను యింకో ప్రదేశంలో వున్నానని...చుట్టూ వున్న డాక్టర్లు నర్సులవేపు చూసి పోల్చుకున్నాడు. మాటాడటానికి కదలటానికి శక్తి లేదు...ఎదరగా వున్న కొడుకుతోనైనా మాటాడాలని ఆసక్తి కలగలేదు—

బ్రహ్మాండమైన నీరసంతో వున్నా మనసు ఆలోచించగలిగే పరిస్థితిలో వుంది. ఎదురుగావున్న స్పెషల్ వార్డు కిటికీగుండా దూరానున్న పచ్చని చెట్ల కొమ్మలు అగుపించాయి. పక్షులు యెగురుతున్నాయ్. పసువులకాపరి వేణువు నూదుతూంటే—మేస్తూన్న పసువులు తల లూపుతున్నట్లు—అంతా మనోహరంగా వూహించుకోసాగాడు. గోమాత తలపుతో తన తల్లి తలపుకొచ్చింది..."నన్ను కనేటప్పుడు మా అమ్మ—అంత బాధ నొప్పులూ మంచి కోసం పడింది. నేను జీవితంలో బాధపడలేదు... అంచేత మంచి చెయ్యలేకపోయాను. ఈ ప్రపంచంలో యే సుఖంకోసం అంతగా ప్రాకులాటపడి, అనుభవించానో అది సుఖమే కాదు—డబ్బువల్ల సుఖం రాదు—మనిషి తన తోడిమానవులయెడ కనీసపు బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించడంవల్లనే, వస్తుందని తెలుసుకోలేకపోయాను—మనిషికి మనుష్యతే ధర్మం!"

డాక్టరు అందరివేపూ చూస్తున్నాడు తనకంటె అమానుషులెందరో ఆ గుంపులో వున్నారని తెలిసినా—అందరూ మంచి మనుష్యులుగా అగుపిస్తున్నారు. వాళ్లంతా యీ భూమాత బిడ్డలు—తోడి సోదరులు!—తనింకొక జన్మ యెత్తినట్లనిపించింది.

కొద్ది నిమిషాలలో నీరసం మరీ బాగా కమ్ముతూండటంవల్ల కళ్లు మూశాడు. మూస్తూనే ఒక్కసారి తన గురించి తలుచుకోకుండా వుండలేకపోయాడు. యీ భూమిమీద పుట్టాడు—భూమి యిచ్చిన ఆహార పదార్థాలతో పెరిగాడు—ఆమె యిచ్చిన మందు మాకులతో యెందరి జబ్బులనో డబ్బు తిని బాగు చేశాడు యిప్పుడు ఆమెపగరకు చెడబిడ్డనుగా
కెంత కనికరం?" అనుకున్నాడు.

"నన్ను మంచిబిడ్డనిలా నే తనలో కలుపుకుంటుంది"

"నా తల్లీ!—నా బంగారు తల్లీ!—నన్ను క్షమించమ్మా! నేనెంత కృతఘ్నుడ్ని! నాతో యిప్పుడు తీసుకపోయే దేముంది? ఈ ఇలాతలంలో యెందరో నన్ను తల్చుకొని అసహ్యించుకొనే అపకీర్తి అట్టిపెట్టి వెళ్లిపోతున్నాను. నా యీ ఎడతెగని దాహాన్ని నివ్వే నమ్మ తీర్చే గంగాజలానివి! అమ్మా! నన్ను క్షమించవూ?—క్షమించవా తల్లీ! నీ పాదాలమీద పడి మ్రొక్కుతాను—తల బాదుకుంటాను—హాయిగా నీలో కలిసిపోతాను."

ఎంతో ప్రయత్నంమీద మంచంమీదనుంచి జారుతూంటే—చుట్టూ వున్నవాళ్ళు ఆపేశారు. గుంజాటన పడుతూ ఆ మిగిలివున్న ఆఖరుశక్తితో గట్టిగా ఒక్క అరుపు అరచాడు" నా తల్లి పాదాలను ముద్దు పెట్టుకోనివ్వరూ?"

తలవేపు నిల్చొన్న కన్నకొడుకు కళ్లలోంచి రాలిన రెండే రెండు బిందువులు ఆలోచనలు విరమించిన ఆ తలప్రక్కనే తలగడమీద పడి యింకిపోయాయి!

# ప్రాణము

## శ్రీ బ్రహ్మాండం నరసింహం

నేటి భౌతికశాస్త్రజ్ఞులు సకలపదార్థమూ పరమాణువుల (అటముల) సంపుటీకరణమేననీ, అన్ని పరమాణువులలో గల పదార్థం ఒకటేననీ, అది శక్తి యొక్క తరంగరూపం గానో పలుకులు గానో ఉంటుందనీ, ఇంకా ప్రకృతి అంతా ఏకవస్తుమయమనీ చెప్తున్నారు. దాంతో ప్రకృతినిగూర్చి తెలియాల్సిందల్లా తెలుసుకున్నట్టుగానే వాళ్ళు భావిస్తున్నారు. అయితే ప్రకృతిలో ఉన్నదంతా జడపదార్థమేనా? కాదు కొన్ని ప్రాణులుకూడా ఉన్నాయి. అయితే వాటి శరీరపదార్థం అంతా జడప్రకృతిలోని సుమారు నూరుజాతుల అటములలో కొన్నిటితో ఏర్పడినదే కనుక, ఆ అటములను గురించి తెలుసుకోడం పూర్తికావచ్చింది కనుక ప్రాణులను గురించికూడా పూర్తిగా తెలిసినట్టేనా? ప్రాణులలో భౌతిక రసాయనిక పదార్థం కాక మరొకటి కనిపిస్తుంది—అది ప్రాణం. ఆ ప్రాణం అనేది ఏమిటి? ఎక్కడ ఉంటుంది? అది మొట్టమొదటగా ఎ ఏర్పడింది? అనే విషయాలు ఔత్సుక్యం కలిగించేవి. వాటినిగురించి వైజ్ఞానికులు ఏం తెలుసుకున్నారో ముచ్చటించుకుందాం.

డార్విన్ శాస్త్రజ్ఞుడు పరిణామసిద్ధాంతాన్ని వెల్లడించారు. దాన్నిబట్టి ఇప్పుడున్న జీవులన్నీ అంతకుముందున్న జీవులు పురోగమించడంవల్లనే ప్రస్తుతపు అభివృద్ధిని పొందిఉన్నాయి. ఇప్పుడు ప్రకృతిసామ్రాజ్యపట్టాభిషేకంకోసం ఉవ్విళ్లూరే గంభీర మానవుడు కిచకిచలాడే చిలిపికోతినుండి తరతరాభివృద్ధిని గాంచినవాడే. ఈ విధంగా అతి ప్రాథమికమయిన ఒంటికణపు జీవినుంచి మానవునివరకూ అవిచ్ఛిన్నమయిన వంశక్రమం తయారు చెయ్యవచ్చు కనుక ఒక్క కణంలోకి ప్రాణం ఎలా వచ్చిందో తెలుసుకుంటే మనిషిలోకి ప్రాణం వచ్చిన విధానం అర్థమయినట్టే.

పాశ్చరు, టిండర్ మొదలయినవాళ్లు ప్రాణి పుట్టుతుంది గాని నిర్జీవపదార్థంలోంచి పుట్టదని తేల్చి చెప్పేశారు. బాగానే ఉంది. అయితే మరి మొట్టమొదటి ప్రాణిలోకి ప్రాణం ఎక్కడనుంచి వచ్చింది? అదే చిక్కుప్రశ్న.

ఖగోళశాస్త్రజ్ఞులు భూమి ఏలా ఏర్పడిందో వివరించారు. మొదట్లో భూమి చాలా [illegible]గా [illegible]దనీ, ఆ వేడిలో ప్రాణం నిలవడానికే వీలులేదనీ తెలుస్తోంది. భూమి చల్లారిన తరువాతనే ఈ గోళంమీద మొదటి ప్రాణం పుట్టింది. అయితే ఎలా పుట్టింది?

అర్హీనియసు అనే ఆయన ప్రాణాలు విశ్వమంతటా ఖగోళాల మధ్య నుండే విశాల శూన్యంలో ఉంటాయనీ, భూమిమీద పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పుడు అవి వచ్చిపడి ఉంటాయనీ అన్నారు. కొన్ని సూక్ష్మక్రిముల విత్తనాలు (స్పోరులు) అతిసూక్ష్మంగా ఉంటాయి. ఎక్కడో ఇతర గోళాల్లో ఉన్న ప్రాణుల స్పోర్లు ఆ గోళాల్లోంచి తప్పించుకుపోయి విశ్వాంతరశూన్యంలో పడ్డాయనీ, అవి వెలుగు కిరణాలవల్ల కొట్టుకువచ్చి భూమిమీద పడ్డాయనీ ఆయన మతం. అయితే ఒకరన్నారు "శూన్యంలో గాలి లేదు. తేమ లేదు, వేడి లేదు (దాని ఉష్ణోగ్రత ఇంచుమించుగా —273°C ఉంటుంది), అక్కడ ఈస్పోర్లు ఎంతకాలం జీవంతో ఉండగలవు?" అని. దానికాయన "కొన్ని స్పోర్లు అతిశీతల పరిస్థితులలో కొన్ని వందల ఏళ్ళు ఉంటాయి; కొన్ని వందల ఏళ్లు బ్రతికినవి వేల ఏళ్లు బ్రతక్కపోవడానికి ఏమీ కారణంలేదు" అన్నారు.

కాని ఈ సిద్ధాంతానికి ముఖ్యమయిన అభ్యంతరం అది కాదు. అసలు ప్రాణి అనేది ఏదైనా గోళాన్ని విడిచి శూన్యంలో ప్రవేశించడం ఎట్లా? గోళం చుట్టూ ఉన్న వాతావరణంకూడా దాని ఆకర్షణవల్ల దాన్ని అంటిపెట్టుకుని ఉంటుంది. ఏ వస్తువయినా ఆ ఆకర్షణను తప్పించుకోవాలంటే ఒకానొక వేగంతో పోవాలి. ఆ వేగం గోళం పరిమాణాన్నిబట్టి ఉంటుంది. భూమిపై ఈ 'దాటువేగం' సెకండుకి 7 మైళ్ళు. అంటే ఏదైనా వస్తువు ఈ వేగంతో భూమిని విడిస్తే అది మళ్ళీ నేలమీద పడకుండా విశ్వాంతర ఆకాశంలోకి పోతుంది. అలాగే చంద్రుడిమీద ఈ వేగం 1.5 మైళ్ళు. సెకండుకి $1\frac{1}{2}$ మైళ్ల వేగంతో చంద్రుడినుంచి బయలువెడలిన వస్తువు తిరిగి చంద్రుడిమీద పడదు. అయితే ఈ వేగం ఏ వస్తువులకు వస్తుంది?

గాలిలో అనేక వాయువులు, నీటి ఆవిరి, సూక్ష్మజీవులు, వాటి స్పోర్లూ ఉంటాయి. ఈ వాయువుల అణువులు ఎప్పుడూ ఒకవైపునుంచి మరొకవైపుకి అన్ని దిక్కులా దూసుకుపోతూ ఉంటాయి. ఏదైనా మరొక అణువు ఎదురుతగిలితే అదే వేగంతో ఎదురు దిక్కుగా పోతాయి. వాటి వేగాలు వాటి అణుభారముల వర్గమూలానికి విలోమ నిష్పత్తిలో ఉంటాయి. అంటే అణువు బరువు హెచ్చినకొద్దీ దాని వేగం తగ్గిపోతుంది. ఉదాహరణకు హైడ్రోజను అణువు వేగం సగటున సెకండుకు 1.15 మైళ్లు ($0^{\circ}c$ వద్ద వేడి హెచ్చితే వేగం హెచ్చుతుంది) ఆక్సిజను (ప్రాణవాయువు) దానికంటే 16 రెట్లు బరువు. అందుచేత దాని అణువుల వేగం సె॥కు 0.29 మైళ్ళు మాత్రమే. మామూలుగా వీటి వేగాలు 7.1 ను మించవు గనుక ఇవి భూమిని వదిలి వెళ్లవు. అతి తేలికగా ఉన్న వీటి అణువులే దాటి పోలేకపోతే కొన్ని వేల అణుభారంగల ప్రాణి స్పోర్లు మాత్రం ఎలా పోతాయి? అయితే దాటువేగం తక్కువగానున్న చిన్న గోళాలయితేనో అని అడగవచ్చును. కాని అలాటి గోళాలమీద అసలు వాయుపదార్థమనేదే మిగలదు. గాలి లేనిచోట ప్రాణి మాత్రం ఎలా ఉండగలదు? అందుచేత భౌతికశాస్త్రరీత్యా జీవులస్పోర్లు బయటినుంచి ఈ గోళంమీదికి రాగల అవకాశాలు బొత్తిగా కనిపించడం లేదు.

కనుక ఏదో ఒక పరిస్థితులలో భూమిమీదనే మొదటి ప్రాణి ఉద్భవించింది. అని నిర్ధరించవచ్చును. అది ఎట్లా జరిగిఉంటుందో ఊహించాలంటే మనం ప్రాణులను గమనించాలి. ప్రాణులకూ, జడపదార్థాలకూ గల సామ్య తారతమ్యాలను తెలుసుకుంటే దాన్నిబట్టి ప్రాణం అంటే ఏమిటో అర్థం కావచ్చును.

ప్రాణుల ఒక ముఖ్యలక్షణం పెరగటం. సాధారణంగా కణములు పెరిగి చీలుతాయి. ఆ విధంగానే అనేక కణ జీవులయిన చెట్లలోను, జంతువులలోను, మానవునిలోనూ పెరకువ జరుగుతుంది. కాని కొన్ని నరముల కణాలు సుమారు నూరురెట్లు పెరగవచ్చును; చాలా ఏళ్లు పనీ చెయ్యవచ్చును; గాని చీలవు. కనుక పెరగటానికి చీలటం ముఖ్యం కాదు. పరిమాణం హెచ్చటంగూడా సాధారణంగా జరుగుతుందిగాని పెరకువలో ముఖ్యాంశం కాదు. కొన్ని బాక్టీరియా పరిమాణంలోను ఆకృతిలోను మార్పు జరగదు. బరువు పెరగవలసిన అవసరంకూడా లేదు. ఏమంటే, చిక్కుడుగింజలను చీకటిగదిలో మొలిపిస్తే, గింజలో ఆహారాన్నే వాడి మొక్క పెరుగుతుంది. కాని బరువుమాత్రం తగ్గిపోతుంది. ఏమంటే కొంత పదార్థం ఖర్చయి బొగ్గుపులుసువాయువుగా పోతుంది. నిజానికి పెరకువవలన పదార్థం ఖర్చుఅవుతుంది. అయితే ఈ లోటును ప్రాణి మళ్ళీ పూరించుకుంటుంది. సర్వత్ర, పెరకువలో జరిగేదేమిటి? కణములు నీటిని పీల్చుకుంటాయి నిర్జీవ పదార్థాలూ పీల్చుకుంటాయి. కర్రను నీటిలో పడేస్తే ఉబ్బుతుంది అది నీటిని పీల్చుకోడంవల్లే. అయితే ప్రాణులలో నీళ్లు పీల్చుకోడం మరొకవిధంగా జరుగుతుంది. దాన్ని వపానిర్గమనం (ఆస్మాసిస్) అంటారు. ఒక సన్నని పొరకి చెరొక ప్రక్కనూ వేర్వేరు సాంద్రతలున్న ద్రావణాలనుంచితే పల్చని ద్రావణంలోంచి నీరు చిక్కని దాంట్లోకి పోతుంది. కాని నిర్జీవమైన పొరద్వారా కూడా నీరు ఇలాగే పోతుంది. అందులో ప్రాణి ప్రత్యేకత ఏమీ లేదు. కనుక పెరకువ ప్రాణుల సామాన్యలక్షణమైనా, ముఖ్యలక్షణం కాదు. గింజలు మొదలయినవి చాలాకాలంవరకు పెరగవు. అనేక జీవులు—ముఖ్యంగా జంతువులు నిర్ణీత పరిమాణం వచ్చాక ఇక పెరగవు.

పైనుంచి పదార్థం తీసుకుని పెరుగుతూ జీవివలెనే కనిపించే నిర్జీవపదార్థం స్ఫటికం. కరగగలిగినంత ఉప్పును నీళ్లలో కరిగించి దానిలో ఒక ఉప్పురాయిని వేలాడదీస్తే నీటిలోని ఉప్పు కొస్తకొస్తగా వచ్చి ఈ 'రాయి' మీద పేరుకుని అది క్రమంగా పెరిగి పెద్దదౌతుంది. అట్లా స్ఫటికాలను వేరువేరు పాత్రలలో తయారుచేస్తే అవన్నీ ఒకే ఆకారం పొందుతాయి. ఒక స్ఫటికాన్ని పగలగొట్టి ఆకారాన్ని మార్చి వ్రేలగట్టినా, ఆ విరిగిన ముఖంమీద ఎక్కువగా ఉప్పుచేరి మళ్ళీ మొదటి ఆకారాన్నే పొందుతుంది. ఇక్కడ జీవితో కొన్ని సామ్యాలున్నాయి. (1) పైనుంచి పదార్థాన్ని తీసుకుని పెరగడం, (2) ఒకే ఆకారాన్ని పొందడం (3) దెబ్బతగిలిన భాగాన్ని మరమ్మతు చేసుకోడం. కాని ముఖ్య భేదాలు కూడా ఉన్నాయి. అది పైనుంచి తీసుకొనే పదార్థం దానిలోని పదార్థంవంటిదే. దాన్ని ఏ మార్పు చెయ్యకుండానే దాన్ని చేర్చుకుంటుంది. జీవులు విభిన్న పదార్థాలను తీసుకుని, వాటిని పచనం చేసుకుని, తమ ప్రత్యేకపదార్థాల్ని తయారుచేసుకొని, లోపలికి చేర్చుకొని పెరుగుతాయి. పదార్థాలు కేవలం రేణువు రేణువుగా అతుక్కోవడం కాక, ఎంచుకొన్న పదార్థాలు ఆస్మాసిస్ ద్వారా లోనికి ప్రవేశిస్తాయి. వీటన్నిటిలో ప్రాణుల ప్రకత కనిపిస్తున్నది.

ప్రాణులు సాధారణంగా గాలిలోని ప్రాణవాయువును పీల్చుకొని బొగ్గుపులుసువాయువుని విడిచిపెడతాయి. దీన్ని శ్వాస అంటాము. కొన్ని సూక్ష్మజీవులు గాలిలేనిచోట పెరిగినా, అవి ఇతర విధములుగా ఈ ఫలితాన్నే సాధిస్తాయి. ఈ ప్రక్రియవల్ల వచ్చిన శక్తివల్ల పెరుగుదలకు కావలసిన కార్యకలాపాలు జరుగుతాయి. ఇదీ ప్రాణుల ప్రత్యేకతే. ఈ కార్యములన్నీ జరగటానికి కావలసిన కొన్ని ప్రత్యేక పదార్థాలు ప్రాణులలో ఉన్నవి. వాటినిగురించి తెలుసుకోవడానికి కొంచెం రసాయనిక పరిచయం కావాలి.

జీవులలో ఉండే పదార్థాల్ని జీవజ, లేక సేంద్రియ పదార్థాలంటారు. వీటికిన్ని ఇతర జడప్రకృతిలోని పదార్థాలకు కొన్ని ముఖ్య భేదములున్నాయి. జీవజ పదార్థముల అణువులు ఇతర అణువులకంటె జటిలమైనవి. జీవజ అణువు లన్నిటిలో కార్బను అనే మూలపదార్థం తప్పకుండా ఉంటుంది. ఈ కార్బను పరమాణువు (ఆటం) చాలా వింతయినది. మిగిలిన పరమాణువులు దేనికీ దీని వింతగుణాలు లేవు. ప్రతి పరమాణువుకీ దాని స్వభావాన్నిబట్టి ఒకటినుంచి ఏడు 'చేతులు' ఉంటాయి. రెండు పరమాణువులు చేతులు పట్టుకుంటే ఒక సమ్మేళనం ఏర్పడుతుంది. సోడియముకి, క్లోరినుకి ఒకొక్క చెయ్యి మాత్రమే ఉన్నాయి. అందుచేత అవి రెండూ చేతులు కలుపుకుంటే (ఉప్పు ఏర్పడుతుంది) ఇంకో పరమాణువుతో కలవడానికి చేతులు మిగలని కారణంచేత వీలు కాదు. కనుక ఇది రెండు పరమాణువుల సమ్మేళనంగా ఉండాల్సిందే. ఆక్సిజను (ప్రాణవాయువు) కి రెండు చేతులున్నాయి. అందువల్ల అది రెండు హైడ్రోజను ఆటములతో కలిసి నీరు ఏర్పడుతుంది. ఇలాగే పరమాణువులకి చేతుల సంఖ్య హెచ్చినకొద్దీ అనేక ఇతర ఆటములతో చేరి ఇంకాయింకా జటిలమయిన పదార్థాలు ఏర్పడుతాయి. 7, 6, 5 చేతులున్న ఆటములు తరుచుగ వాటి చేతులనవే కలుపుకొని 1, 2, 3 చేతులున్నవాటిలా ప్రవర్తిస్తాయి. కనుక నాలుగు చేతులున్న ఆటములు ఎక్కువగా జటిలమైన పదార్థములుగా అవకాశములు ఎక్కువ. ఈ శక్తి కార్బను ఆటములో మరీ ఎక్కువగా కనిపిస్తుంది దీనిద్వారా కొన్ని వేల ఆటములు కలిసి ఒక అణువు ఏర్పడుతుంది

కార్బనుకు స్వతః నాలుగుచేతులు. నాలుగు పరమాణువులతో చేయి కలపగలుగు అందులో ఒక చెయ్యి మరొక కార్బను చేతితో కలిస్తే, ఆ కలిసిన కార్బనుకి మిగిలిన మూడుచేతులకు ఇతర పమాణువులు చేరి పెద్ద అణువు ఏర్పడుతుంది. ఆ రెండవ కార్బను యొక్క మిగిలిన మూడు చేతులలో ఒకటి మళ్ళీ మరో కార్బనుతో కలిసినట్టయితే, మూడు కార్బను ఆటముల గొలుసు ఏర్పడుతుంది. ఈ విధంగా 25, 30 ఆటముల గొలుసులుకూడా ఏర్పడవచ్చును. ఈ గొలుసులో ఏ కార్బనుకైనా తగులుకొని మరొక గొలుసు ఉండవచ్చు. ఈ గొలుసులోని మొదటి కార్బను ఆటముతో చివరిది చేయికలిపి 'తావళము'గా ఏర్పడవచ్చును. వాటితో కలసిన ఇతర పరమాణువులనుబట్టి ఇట్లు ఏర్పడిన పదార్థములు ఆమ్లములు (ఆసిడ్లు) కావచ్చు, ఆల్కహాలు కావచ్చు. అమైనో ఆసిడ్లు కావచ్చు

కార్బను గొలుసులో ఒకదానికి నైట్రోజను పరమాణువు రెండు హైడ్రోజను పరమాణువులతో వచ్చికలిస్తే, రెండో చివర ఆసిడులక్షణమునిచ్చే కార్బాక్సిల్ కూటమున్నపుడు ఆ పదార్థాన్నే 'అమైనో ఆసిడు' అంటారు. వీటిలో ఏర్పడిన జటలమయిన పదార్థాలనే ప్రొటీనులంటారు. ప్రాణులలో ప్రత్యేకంగా కనపడేవి ఈ ప్రొటీనులే. వీటి అణువులు అనేకవేల పరమాణువులతో ఏర్పడుతాయి. ఉదాహరణకు కోడిగుడ్డు సొనలోని ప్రొటీను అణువులో 1428 కార్బనువి, 2244 హైడ్రోజనువి, 364 నైట్రోజనువి, 462 ఆక్సిజనువి, 14 గంధకంవి పరమాణువులు కలిసిఉంటాయి. ఇంతకన్నా జటిలమైన కూర్పుగల అణువులుకూడా ఉన్నాయి. వీటిచుట్టూ విద్యుత్ ఛటుకులు ఉండటంవల్లను, ఒకేవిధమైన ఛటుకులుగల అణువులు ఒకదానినొకటి వికర్షించుకోడంవల్లను, అవి ద్రావణంలో క్రిందికి దిగిపోకుండా ఎప్పుడూ కదులుతూఉంటాయి. ఇలాంటి పదార్థాలనే కొలాయిడులని అంటారు. ప్రొటీనులు కొలాయిడు రేణువులుగా ఉండటంవల్ల, వాటి ఉపరితలం మీద అనేకరకాల పదార్థాలను చేర్చుకోడం, మళ్ళీ విడవడం, ఈ విధంగా ఇతర రసాయన క్రియలకు తోడ్పడటం జరుగుతుంది. ఇలా తమ రూపభంగం రాకుండా ఇతర ప్రక్రియలను వేగిరపరచే జీవపదార్థాలను జీవచోదకములు లేక ఎన్జైములని అంటారు. ఇవి జీవం ఉన్న ప్రతిపదార్థంలోనూ ఉంటాయి. జీవిలో జరిగే సర్వకార్యాలూ ఈ సహాయంవల్లనే జరుగుతున్నవి. శ్వాసక్రియకూడా సుమారు 50 ఎన్జైముల కృషిఫలితంగానే జరుగుతున్నది.

జీవకణాన్నొకదాన్ని సూక్ష్మదర్శినికింద చూస్తే దానిలో మధ్య న్యూక్లియసు అనే ఉండ,

దాని చుట్టూ జీవపదార్థమున్నూ ఉంటాయి. కణాన్ని పొడిచి కొంత కణ పదార్థాన్ని తీసేసినా కణం చనిపోదు. పోయిన పదార్థాన్ని మళ్ళీ తయారుచేసుకుంటుంది. కాని న్యూక్లియసును మాత్రం తీసివేస్తే కణం చనిపోతుంది. కనుక కణంలోని ప్రాణం న్యూక్లియసులో ఉన్నదని తలపోయవచ్చును

న్యూక్లియసులో క్రోమొసోములనే పోగులున్నాయి. ఒక శరీరంలోని కణాలన్నిటిలోను ఇవి ఒకే సంఖ్యగా ఉంటాయి ఈ సంఖ్య ఒకొక్క జాతిలో ఒకొక్కటిగా నిర్దిష్టమయిఉంటుంది. ఆ జాతికి చెందిన ఏ ప్రాణిలోనైనా దాని ఏ కణంలోనైనా అదే సంఖ్యగల క్రోమొసోములే ఉంటాయి. ఉదాహరణకు మానవుని కణములలో వీటి సంఖ్య 48. వీటిమీద సూక్ష్మదర్శనిలో కూడా కనబడని చిన్న నలుసు లుంటాయి. వాటిని జీను లంటారు. పోలికలు తరతరానా రావడానికి కారణం అవేనట. ఒకొక్క జీను ఒకొక్క లక్షణం వ్యక్తం కావడానికి కారణం. కణాలు చీలేటప్పుడు ఇవి రెట్టింపయి, ఒకటి ఒక పిల్లకణంలోకీ, మరొకటి రెండో దాంట్లోకీ పోతాయి. దానినిబట్టే జీవికి వాటి ప్రాధాన్యత ఎంతదో తెలుస్తుంది. జీవిలో జరిగే ప్రతీ పనికీ, ప్రతి అవయవపు పెరుగుదలకీ, ఆకృతికీ, అన్నిటికీ ఈ జీనులే కారణం. ఎక్సురేలతో వాటిలో కొన్నిటిని కొట్టివేస్తే సాధారణంగా ఆ కణం చనిపోతుంది. ఒకొక్కప్పుడు ఒక్కటి పోయినప్పటికీ కణం చనిపోతుంది. ఈ జీనులు ఒక కణంలో కొన్ని వంద లుండవచ్చును కాని అందులో ఒకటి లోపించినా ప్రాణంపోతుంది. కనుక ఈ జీనులలోనే ప్రాణం ఉందని మనం అనుకోవచ్చు.

ఈ జీనులను పరిశీలించినవారు ఇవి జటిలమయిన ప్రోటీను కణములయి ఉండవచ్చునన్నారు. వాటి పరిమాణం సుమారు 2, 3 మిల్లిమైక్రాను లుండవచ్చునట. మిల్లిమైక్రాన్ అంటే ఒక మిల్లిమీటరులో పదిలక్షవవంతు. కణం పరిమాణంలో ఇది ఎంతో చిన్న భాగం. ఈ జీనుల తత్వం ఒకొక్కప్పుడు హఠాత్తుగా మారిపోతుంది. మాటవరసకి, ఒక జీను నల్లజుట్టు కలిగిస్తూఉంటే, అది మారినతరువాత రాగి జుట్టును కలిగించవచ్చును. ఇట్లా మారిన జీను తిరిగి పూర్వరూపానికి వెనుమారటంకూడా ఉంది. ఇట్టి మార్పులను ఎక్సురేలద్వారాను తదితర మార్గాల ద్వారాను కలిగించవచ్చునుకూడా. వీటినిబట్టి చూస్తే కూడా జీను జటిలమైన ప్రోటీననీ, ఏదో ఒక అణుకూటం ఒక కార్బను కొక్కెమును విడిచి మరియొక దానిని తగులుకోడమో, లేక దాని స్థానే మరియొక అణుకూటము తగులుకోవడంవల్లనో ఈ హఠాత్తు మార్పులు జరగడానికి కారణం అనీ అనిపిస్తుంది. ఈ మార్పులలో కొన్ని మృత్యుదాయకములయినవి కూడా ఉన్నాయి. అంటే ఆ మార్పు జరిగినందువల్ల ఆ కణంగాని, దానినుండి జనించిన జీవులుగాని, చనిపోతాయి అంత చిక్కు కూర్పుగల జీనులో ఒక్క పరమాణువు ఒకవైపునుంచి పోయి మరొకవైపున చేరినా ప్రాణం పోతుందంటే ఎంత సున్నితమయినదో ఆ ప్రాణం!

వైరసులనే కొన్ని పదార్థాలు మానవులలో, జంతువులలో, చెట్లలో అనేక జబ్బులని కలిగిస్తాయి. మన 'అమ్మవారు' ఇలాంటిదే. చాలకాలంవరకు వీటినిగురించి బాగా తెలియదు. ఏమంటే ఇవి సూక్ష్మదర్శినిలో కూడా కనరావు. స్టాన్లీ అనే ఆయన పొగాకుమీద మచ్చల తెగులు పుట్టించే వైరసును వేరు చేశాడు. తెగులు తగిలిన ఆకులను నలిపి రసంతీసి దానికి అమోనియా ఉప్పులను కలిపి విరిచాడు. క్రిందకు దిగిన ప్రోటీనును మళ్ళీ నీళ్ళలో కలిపి మళ్ళీ విరిచి స్వచ్ఛపరచాడు. ఇట్లా పదిసార్లు విరిచి స్వచ్ఛపరిచిన పదార్థం స్ఫటికములుగా ఏర్పడింది. మన కింతవరకు తెలిసిన జీవపదార్థాలేవీ స్ఫటికంకాలేవు. అయి జీవంతో ఉండలేవు. అయితే దీనిలో జీవముందా అనడానికి ఒకటే పరీక్ష చేశాడు. ఈ స్ఫటికాలని ఒక చిటికెడు తీసుకుని, దానికి పదికోట్ల రెట్లు నీళ్లను కలిపి, ఆ ద్రావణం ఒక్క చుక్కను పొగాకు మొక్క మీద రుద్దాడు. మామూలు కాలానికి ఆ మొక్కకు తెగులువచ్చింది. యథాప్రకారం ఇతర మొక్కలకు ప్రాకింది. అంటే ఈ స్ఫటికాలు మొక్కలో ప్రవేశించంగానే పెరగడం వృద్ధిపొందటం ప్రారంభించిన వన్నమాట. రసాయనికంగా సంశోధించిన ఈ స్ఫటికములే వైరసులన్నమాట. వాటిలో జీవం ఉండి ఉండాలి. ఇక్కడ నిజంగానే జీవ నిర్జీవ లక్షణాలు కలిసి ఉన్నాయి. స్ఫటికం ఏర్పడటంలో నిర్జీవలక్షణం ద్యోతకమవుతున్నది. పైగా సీసాలలో అగార్ మొదలయిన వస్తువులపై వేసి పెంచలేము. బాక్టీరియాను ఈవిధంగా పెంచవచ్చును. ఈ స్ఫటికములు పెరగవు. చీలవు. శ్వాసవంటి జీవకార్యములను చేయవు. కాని పొగాకు ఆకుమీద దానిలో ఒక నలుసుపడినా చాలు. వెంటనే ఈ అణువులసంఖ్య పెరగటం ప్రారంభిస్తుంది. కొద్దిరోజుల్లోనే పొలంఅంతా

పాకుతుంది ఎన్నో రెట్లు వైరసు తయారవుతుంది. ఇది జీవలక్షణమేగా. ఇదే ఇతర మొక్కలమీద ఏమీ పనిచేయదు. కనుక దీని జీవలక్షణాలు కొన్ని ప్రత్యేక పదార్థాల (ప్రొటీనుల) మధ్యనైతేనే వ్యక్తమవుతాయి. వాటిపై వైరసు పనిచేసి, వాటినుండే బహుశః కొత్త వైరసు పదార్థమును సృష్టిచేస్తుంది.

ఇక్కడే వైరసుకున్నూ జీనుకున్నూ సామ్యం ఉంది. ఇంచుమించుగా రెండిటి పరిమాణం ఒకటే. రెండూకూడా చాలాకాలం జడంగా ఉండి ఒక్కసారిగా పనిలోకి ఉరకగలవు. విత్తనంలోని జీనులు, సీసాలోని వైరసు జడముగానుండేవే గదా! జీనులు హఠాత్తుగా మారినట్లే వైరసులుకూడా మారుతయి. అట్లా మారిన జాతులు పొగాకుమచ్చల వైరసులో కూడా ఉన్నాయి.

కాని జీనులు తోటి జీనులతో కలిసిగాని పని చేయవు. అందువల్ల వైరసుకంటె ఎక్కువ క్రమబద్ధమైనపని తోస్తుంది. అసలు విడిగా ఒక్క జీనుకు ప్రాణం ఉందా అని సందేహం. అట్లాగే విడిగా వైరసుకుకూడా ప్రాణంలేనట్టే కనిపిస్తుంది అది మొక్కల ప్రొటీనులతో కలిసినపుడే దాని జీవత్వం వెల్లడవుతుంది.

దీన్నిబట్టిచూస్తే ప్రాణి అనేది, పదార్థం క్రమబద్ధం కావటంలో, ఒకదశ. పదార్థపు అతి సూక్ష్మరూపం ఎలెక్ట్రాన్ రేణువులు. ఇవి పదార్థమే అవునో కాదో తెలియదు. ఇట్లా ఉన్నప్పుడు వాటిలక్షణాలు కొని, ద్యోతకమవుతాయి. ఇవి కొన్ని కలిసి పరమాణువులు కావటం పదార్థ నిర్మాణంలో ఒకదశ. ఇట్లా కలిసిన పరమాణువుల లక్షణాలు కొత్తగా ఉంటాయి. ఈవిధంగానే లోహములు, ఇతరమూల పదార్థాలు తయారైనవి. ఇట్టి మూలపదార్థాలు కొన్ని కలిసి సమ్మేళనము లేర్పడటం పదార్థనిర్మాణంలో మరొకదశ. మూలపదార్థాల్లో ద్యోతకంకాని కొన్ని లక్షణాలు ఈదశలో వ్యక్తమవుతాయి. కార్బను పరమాణువులతో ఇట్లాంటి అణుపుంజాలు కలిసి అనేక అణువులుగల పెద్దపెద్ద అణుకూటములు ఏర్పడుతవి. ఇది పదార్థ నిర్మాణంలో ఒక ముఖ్యదశ. ఈదశకు కొన్ని అనుకూల పరిస్థితులు కావలెను. అవి సరిగ్గా నేడు భూమిపైగల పరిస్థితులే. ఇంతకన్న వేడి ఎక్కువయినా, తక్కువయినా, గాలిలో ప్రాణవాయువు హెచ్చినా, తగ్గినా, గాలిలో బొగ్గుపులుసు వాయువు హెచ్చినా తగ్గినా ఇలా వేల కొద్ది పరమాణువులు చేరి ఉండలేవు ఇంత బరువైన అణుకూటములకు కొన్ని ప్ర      లుంటాయి. అవే కొలాయిడు లక్షణములు. ఇంతవరకూ ఇవన్నీ జడంగానే కనిపిస్తాయి. లాబొరేటరీలో మనం పరిశోధన చేసి సాధించగలవిగానే ఉంటాయి.

దీని పైదశలో ఇంతకన్న జటిలమయిన ప్రొటీను లేర్పడి ఇతర జీవజపదార్థముల కలయిక ఎడబాటులను నడుపుతూ ఉంటాయి. ఇవే ఎన్జైములు. ఇందులోనే ప్రత్యేకత నొందినవి జీనులు, వైరసులు అయి ఉంటాయి. ఇదే జీవనిర్జీవసంధి. ఈదశలోనే ప్రాణం ఉద్భవించింది. వీటి తరువాతిదశ సూక్ష్మక్రిములు. వాటి పైదశలో చెట్లు, జంతువులు ఉన్నాయి. వీటి యందు అనేకకణములు చేరిఉంటాయి. దేహకార్యాలను పంచుకుంటాయి. వీటన్నిటిని పంచి పర్యవేక్షించవలసిన అవసరం ఏర్పడింది. ఈకార్యం నెరవేర్చడానికి ప్రత్యేకలక్షణాలుగల కణములు ఉద్భవించినాయి. వీటి చైతన్యమే బహుశః మనస్సు అయి ఉంటుంది. అనగా మనం పదార్థాన్నుంచి విభిన్నమని తలచేమనస్సు, పదార్థాన్నిగూర్చి వివరాలను తెలుసుకోవాలనే మన మనస్సు, కూడా ఒక పదార్థమే. దాని చైతన్యం ఒకానొక జటిల పదార్థపు లక్షణమే. అతి సాదాగా కనపడే ద్రావణంలో రెండు లోహపు కడ్డీలు పెట్టి వాటిని తీగెతో కలపంగానే అందులోంచి విద్యుత్తు వ్యక్తమయినట్లుగానే పదార్థము ఒకానొక స్థితిలో ఉన్నప్పుడు మనోశక్తి వ్యక్తమవుతుంది. జడపదార్థపు క్రమీకరణంలో రాడారు ఎట్టిదో, జీవపదార్థపు క్రమీకరణంలో మనస్సు అట్టిది.

ప్రాణిలోని ప్రత్యేకతకు కారణమైన జటిల పదార్థాలు ఏర్పడటంలో ముఖ్యమయినవి ఎన్జైములు. ఇవే లేకపోతే, కణంలో జరిగే ఏ జీవకార్యమూ నెరవేరలేదు. జీనుకూడా ఒక ఎన్జైములాంటిదే. అది ఎన్జైములను సృష్టించే ఎన్జైము. దానికి తనను తాను రెట్టించుకోడం చాతనౌను. ఎన్జైము లేర్పడటమే 'ప్రాణి' అవతరించటానికి నాంది అయిఉంటుంది. ఎన్జైములే ప్రాణం కాదేమోగాని, అవి ప్రాణానికి ప్రాతిపదికలు. ఎక్కడ ఎన్జైములున్నాయో అక్కడ జీవచైతన్యం ఉంటుంది. నిజానికి ప్రాణంమాత్రం ఏమిటి? కణంలో సర్వకార్యాలు సక్రమంగా జరిపే చోదకశక్తేగా! ఎన్జైముయొక్క విధికూడా సరిగ్గా అదే. కనుక ఎన్జైములు ప్రొటీనులతో కలసినచోటనే ప్రాణం 'పుట్టి' ఉంటుంది. అవి పనిచేస్తూఉండిన చోటనే ప్రాణం నిలచిఉంటుంది.



# గురజాడవారి రచనలు వీరేశలింగంగారిపై దాడి

**శ్రీ పారనంది జగన్నాథస్వామి**

ఈమధ్య అచ్చుపడ్డ గురజాడ వ్యాసచంద్రిక లోని ప్రథమవ్యాసం "కావ్యాలలో శృంగారం". ఆ వ్యాసం అంతా ఎనిమిది పుటలు గలది. వాటిలో ఆరు పుటలలోని విషయము వీరేశలింగంగారు పచ్చిబూతు శృంగారాన్ని ఉపయోగించారనే చర్చ. ఆ వ్యాసంలో ఆధునికులను ఇద్దరిని మాత్రమే స్మరించారు. మూడు పంక్తులుగల ఒక చిన్న పేరాలో వం వేంకటరాయ శాస్త్రిగారిని వీరేశలింగంగారిని గురించి వ్రాసిన రెండు పేరాలమధ్యను ఉదహరించారు. కాబట్టి వ్యాసం సామాన్య వస్తువు కలదిగా నామకరణము చేయబడినా, ఆ వ్యాసానికి ప్రధాన వస్తువు వీరేశలింగంగారు అని నిశ్చయించవచ్చును.

వీరేశలింగంగారు చేసిన నేరానికి సాక్ష్యంగా వారి గ్రంథాలనుండి ఉదాహరణలను గురజాడవారు పొందుపరచారు. అపూర్వబ్రహ్మచర్యము నుండి మూడుపుటల భాగాన్ని ముద్రింపించి, మిగిలిన పచ్చిబూతుల "నెత్తి వ్రాయుట తగదుకాని సత్యమరయగోరినవారి కొరకు కొన్ని పుటలను సూచించెదము" అని, వ్యాసం 9 పేజీలో నాల్గింటిని 13 పుటలో 15 నింటిని, సంపుటము, పుట, పంక్తి వివరాల పట్టీని గురజాడవారు పొందుపరచారు. "వ్రాయుట తగదు" అనే మాటలవలన, వ్రాసినదానికంటె ఎక్కువ పచ్చిగా ఈ పట్టీలోనివి ఉండవచ్చునని, వాటిని చూడడానికి చాలా ప్రయత్నించాను. లభించలేదు. గురజాడవారి నాటి ముద్రణము దొరకలేదు; ఇప్పుడు దొరికే ముద్రణములోని పుటలు పంక్తులు సరిపడలేదు. "సత్యము అరయ సాధ్యము కాలేదు. కాని వారు పుట పంక్తులను చూపడమువలన, ఆ ఉదాహరణలు వ్యసపదాలు మాత్రమేగాని, అనగా వ్యాసం 9 పుట 7 పంక్తిలో నిరూపించిన "చుంబనాలింగనులు" వంటివి గాని, గ్రంథభాగాలు అయియుండవని నేను ఊహించుకొన్నాను. వారు చూడమన్న అభాగ్యోపాఖ్యానాదులలోకూడా ఇట్టి వ్యస్తపదాలు మాత్రమే కనబడడము నాఊహను బలపరిచింది. బ్రాహ్మవివాహములోని "అంకు పురాణాలు" కూడా అట్టి వ్యస్తపదాలే. "పురాణము" అనడమువల్ల విషయము కావలెనని చెప్పవలసివస్తుంది. విషయము కావడానికి పుట పంక్తి సూచకము కానేరదు. ఒక అంకమో, ఒక రంగమో, అథమము ఒక పుటో కావాలి. పంక్తి అన్నప్పుడు వ్యస్తపదాలే సూచకములు. ఇక విషయంగా కనబడడానికి వ్యాసం 14 పుటలో నాలుగు గ్రంథాలలోని విడివిడి స్థలాలు నిరూపింపబడినవి. "సత్యము అరయుటకు" వాటిని వివరించక తీరదు.

ఒకటి బ్రాహ్మవివాహము సప్తమాంకను రెండోరంగము. దాని కథ: భర్త 60 సంవత్సరాల ముసలి; అతనికి 14 సం॥ బాలికతో గర్భాధానం. "ఆనాటి శోభనపు పెండ్లికొడుకు పెండ్లికూతురిమీద చెయ్యియినా వెయ్యలేదని తలుపు కంతల్లోనుంచి చూచిన అమ్మలక్కలందరూ చెప్పుకున్నారు.": ఇది వీరేశలింగంగారి వాక్యం పచ్చిబూతుశృంగారానికి నిదర్శనం అప్పారావుగారి వాదములో! తరువాత కథ: ఆ భార్య భర్తఆస్తికొరకు కొడుకు కావాలని వ్యభిచారం ప్రారంభించింది. ఆతరువాత జరిగిన దావాలో గెలియడానికి ప్లీడరుతో వ్యభిచరించింది. ఆమె పేరు చిన్నమ్మ; శృంగారకావ్యాలలోని మురిపెంపు పేరు కాదు. "ప్లీడరు చిన్నమ్మ పడకయింట్లో ప్రవేశించి తలుపు లోపల గొళ్ళెం పెట్టుకొని నాలుగు గడియల సేపు వుండి వెలుపలకి వచ్చేస్తూవుండేవాడు." ఇది శృంగారవాక్యమా? ఇట్టివే అన్ని వాక్యాలున్నూ. ఈ వ్యాక్యాలు విన్న భానుమూర్తి భావాలు ఎట్టివి గదా! "ఈ అంకు పురాణాలతో కాలక్షేపము చేసినాము" అని విసుగుకొంటూ వెళ్ళిపోయినాడు.

ఇక రెండోది, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము. దీనిలో చూడమన్నది ఒక పద్యము; ఆశ్వా $I$ – 33. ఇది నాయికా సౌందర్యవర్ణనలోనిది. ఈ పద్యంలో తీరా ఏమీ అసభ్యత కనబడలేదు. 34—35 పద్యాలలో సొగసువర్ణన ఉంది: ఈ పద్యాలు చూడమన్నవి కావు. వీటిలో "చనుగట్టు" అన్నమాట మాత్రము దొర్లింది. అచ్చటి "పచ్చిబూతు శృంగారము" అంతా ఇంతే!

మూడోది అభాగ్యోపాఖ్యానము. దీనిలో 52 నుండి 84 వరకు చూడమన్నారు. వీటిలోని విష

యము నాయిక సొగసు, ఆమెతో అభాగ్యుని సరసము! 52 లోను 65 లోను "జన్నులన్" అన్నమాట మాత్రము; 55 లోను 61 లోను "దారుణ లీలం గౌవుంగలించి" (సాధారణ రూపం విడిచి అసాధారణ రూపం ఎంచేరు); 69-70 లలో "ఉంకులాడి" అన్నమాట; 77 లో "డినితో గలిపెద వేనిన్" అని; 81 లో "కూకుట కుబ్బున సమ్మతించె" అని; 82లో "గదిలోను దూఱుమనుచు సైగ చేసిన వాడును వేగ జొచ్చి తలుపు లోపల బిగియించి" అని. ఇవి "పచ్చి బూతుశృంగారా"లు. చూపుచున్న 33 పద్యాలలో 8 స్థలాలు మాత్రము ఉదాహరణీయములు. వాటిలోనివి 6 కేవల పదాలు, 2 విషయమును సూచించేవిన్నీ.

నాలోది రసికజన మనోరంజనము. *IV* ఆశ్వా 114 చూపుచున్నారు ఆ పద్యంలో ఏమీ లేదు. సత్యను అరయుటకు ఆ ఘట్టమంతా వదికాను. పెళ్లికూతురి ప్రథమ సమావేశము ఉదంతము పడకగదిలో వేచియున్న రసిక భర్తవద్దకు సిగ్గుపడుచున్న పిల్లను చెలికత్తెలు పంపే వర్ణన. 104 (బహుశః 114 అచ్చు పొరపాటు)లో "బాస్పు చేర్చ", 112 లో "మునుద విరిపాన్పు పయికి రాదిగిచికొనుచు" 113లో "వలపు బయల్పడె ముద్దిడి-వెలదుకతోఁ గూడి రేయి వేడుక నింపెన్"

ముద్దు అన్నమాట, సంగమ సూచకముగా అనే మాటలున్నా "పచ్చిబూతు శృంగారం!"

ఈ నేరాలను వీరేశలింగం గారిపై జూపి, రెండు విమర్శక వాక్యాలు వ్రాశారు. (1) "ప్రాచీనుల వ్రాత అణగద్రొక్కబడినది" (2) "సంఘ సంస్కర్తలైనను రక్తబలముచేత ప్రాచీన కవుల శృంగారము వీరికి అనూలాగ్రముగా నబ్బినది." వీటిని ఖండించెదను తర్కించెదను. విపులముగా వివరింపబడిన ఉదాహరణాలను చదువరులు విమర్శపూర్వకంగా గమనించి నపుడు మొదటి నేరముయొక్క అతిథ్యము బయలు పడగలదు. నాలుగైదు వ్యస్తపదాలు, ముద్దు, చన్ను, కౌగలింపు, ఉంకు అన్నవిన్నీ, సంగమార్థమును సూచించేవి, (వ్యక్తపరచేవి కావు) అవయవ సంపర్కమును సూచించేవి కొన్నిన్నీ ఆఉదాహరణలలో ఉన్నవి. ప్రాచీన వర్ణనలతో వీటిని పరిపోల్చి చూపడానికి రెండు కారణాలచేత జంకిపోయినాను: ఒకటి అసభ్య ప్రలాపన ఎక్కువగునని, రెండోది గ్రంథ విస్తృతి భయముచేత. గురజాడవారు ప్రాచీనుల ఘనతకు చాలా న్యూనత తెచ్చిపెట్టారని నొచ్చుకొన్నాను గాని, ప్రాచీనుల వర్ణనల పరామర్శ చదువరులకు విడిచిపెట్టడమే ఉత్తమమని నిశ్చయించాను. అయినా కొన్ని స్థలాలను నిరూపించెదను. కుమార సంభవం *I*-37; శృంగారనైషధం *III*-196; *VII*-165 నుండి ఆశ్వాసాంతం; *VIII* - 44 - 91; గీతగోవిందం - 23 అష్టపది దాని శ్లోకాలు; మనుచరిత్ర *II* - 67—68; *III* - 115—116; *VI* - 8—36, 69—71. విజయవిలాసం *I* - 16, 33—41, 71—114; *II* - 25—35, 194; *III* - 221—226. ఇవి నా వాదానికి చాలునని కళాపూర్ణోదయం, శృంగారకావ్యాలు ఇతర ప్రబంధాలు చూపలేదు.

అయి ఇట్లు గురజాడవారు తెలియక విమర్శించారా? కాదుకదా. కారణ మేమైయుండును. వీరేశలింగం గారిపై అసహ్యము-అగౌరవము కలగాలని గదా గురజాడవారి ప్రయోజనము కారణము నిరూపించడానికి తగిన ఆనాటి సామగ్రి దొరకలేదు. నా ఊహ, బహుశః వీరేశలింగం గారు గురజాడవారి కన్యాశుల్కంపైఏమైనా ఎక్కడైనా చణికినారేమో. అట్టి తగిన ఆగ్రహ కారణము ఉండనిదీ గురజాడవారి వ్యాసములోని కొన్ని వాక్యములకు సందర్భముచి కానరాదు.

గురజాడవారు సంప్రదయాతీతులు. కళాప్రియులు రసికవరులు. శ్రీ ఆనంద గజపతి మహారాజులుంవారి ఆస్థాన సభ్యులలో ఒకరు. ఈ కాలములో విజయనగరం సాహిత్య సంగీత నృత్యాది లలితకళలకు ఆస్థానమైయుండేది. ఈ కళలలో ప్రప్రథానస్థానము ఆక్రమించినది శృంగారానుషంగికము. దీని అనుచరులలో ముఖ్యమైనవారు కళావంతులు, సానులు, భోగంవారు, నాచ్ గర్ల్సు, డాన్సింగు గర్ల్సు అనే సార్థక నామాలక్రింద ప్రసిద్ధికెక్కినవారు. ఆ రోజులలో విజయనగరం కళావంతులు గొప్ప కీర్తిని సంపాదించినవారు. వీరి లాలిత్యము అనేకమంది నాగరికులను ఉద్యోగస్థులను ఆకర్షించేది. దొరలలో సర్వసాధారణముగా లభించేది స్త్రీలతో సాంఘిక కాలక్షేపము; అది మనలో కావాలని కోరేవారికి ఆ రోజులలో ఈ కళావంతులలోనే దొరికేది. సాయంకాలము కాగానే ఈ కళాప్రియులు ఆ కళావంతుల గృహాలలో చేరి మాటలు, పాటలు, పేకాటలు, నృత్యము, తాంబూలము, పానము మొదలైన వినోదాల ద్వారా లాలిత్యకళలను కడుపు నిండా హృదయము నిండాను అరగించి ఏ పది

గంటకో స్వంతగృహాలు చేరుకొనేవారు. కొందరు స్వంతగృహాలలో ఈ వినోదాలకు ఏర్పాటులు చేసేవారు. నాగరక కుటుంబాలలోని గృహిణులు కూడా పాటకి అలవాటు పడినవారు ఉండిరి ఇది ఆనాటి నాగరకత, నాజూకుతనం, కళారాధన.

ఈ కళావంతులతో ఎట్టి సంబంధ సంపర్కాన్ని అంగీకరించని సంస్థ బ్రహ్మసమాజము వారు భోగం వారు కాబట్టి వారి కళాలాలిత్యము కూడా సంఘానికి క్షేమకరముకాదని ఖండించినది పారిశుద్ధ్య సంస్థ; అది ప్యూరిటీ సంఘము అని ఆంధ్రదేశంలో విస్తరించింది. దానికి శ్రీ వెంకటరత్నం నాయుడుగారున్నూ శ్రీ వీరేశలింగంగారున్నూ విశిష్ట నాయకులు. ఉపన్యాసాలద్వారా వ్రాతలద్వారా తీవ్రంగా ఈ సంస్థను విస్తరింపజేయ నుద్యమించినవా రిరువురు. అనేక వ్యాసాలలోను, ప్రహసనాలలోను భోగం మేళాలను, వేశ్యల సంబంధాలను కఠినంగా నిరసించారు వీరేశలింగంగారు వీరు వారి ఉద్యమానికి ప్యూరిటీ సంస్థ అని నామకరణము చేయగా వారితో అంగీకరించనివారు 'ఆంటి నాచ్చి' అనే పేరుతో వారి ఉద్యమాన్ని వెక్కిరించేవారు. గురజాడవారిని బ్రహ్మసమాజ మతావలంబకులనిన్నీ, సంఘ సంస్కరణాభిమానులనిన్నీ వారి శిష్యులూ అనుచరులూ నిరూపించినా ఈ కళావంతుల కళారాధన గురించి మాత్రము గురజాడవారు వీరేశలింగంగారు భిన్నాభిప్రాయము గలవారని ధైర్యముతో చెప్పగలను. నేను ఇద్దరినీ ఎరుగుదును. వారిరువురు కొంచెము ఎక్కువ తక్కువలలో సమకాలీనులు. వీరేశలింగంగారి వివేకవర్ధని తుదదినములు గురజాడవారి కన్యాశుల్కం సమకాలీనమైనట్లు గోచరిస్తున్నది. ఇదమిద్ధమని నిర్ణయించడానికి కావలసిన సామగ్రి ఈ గ్రామంలో లభించింది కాదు. కన్యాశుల్కంలో చాలా మార్లు పరిహసించబడిన ఆంటినాచ్చి, ప్రొనాచ్చి అన్నవి ఈ పరిస్థితులలో జనన మొందెనని నా ఊహ. మరియొక సంగతి:

వారి కన్యాశుల్కంలో ఒక్కమారే వీరేశలింగంగారి నామము ఉచ్చరింపబడినది. అది కూడా అంత ఆమోదప్రద సందర్భంలో పడలేదు. రాజమహేంద్రవరంలోని వారి వితంతు శరణాలయం పేరుకు బదులుగా ఒక నామములేని వితంతుమఠం స్మరింపబడింది.

ఈ ఊహకు ఉపస్తంబకంగా వ్యాసచంద్రిక - వ్యాసంలోని విమర్శక వాక్యాలను నిరూపిస్తాను. ఆ వ్యాసంలో ఆరంభం పచ్చి బూతుశృంగారం అన్నది త్రలలో నిరాటంకముగా ఆమోదింపబడియుండెననే తర్కము. అలాగే మనదేశంలోని సంస్కృత వాఙ్మయములోను ప్రాచీనాంధ్ర కవులలోను ఉపయోగింపబడియుండెననే వాదము. కాని వీరేశలింగంగారి గురించి మాత్రము ఈ పూర్వామోదము కానరాలేదు. ఈ సందర్భంలో గురజాడవారి విమర్శలోని రెండు సంగతులను నా మీది ఊహకు బలంగా ఉదాహరిస్తాను. (1) "సంఘ సంస్కర్తలైనను రక్తబలముచేత మన ప్రాచీనకవుల శృంగారము వీరికి ఆమూలాగ్రముగా నచ్చినది." (2) "ఇట్టి గ్రంథరచన లోకమునకు హానిచేయును. దీనిని నిలుపవలయునని మా మతము"

ఇందులో మొదటిదానిలోని "సంఘసంస్కర్తలైనను" అన్నది "రక్తబలముచేత' అన్నది విమర్శన, ఖండనలకంటె ఎక్కువగా ఆగ్రహాభిలోక్తులు అని నా మనవి ఈ ప్రహసనాలు సుమారు వారి 44 సంవత్సర ప్రాంతాన వ్రాసినవి అంతకు పదిసంవత్సరాలపూర్వము సత్యసంవర్ధని, వివేకవర్ధని పత్రికలలో వేశ్యల గురించి బాల్య వివాహముల గురించి తీవ్రమైన నిరసన వ్యాసాలు వ్రాసే ఉన్నారు వాటిలో ఎక్కడా కూడా పచ్చి శృంగారకాంక్ష ఉన్నట్లు ద్యోతకమైనా కానరాదు. 34 వయస్సునలేని "రక్తబలము" 44 న వచ్చింది కాబోలు! ఈ రక్తబలానికి ఉపయోగము పచ్చి బూతుశృంగార వర్ణనద్వారానా! రసిక కవులకే విశేషము ఈ మార్గసాధన ఆ శృంగారకాంక్ష అంతా నాలుగైదు పదాల వాడుకలోను, రెండు మూడు ఉదంతాల సూచన వాక్యాలలోను సంతుష్టి చెందిందా! రక్తబలానికి ఇంత అల్పసంతుష్టా! వారు వ్రాసిన సహస్ర గ్రంథాలలోను ఆ మూడు ప్రబంధాలలో మూడు స్థలాలలోను ఆ రెండు ప్రహసనాలలోను మాత్రమే రక్తబలమువలన సంక్రమించిన శృంగారకాంక్ష విరమించి ఉంటుందా? అదే కారణమైతే కేవలము పచ్చిగాను, అవయవాల వర్ణనల వివరాలతోను, రత్యాది సంభోగసూచక సంగతులతోను వారివర్ణనలు నిండియుండును. అంతే కాకుండా వారిని ఎరిగినవారు ఎవరూ వారికి రక్తబలబాధ ఆరోపించరు వారు ఎప్పుడూ కూడా మంచి ఆరోగ్యస్థితిలో ఉండలేదు. వారి శరీరాన్ని పీడించిన శ్వాసకాసరోగము లోకవిదితము. రక్తబలము అన్యాయము నిరాధారము. వారు నిజంగా సంస్కారప్రియులు. సంఘ సంస్కారమనే బురకా వేసుకొని బూతులద్వారా శాంతిపొందే స్వభావము కాదు వారిది. వారి ప్రవర్తనలోగాని, వారి మాటలలోగాని, వారు అన్యులను ఖండించినప్పుడు వ్రాసిన వ్రాత

లలోగాని వారు బూతు ధోరణిని పట్టియుండలేదు. వారిపై మరి యే నిందయైనా ఆరోపించ సాధ్యము గాని బూతు సంబంధమైన సూచనైనా సాధ్యముగాని శీల స్వభావాలువారివి. వారు అగ్నిహోత్రమువలె తీక్ష్ణమైన శుద్ధసంస్కారాన్ని నడిపిఅత్యంత సన్నిహితస్నేహితుల విరోధమును సంపాదించినవారు.

నిజముచెప్పాలంటే, ఈగ్రంథాలద్వారా కాదు, వారువారికాలములో నేమి ఆతరువాత నేమిలోకంలో విదితులు. ఈగ్రంథాలన్నీ క్షణికగ్రంథాలు; అనగా రస్కినుఅనే ఆంగ్లవిమర్శకుని మాటలప్రకారము ( *Book of the hour* ) ఆసమయానికి పుట్టిన గ్రంథాలు. అందుకే అంటారు ఈగ్రంథాలలోని పాత్రలూ ఉదంతాలూ ఆనాడు సజీవులైనవాగని. ఈ గ్రంథాల ముఖ్య ప్రయోజనము వెక్కిరించడము. ఆ వెక్కిరించిన సంస్థలపై ఆచారాలపై వ్యక్తులపై అభిప్రాయాలపై అసహ్యముకలిగితే వాటితో సంస్కారము రాగలదని వారి ఉద్దేశము. వ్యభిచారం దురాచారమైఉండేది; పరస్త్రీని ఆకర్షించడము పురుషలక్షణమని భావించినరోజులు. ఈభావాన్ని వెక్కిరించడానికి వ్రాసిన అపూర్వబ్రహ్మచర్యంలో వ్యభిచారంకథ చెప్పకతీరదుగదా. వ్యభిచారం సంస్కృతపదం; దానికి తెలుగు అంకు. "అంకు పురాణము" అన్నా వ్యభిచార కథ అన్నా ఒక్కటే వస్తువు. కాని సంస్కృతపదానికిలేని బూతు ఆంధ్రపదానికి సంక్రమించియున్నది. "ఈ అంకుపురాణము ఇక చాలును" అన్న భానుమూర్తి వాక్యములో "అంకు" అనేమాట అట్టిది. అయినా ఈ వాక్యము శృంగారానికి ఉపచరించినట్లా వెక్కిరింతకు నిరసనకు ఉపచరించినట్లా: "ఇక చాలు". ఆలాగే "బ్రాహ్మవివాహము"లో ముసలివానికి బాలికను కట్టబెట్టితే సంభవించే ఉపద్రవాలను నచ్చచెప్పి, అట్టి వివాహాలపై అసహ్యము పుట్టించడము ఆప్రహసనముయొక్క ఉద్దేశము. ఆ బాలికకు కావలసిన శరీరసౌఖ్యము వానివలన ఉండదని వర్ణించడము బూతు శృంగారానికా అట్టి వివాహాలపై అసహ్యానికా చదువరులు పరిష్కరించండి. ప్రబంధాల శైలినీ వర్ణనలనూ వెక్కిరించడానికి వ్రాయబడినవి ఆ మూడు ప్రబంధములు- ఆఫక్కిలో వచ్చిన శృంగారాలు అని. ప్రాచీనుల ప్రబంధాల సరణిని సంభోగాది వర్ణనలు వీరేశలింగంగారు చేయనేలేదు. వెక్కిరింతకు గాకపోతే వాటికి ఆనామకరణాలు ఏమిటికి? శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము. నైషధము ఎంచడానికి, దానికి మూడు బంధనాలు కల్పించడానికి ఉద్దేశము ఏమైఉంటుంది. సంస్కృత పాండిత్యము ప్రబంధనియమాలు, ఎంతకట్టుబాట్లుపెట్టితే అంత మహిమ అనే సంప్రదాయాలను ఆనాటి తోటి పండితుల ప్రగల్భాలను వెక్కిరించారు ఇందులో. అభాగ్యోపాఖ్యానము ఏమిటిగదా. అభాగ్యుడా నాయకుడు ధీరోదాత్తునివలె! ఇందుకు తీసిపోనిది రసికజన మనోరంజనం. ప్రహసనాలలో వెక్కిరించిన రసికులనే తిరిగి ఇక్కడ నాయకులుగాజేసి ప్రబంధశైలిలో వ్రాశారు వీరేశలింగంగారు. వారి రసికత అంతా వారి శృంగార చేష్టలలో గదా వ్యక్తము. అట్టి రసికులను అట్టి రసికతను వెక్కిరించడానికి పుట్టింది ఈప్రబంధము.

ఈదృష్టిలో విమర్శిస్తే వీరేశలింగంగారు రక్తబలము చేత దానిశాంతికొరకు వీటిని వ్రాయలేదని విశదపడుతుంది. పచ్చిబూతు శృంగారం కామోద్రేకానికినీ శృంగారాభిలాషకున్నూ, వీరేశలింగం గారి పుస్తకాలను చదివేవారికి అసహ్యము పుట్టుతుంది గాని కామ శృంగారము పుట్టదు. పాత్రల ప్రవర్తన ఎంత అసభ్యముగా ఉందో అంత అసహ్యముగా కూడా ఉంది. ఒకమారు చదివినవారు మరి చదవరు. స్మరించనైనా స్మరించరు. మనుచరిత్రలోని పద్యాలను కంఠస్థముచేసి ఉద్వేగంతో వాటిని పదేపదే చదివి ఆనందించే రసికులు ఈప్రహసనాది భాగాలను చదువుతారా? తంజావూరి నాయక ప్రభువులకొరకు పుట్టిన శృంగారకావ్యాలకు ఉన్న ఆదరం ఈప్రహసనాలకు ఉందా? ఇంతకూ "కావ్యాలలో శృంగారం" అన్న కావ్యసమీక్ష ప్రహసనాలకు వర్తిస్తుందా; ప్రహసనాలు కావ్యాలా నిజంగా ఆలోచిస్తే.

కాని వీరేశలింగంగారు ఈపదాలను ఈఅసభ్యాలను విడిచివేసిఉంటే బాగా ఉండియుండునని మా అభిప్రాయము. వ్యభిచార ప్రసంగం శ్రేయస్కరం కాదు; వీరేశలింగంగారి వంటి పారిశుద్ధ్యావలంబకులకు నచ్చకూడనిది. ఆచారాదుల వెక్కిరింతలో ఈదోషాన్ని దాటేరుకారు. నిజమే. కాని వ్యభిచార ప్రసంగం పచ్చిబూతు శృంగారంకాదు. అది నీతికరము అనండి. ఆప్రసంగంవల్ల ఆ ఆచారమువైపు అసహ్యము కలుగునని నిర్ణయించుకోవడములో వీరేశలింగంగారిపై దోషారోపణకు అవకాశముండవచ్చు. వారు భాషాసంస్కారులు ఏలాగో ఆలాగే ఆచార సంస్కారులు సహా. అంతేకాదు హృదయంలో భావాల సంస్కారం కావాలని ధ్వజం ఎత్తినవారు. బ్రాహ్మమతాచరణ ప్రవర్తకులు. కాబట్టి వీరేశలింగంగారి గ్రంథాలలో పచ్చిబూతు శృంగారంవచ్చియుండలేదు.

"ఇట్టి గ్రంథరచన లోకానికి హాని చేయును. దీనిని నిలుపవలయునని మామతము" అనే వాక్యా

లతో వారి వ్యాసాన్ని చాలించారు గురజాడవారు. పూర్తిగా వారితో ఏకీభవిస్తాము. కాని వారి కన్యాశుల్కంమాట ఏమిటి? దానిని మూడో ముద్రణవరకు తెప్పించారే. ప్రథమ ముద్రణనాటికి 60 పేజీల గ్రంథము ఇప్పుడు పెరిగి 192 పేజీల గ్రంథమైనది గదా. అట్టి అభిప్రాయముగలవారు ఇట్లు ఎందుకు చేశారు? లక్ష్యం తప్పా లక్షణం తప్పా. ఇద్దరు గురజాడవారా? మూడో ముద్రణకావాలని కోరినారు ముద్రాపకులు, చదువరులుకూడా. వీరేశలింగంగారి ప్రహసనాలు అలాగే సంపుటాలలో ఉండిపోయినవి. ప్రహసనాలు నాటకరంగ స్థలానికి రాలేదు. కన్యాశుల్కమో! ఎన్నోమార్లు ఎంతమందో ప్రదర్శించారు. ఎందుచేత ఇంత వ్యాప్తికలిగింది? వినోదము ఎక్కువగా ఇచ్చేది కాబట్టి. కన్యాశుల్కంలోని ఘట్టాలు ప్రహసనాలలో వాటివలెగాక చక్కగా నవ్వించేవి; అసహ్యం పుట్టించవు. పచ్చి ఆనందాన్ని ఇస్తాయి. పదేపదే చదవాలనే ఉద్రేకాన్ని కలుగజేస్తాయి. గురజాడ వారిలో నవ్వకుండా నవ్వించే శక్తి ఉంది. వారితో సంభాషణ నడిపినవారికి అనుభవవేద్యము. ఇది ఎక్కువ ఆహ్లాదానికి హేతువు. బండగా నవ్వించేదానికంటె ఎక్కువ సున్నితంగా లోపలినుండి ఉల్లాసాన్ని పుట్టించితే భావోద్రేకకారణంగా అట్టిది పరిణమిస్తుంది. కన్యాశుల్కానికి హాస్యరసప్రధాన నాటకము అని గ్రంథకర్తలే పేరు పెట్టారు. ఇంగ్లీషులో దీనిని కామిడీ అన్నారు. ఏలాగైనా వాఙ్మయంలో దీనికి ప్రహసనాలకంటె ఉన్నతస్థానాన్ని నిరూపించాలి. ప్రహసనం నింద్యవస్తుప్రభూతం. హాస్యం అంత పేలవమైనది కాదు గదా. కాబట్టి సంఘనీతికి ప్రహసనాలకంటె ఎక్కువ కీడు మేలు చేయగలిగినది ఈనాటకం.

192 పుటలు, పుటకి 32 పంక్తులు, చిన్న చీమతలకాయంత అచ్చు అక్షరాలు; ఏడు అంకాలు, 30 స్థలాలుగల బృహత్ గ్రంథం. దీనిలోని ప్రతీ ఘట్టం వీరేశలింగంగారి యెడల అప్పారావుగారు చూపిన అవినీతి, పరకీయశృంగారం, వ్యభిచారం, అంకు, సాని, ముద్దు, ఆలింగనం చన్నులు, స్త్రీపురుషుల శరీరాంగ స్పర్శనలు మొదలైన పచ్చిబూతు శృంగారమని వారు అన్నది నిండుగా దొర్లుతూ కనబడుతుంది. నాటకం ఆరంభం పరాయిస్త్రీకి వ్రాసిన లవ్ లెటరు (ప్రేమలేఖ); డాన్సింగుగర్ల్సు క్రింద ఖర్చు : ఈనాందితో నాటకం అలంకరింపబడింది. మధురవాణి - రామప్పపంతులు - మీనాక్షి; రామప్పపంతులు - మధురవాణి - హెడ్ కానిస్టేబిలు వగైరాలు; పూటకూళ్లమ్మ - గిరీశం - మధురవాణి; - ఈ ఘట్టాలు పచ్చిబూతు శృంగారంకావా? హాస్యమే అందాము. అయినాపచ్చే గదా. వీరేశలింగంగారి ప్రహసనాదులు కన్యాశుల్కంచే అణగద్రొక్కబడినవి. ఇంత పచ్చితో నిండియుండినన్నీ వీరేశలింగం గారిపై దోషారోపణచేసి తుదివాక్యాలలోని సలహాను ప్రతిపాదించిన గురజాడ అప్పారావుగారు ధన్యులు.

కన్యాశుల్కము నా వ్యాసానికి ప్రస్తుతవస్తువు కాదు. అందుచేత దానినిగురించి చర్చింపదలచుకొనలేదు. అప్పారావుగారి వ్యాసాన్ని పరీక్షిస్తే నిజంగా అప్పారావుగారికి పచ్చి శృంగారము ఇష్టపత్తేమో అని తోచకమానదు. అట్టిదానిని కళగా తలచి అనింద్యముగా దానిని పోషించినట్లు గ్రీసుదేశపు నగ్నవిగ్రహాలను, పాశ్చాత్య సంప్రదాయమైన నృత్యవేషాలను, బొకాచియో మొదలైన నాగరక గ్రంథాలను సంస్కృతాంధ్ర మహాకవుల వర్ణనలను ఉదహరించిన వ్యాసభాగాన్ని తర్కిస్తే ఆ అభిప్రాయము బలపడగలదు. బహుశః ఆదృష్టిలో వ్రాయబడిందా కన్యాశుల్కం లేదా విజయనగర లలిత కళావాతావరణములోనిదా? ఏదైనా వీరేశలింగంగారిపై అట్టి అభాండము మోపడానికి న్యాయమైన ఆధారము లేదు.

# గ్రంథపరిచయం

## ఏకలవ్యుడు

పద్యకావ్యం: కర్త: శ్రీ శంకరంబాడి సుందరాచారి; తిరుపతి; వెల 0 10 0 విద్యార్థులను దృష్టిలో పెట్టుకుని సుందరాచారిగారు అత్యంత సుబోధకంగా వుండే సులభశైలిలో ఈ రచనను సంఘటించారు. 'తెలుగు పలుకుబడి, కవితాశక్తి, సౌకుమార్యము ఈ మూడు గుణములను మూటకట్టినట్లుంది' అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఆముఖంలో మెచ్చుకున్నారు.

వీరు ఏకలవ్యుని గాథను కథావస్తువుగా స్వీకరించటంకూడా స్వయంకృషివల్ల పైకిరాదగిన సావకాశాలను విద్యార్థులకు ప్రబోధించటానికే అనుకోవలసివస్తుంది. సుందరాచారిగారు ఈ రచనలో, భారతంలోని మూలగాథకు కొన్ని చక్కని మార్పులు చేసి ఏకలవ్యుని పాత్రకు మరింత ఉదాత్తతను చేకూర్చారు.

## నవోదయం

ఖండకావ్యముల సంపుటి: రచన: శ్రీ అన్నాప్రగడ శ్రీరామమూర్తిగారు: బ్రాడీపేట, గుంటూరు. మూల్యము: రూపాయిన్నర.

ఈ కవిగారికి పద్యాన్ని చాలనం చెయ్యటంలో అత్యంతమైన ప్రతిభవుంది. భాషావిషయకంగా కూడా కూలంకషమైన పాండిత్యం వుంది. కాని యీ గ్రంథంలోని ఏ ఘట్టమూకూడా మనస్సును కదలించలేకుండా వుంది. ఇది చాలా విచారకరమైన విషయం. ఇందుకు కారణమేమాయని గ్రంథాన్ని ఆమూలాగ్రం పరిశీలించితే రచయిత సరియైన కావ్యవస్తువును ఎంచుకోవటం లేదేమో ననిపించుతుంది. మానవజీవితంలో ఏదో ఒక విషయం కవిని ఆవేశపెట్టడం, కవి తన ఆవేశాన్ని కావ్యరూపంలో వ్యక్తీకరించటం సహజమైన మార్గం. అట్టి రచన, మిగతా కవితా నిర్మాణశక్తులు వుంటే తేజోవంతంగా వుంటుంది. కాని, ఈ కవి ఏవిషయాన్ని గురించి వ్రాతామా అని అన్వేషించుతూ ఏదితోస్తే దాన్ని కథావస్తువుగా సేకరించారు. ఇందుచేత వీరు రచించిన కృతికలలో ఏ ఒకటి రెండో మినహా మిగతావన్నీ మానవజీవితానికి సంబంధంలేనివి; ప్రజాదృష్టి లేకపోవటం ఇట్టి బాధకంతకూ కారణమనిపిస్తుంది. శ్రావ్యమైన వీరిశైలిని పాఠకులు అవగతం చేసుకోవటానికి అనువుగా 'ప్రేమదేవత' అనే ఖండికనుంచి ఒక పద్యాన్ని ఉదహరించుతున్నాం:

నీదు సుధా కటాక్షముల
నిర్ఝరి పారినచోఁ గలంకమే
లేదు గదమ్మ! మానవ మ
లీమస మానస వీధులందు నీ
లో దయివారు దివ్యతయె
లోకములో హర కేశవాత్మకం
బై దరహాస మూర్తియయి
ప్రాణములన్ గనిపెట్టియుండెడిన్.

## కొండుభట్టీయం, బిల్హణీయం

[నాటక సంపుటి]

కీ. శే. గురుజాడ అప్పారావుగారు. విశాలాంధ్ర ప్రచురణాలయం. బకింగ్‌హాం పేట. విజయవాడ. వెల: రూపాయిన్నర.

గురుజాడ అప్పారావుగారు రచించిన కన్యాశుల్కం ఇదివరకు రెండు మూడు ముద్రణలై పాఠకలోకంలో బాగా వ్యాపించింది.

గురుజాడకవి రచించిన బిల్హణీయము. కొండుభట్టీయము, అసంపూర్తిగా నిలిచిపోయిన రూపకాలు. ఈ రెండు కలిపి, ఒకే సంపుటంలో పాఠకుల కందించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారభినందనీయులు.

ఈ రెండు రూపకాల్లోను బిల్హణీయంలో అప్పారాయకవి రచన అన్నివిధాలా పరిణతి, చెందింది. ఇది చారిత్రిక రూపకం. ఈరచన అసమగ్రం కావటం విచారకరం.

కొండుభట్టీయంలో తిరిగి గిరీశం మళ్లీ ప్రత్యక్షమౌతాడు. అయితే ఇతగాడి ధోరణిలో కొంత తేడా ఉన్నట్టు కనబడుతుంది. ఇదీగాక కొండుభట్టీయంలో కన్యాశుల్క రచనాచ్ఛాయలు కనిపిస్తున్నాయి.

ఈ నాటకాల ప్రచురణలో ప్రకాశకులెంతో శ్రద్ధతీసుకున్నారు. కొండుభట్టీయానికి అప్పారావు గారే రచించిన పాఠాంతరాలు కూడా దీనిలో చేర్చారు. దీనివల్ల విమర్శకులకు రచనలో అప్పారావు గారి మనస్తత్వ పరిణతిని గ్రహించడానికి బాగా వీలిచ్చింది.

ఈ నాటికలు రెండూ చక్కగా ముద్రించి పాఠకుల కందించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వా రభినందనీయులు.

## గ్రామాయణం

కర్త: 'ఆరుద్ర'; ప్రకాశకులు: కుబేరా ఎంటర్ప్రైజెస్ లిమిటెడ్, 21, సుంకురామ చెట్టివీధి, మద్రాసు-1; వెల - రూ. 1/—

'రామాయణాన్ని ఆధునిక జీవితంలోకి అనువాదం చేదామని' 'ఆరుద్ర' చేసిన ప్రయత్నం ఈ పుస్తకరూపం దాల్చింది. 'అనుకున్న బాణీలో రాయలేక పొయ్యా'నని 'చెప్పవలసినది' ఏదో కర్తే చెప్పారు కనుక ఇతరులు చెప్పవలసిం దేమీ లేదు.

కాని మన గ్రామీణ వాతావణం కంటే బస్తీల కుళ్ళు వాతావరణం, హాలివుడ్ దొంగల ముఠా ఫిల్ముల వాతావరణమే విశేషంగా వున్న ఈ కథను '(గ్రామాయణం' అని ఎందుకన్నారో మాత్రం దురూహ్యం.

దీన్ని ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం నుంచి సీరియల్‌గా లోగడ ప్రసారం చేశారు.

పోతే, ముఖపత్రంమీది చిత్రానికీ కథకూ సంబంధం లేకపోయినా, అసలు ఆ చిత్రం కంటికి చిరాకు కలిగిస్తున్నా తప్పొప్పుల పట్టీవున్నా, పుస్తకం కూర్పు, అచ్చు బాగావున్నాయి. తాపీ వారి 'తుదిపలుకు' గల తుది పుట మరీ బాగుంది.

## ఈశ్వర స్తవము

పద్యరచన: రచయిత శ్రీ కోసంగి సిద్ధేశ్వర ప్రసాద్: బాలమిత్ర సేవాసంఘ ప్రచురణ: కోడూరు, కడపజిల్లా: వెల 0-4-0.

## రుద్రమదేవి

బుర్రకథ: రచన: శ్రీ సుంకర సత్యనారాయణ; విశాలాంధ్ర ప్రరణ, విజయవాడ—2; వెల 0-6-0.

## హరనాథ భగవానుడు

రచన: శ్రీ అరకట్ల బ్రహ్మం; ప్రచురణ శ్రీ కుసుమహరనాథ సెంట్రల్ మిషన్: రాజమహేంద్రవరం: వెల 1-0-0.

## కొండవీటి కృష్ణశతకము

రచయిత: శ్రీ మానూరు రామకృష్ణారావు: ప్రచురణ: కృష్ణవేణీ వేంకట శేషాచలపతిరావు గ్రంథమాల, బందరు, వెల 0-4-0.

## ఇతరుల ఎలా ఆకర్షించాలి ?

రచన: పి. హెచ్. ఆచార్య; నవ ప్రచురణ సమితి; C/o, గోల్కొండ పత్రిక, హైద్రాబాద్ వెల 0-4-0.

## పంచాయితీ గైడ్

రచన: శ్రీ కొడాలి దామోదరయ్య: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ - 2; వెల 0-6-0.

## మార్క్సిజం అంటే ఏమిటి?

రచన మూలం: ఎమిలీ బరన్స్; అనువాదం: శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు; విశాలాంధ్ర ప్రచురణాలయం; విజయవాడ - 2; వెల: 1-2-0.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7. Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

